


చెన్నపట్టణము, సెప్టంబరు ౧౯౩౦

సంపుటము ౭ ప్రమోదూత సంవత్సరము భాద్రపదమాసము సంఖ్య ౯

# హంపీక్షేత్రము

కొడాలి వెంకటసుబ్బారావు, బి. ఏ., కామరాజుగడ్డ శివయోగానందరావు గార్లు

## కనకాభిషేకము

"గణగణ మ్రోయు ఢక్కయది కంచుదియంట చతుఃశ్రుతి ప్రచా
రణమున వ్యాసమౌని యట రాయలు మెచ్చిన కింకవీంద్రవా
రణ మృగరాజ మంట భళిరా మన డిండిమభట్టు వానిపే
రణచగ వచ్చెనా యిత డహంకృతి రూపము నెత్తలేదుగా."

అనువారు "ఇతడటయ్యా రెడ్లకవిరాజు డిండిమభట్టు నోడించు చిన్నె యొక్కటియు గనరాకున్నది వేషము దక్క లేదేమొ వాదనకు శక్తి" యనువారునై ప్రజ లంతంత పొంచి చూచెడువారునై వెంట నడచుచుండ విద్యానగరరాజవీథుల నిసుక చల్లిన నేలపైన రాలినది లేక

శారదాంఘ్రిద్వయార్చనాంభోరుహంబు-వికసితంబైన మనసులో వేవెలుంగు
తేజములు నిండిపోయి మదేభగామి-ఆంధ్రకవిరాజు శ్రీనాథు [illegible]చుండె.
"ఆగమంబుల నిధియైన విప్రుడు తల నేదయ్య జుట్టు[illegible]ప్పాదమంత
శైవమతాచారసారాఢ్యగుం డట కనరాదు పో లింగకాయ మెడను
కవిరాజ బిరుద శంఖస్వన ప్రేరితు డామంత్రి వేష మట్లావహించె
శారదోపాసనాధార దిగ్జయుడంట పెట్టలేదు ముఖాన బొట్టుగాని
ఈవిరుద్ధప్రవృత్తి తా నెటు జయించు-ద్రవిడ ధాత్రి మహావాణి తాండవించు
గౌడ డిండిమఋషి"నని "చూడవలెను-ఈవిచిత్రంబు"నని ప్రజ లేగుచుండ్రి.

తనవెంట వచ్చు శిష్యుని గాంచి నవ్వును ఈప్రజ యూహ గ్రహించినట్లు
తన వైరిదైనవాదన నూహచేయును తనలోన తానె వాదనల పెంచి
తనకవిజయదీక్ష ననుభవించిన పూర్వవిషయస్మృతుల నిష్ఠ వెరగుపడును
తనగెల్పులోన పొంగును రెడ్డిరాజుల ఆదరణాంభోధి యనుచు మరియు
దైవవశమున నోటమి తనకు కల్గు-నేమొ యను కించ కించిత్తు నెరుగబోని
తెలుగుకవిరాజు రాయల కొలువునందు-చరణమును మోపె సభయు నిశ్శబ్దమపుడు.

డిండిమభట్టు కీర్తిని గడించుటలో ముదితేరినాడు త
త్పాండితి దక్షిణాపథ విభావరి వెన్నెలలారపోసె మా
ర్తాండుని తేజ ముట్టిపడు తన్ముఖమండల మామహాత్ముపై
దండుకు వచ్చినాడు ఫలితం బనుభూతము కాదె వీనికిన్.
అని మనసులోన తలపోయు నవనిపతిని-దక్షిణకరంబు పైకెత్తి దంతదీప్తు
లావరింప మహాసభ నాకవీంద్రు-డాశుధారల నాశీస్సు లాడినాడు.

"పంపావిరూపాక్ష బహుజటాజూటికారగ్వధ ప్రసవ సౌరభ్యములకు
తుంగభద్రా సముత్తుంగ వీచీఘటా గంభీర ఘుమఘుమారంభములకు"
పూర్వాంధ్రరాజ్య సంపూర్ణశౌర్యానల ప్రత్యక్షపుణ్యప్రభావములకు
హిందూమతోద్ధారణేందూదయ వికాసచాలితాధ్యాత్మ ప్రచారములకు
గౌడ డిండిమభట్టుదా కంచుఢక్క-మోది పగిలించు సర్వవాగ్వాదనలకు
మనసుపడి ప్రౌఢరాయల మందిరమున-నడుగు పెట్టిన కవిరాజు నయ్య నేను.

"వచియింతు వేములవాడ భీమనభంగి నుద్దండలీల నొక్కొక్క మాటు
భాషింతు నన్నయభట్టు మార్గంబున నుభయవాక్ప్రౌఢి నొక్కొక్క మాటు

పలికింతు తిక్కయజ్వ ప్రకారము రసాభ్యుచితబంధముగ నొక్కొక్కమాటు
పరిఢవిల్లు ప్రబంధ పరమేశ్వరుని లేవ సూక్తివైచిత్రి నొక్కొక్కమాటు
వ్యాసమునివోలి వాల్మీకి వాక్కువోలి-కాళిదాసునివలె హర్షకవినివోలి
ప్రతిపదరసోదయంబు నాపలుకు తెలుగు-నాయకా! నన్ను ప్రజలు శ్రీనాథుడంద్రు.

వేదార్థంబులవాదమో కవితలో వీణాశ్రుతుల్ నించుటో
లేదా తర్కము నీతిసూత్రముల నాలింతో మరేదో వృథా
గాదా కాలము ఊరకున్న సెలవీగా వేడెదన్ డిండిమున్
డేదన్నన్ సరి సిద్ధమే పగులవేయింతున్ ప్రభూ, ఢక్కలన్.

గౌతమీనది పొర్లి గారవించినదయ్యె రాణ్మహేంద్రమున నారాగము విని
వేగీమహావీథి వెదజల్లినారయ్య ముత్తైదువులు చూపుముత్తియముల
బంగారుపళ్లెము బంతిభోజ్యంబులో విస్సన్నమంత్రి సేవించినాడు
నన్ను స్వీయచరిత్ర నెన్నకోరాదయ్య క్రొత్తవాడనుగాన కొంత చెప్ప
వలసెనను కవివంకకు తెలుగురేడు-చూచె డిండిమభట్టును చూచె తిరిగి
రణము వాక్కులలో విజృంభణము పెరిగె-గ్రుక్కత్రిప్పకో వీలు లేకుండె సభకు.

"వేదాలు తలక్రిందు వెలిగించినాడంట మారైన రాదు యీ మాట కేల
తర్కశాస్త్రాంబోధి తరియించినాడంట-యీయుక్తికి జవాబు నీయడేల
కవితలో వాణిరెక్కలు కట్టినాడంట అతని ధారాశుద్ధి కందడేల
పాతంజలంబు సంపత్తి వీనిదెయంట సూత్ర విరుద్ధ మిచ్చునదియేల
డిండిముడు పూర్వరూపము డించినాడో-కాక పుంభావవాణిగా కవి యితండు
పుట్టెనో భూమిపై"నని పొగడుసభ్యులాం వివాదంబు పదపద మందుకొనుచు.

వాగర్థంబులలో ప్రమాణములలో వాదంబులో సూత్రచ
ర్చాగాంభీర్యములో కవిత్వమధుధారావేగ విభ్రాంతిలో
"బాగో యీకవిరాజు యింతటి ప్రభావంబున్నదం చెంచలే
దే గర్వంబనుకొన్న నీపలుకు లన్నీ సత్యమున్ జేసితే."

అనిరి పండిత సభ్యు లందంద లేచి-జయజయార్భటులందు వర్చస్సు డింది
పాలిపోయిన డిండిమభట్టుబిరుద-కంకణము లెల్ల తెగగొట్టగా నృపుండు.

అనుమతి నిచ్చె డిండిము డహంకృతి చచ్చిన సాధుపండితుం
డనిమెడిరీతిగా నిలిచి యాసభలో పలికెన్ "ప్రశస్తవ

ర్తనులుజయాజయంబులవిధంబు గణింపరు నన్ను గెల్చినా
డని యెనికించలేదు వినయాధికుడన్ కవిసార్వభౌమునిన్.
నన్నుమించిన వానిగా నెన్నుకొందు-బిరుదములు తీసివేతును భేరి నిచట
పగులగొట్టింతు"నని చెప్పి బయటికరిగె-విజయఘోషలు సభలోన వెల్లి విరిసె.

"జయ కవిరాజ నీవిజయ శాసనముల్ లిఖియింతు రాంధ్ర వా
ఙ్మయచరితన్ సువర్ణఫలకంబులపై నిను బట్టి నాను ను
న్నయది తెలుంగు సంస్కృతి యనారత"మంచు వచించుచున్ కర
ద్వయమును మోడ్చి డిండిముడు వచ్చెను లోనికి కంచుఢక్కతోన్.

అది పగిలించినారు వలయంబులునై విరళీకృతంబులై
కదలెను శబ్దముల్ తెలుగు కావ్యసరస్వతి నూపురంబులమో
యు దినము లింకనున్నవనుచుండిరి సభ్యులు రాయలున్ సభా
సదులనుచూచి పల్కెను ప్రశాంతవచస్కు డమోఘ వాక్కులన్.

"ఏనాటిదో ఢక్క యిపుడు ముక్కలుగాను పగిలిపోయెను చింతపడ డీతండు
ఎట్టిగంభీరుడో యిట్టిగెల్పులు పొంది కవిరాజుమాట నొక్కటియు ననడు
ఇరువురును సమర్థులే శక్తియో రెండుమూర్తులు దాల్చెకాబోలు లేక
ఇట్టిమహాప్రజ్ఞలెచట వింటిమి గాంచి ధన్యులమైనాము తలచుకొలది
విస్మయముగొల్పు కథను జూపించినారు-మీ కవిత్వప్రశంసలో నాకుగూడ
స్థానము నొసంగినారు వాఙ్మయచరిత్ర-ప్రౌఢరాయలసభ పేరు పలుకుగాన.

ఇరువురు గౌరవార్హులె జయించినవారలు కొంత యెక్కువో
దురుగద నా బహూకృతులతో పనిలే దకలంకమూర్తులౌ
గురులకుగాని యీమనుజకోటి స్వభావముమార్చుకోదు దు
ర్భరముగ దెప్పిపోయును ప్రపంచకవై ఖరులెల్ల చిత్రముల్.

కాన సంభావనకై యిచ్చుతృణమేని మేరువుగా నెంచగోరినాను
కవులార"యను రాజు గద్దెపై నాసీనుడయ్యె భటుల్ విచిత్రాభరణము
లంబరంబులు కానుక లమితముల్ గొనితెచ్చి నృపమౌళి యాజ్ఞానిరీక్షకులయి
నిలిచియున్నారు సభ్యులు రాయ లింతగా నొప్పబల్కెనేయని యుబ్బిపోయి
నృపుడెవరి నెట్లుగా సత్కరించునోయని-గుక్కిళులుమ్రింగుకొనుచునుగూరుచుండ్రి
నవ్యకవితాసునాథు శ్రీనాథసుకవి - యూహ లంభోధివీచులై యూగుచుండ్రి.

"పదిపదునాల్గుశాస్త్రముల పారము ముట్టినవన్న ఢక్కతో
నదిమిన మేటికర[illegible]గునట్టి బహూకృతి యీమహాసభా
సదనములోన పండితులసన్నిధి బంగరుగద్దెమీద చే
యుదె కనకాభిషేకము ప్రభూత్తమ, డిండిమగర్వహారికిన్"

అని వచియించె డిండిము డయత్నముగా సభలోన పైడి గ
ద్దె నిలిపి హేమటంకముల దెచ్చిరి రాసులు పోసినారు రా
జును తనగద్దె డిగ్గి పిలుచున్ కవిరాజును కేలుపట్టి లే
చెను పరిపూర్ణహర్ష వివశీకృతుడై కవిరాజపూజకై.

బంగారుకొండపై పరమనిష్ఠాగరిష్ఠుండైన శివమూర్తి శోభదోప
శ్రీనాథకవిరాజు చిరునవ్వుతో హేమసింహాసనమున నాసీనుడయ్యె
పార్శ్వాల డింఠిమభట్టు రాయలు నిల్చి దోసిళ్లతో నెత్తి రాసిలోని
పైడిటంకంబులపై పోయుచుండిరి సభ్యులు పనసలు చదువుచుండ్రి
ఏమహారాజుపొందని యీయపూర్వ గౌరవంబున శ్రీనాథకవి మునింగి
విజయనగర సామ్రాజ్యము విస్తరిల్లు - ప్రార్థనలలోన తన భావఫణితి నిలిపి.

దీనారటంకాల తీర్థమాడించితే దక్షిణాధీశుముత్యాలశాల
పగులగొట్టించితే భయదవాదప్రౌఢి గౌడడిండిమభట్టు కంచుఢక్క-
[illegible]హారింపజేసితే వీరభద్రారెడ్డి విద్వాంసుయశము దిగ్వీథులందు
పలికింపజేసితే బహుళాంధ్రజనసభా భాస్వరుండనుచు ప్రపంచకంబు.

మందర మహీధరాధరమథ్యమాన దుగ్ధపాథోధిలహరికోద్భూతమైన
లలితసాహిత్యసౌహిత్యలక్ష్మినొసగి సరససద్గుణనికురంబ శారదాంబ.

తెలుగుప్రజల్ ధరిత్రి రవితేజము వెల్గిననాళ్లు సంపదల్
కలిగినవారునై సుఖముగా వసియించెడివారునై మహా
త్ములు స్తుతియించువారునయి పొందుదురమ్మ స్వతంత్రమున్ భవ
ద్బలమునవంచు దీవనలపల్కుచు లేచె సువర్ణతేజుడై.

విజయనగరాంధ్రలోక మావేళ కవిత-కన్నకానుపు ముత్యాల కాంతులందు
తెలుగుభాషాసరస్వతి విలుచుకొనెను-పైడిటంకాల కట్టులతోడి నగలు.

# మోచాకుసుమామోద విచారము

'కళాప్రపూర్ణ', 'మహోపాధ్యాయ' శ్రీ వేద[illegible] వేంకటరాయశాస్త్రిగారు

"మోచాకుసుమామోదసువాసిత
మలయనగాగతమందానిలమున"

అని శ్రీ ధర్మవరము రామకృష్ణమాచార్యులవారు చిత్రనళీయనాటకంబునం బ్రయోగించియుండ, శ్రీపూండ్ల రామకృష్ణయ్య పంతులవారు మోచాకుసుమ మన నేపువ్వని కృష్ణమాచార్యులవారిని జాబున నడుగఁగా, ఆచార్యులవారు నిఘంటువులందు మోచాశబ్దమునకుం గల వృక్షార్థములనెల్ల నొక్కొక్కటి యుత్తరముగా నొక్కొక్కజాబున వ్రాయుచు, పరిమళము లేమిచే నేదియు సరిపడక తమకుం దెలిసిన దంతియ యని తుది జాబున వ్రాసి విరమించిరి.

మోచార్థములలో నరఁటి యొకం డగుటయు, శిలీంధ్ర మనఁగా నరఁటిపువ్వని అకారాది నిఘంటువుల నుండుటయు, శిలీంధ్రమునకుం బరిమళమును మాఘకవి చెప్పియుండుటయుం బరికించి అరఁటిపూనెత్తావి యను నర్థమున మోచాకుసుమామోదప్రయోగము సమంజసము యని ఈనడుమ కొందఱు వాదింప సమకట్టినారు.

శిలీంధ్రమున నరఁటిపూవు గాదనియు దానం జేసి, మోచాకుసుమామోదప్రయోగము పూర్వోక్తమార్గమున రక్షణీయము, ప్రకారాంతరమున నేనియు రక్షణీయము గాదనియు నా యెన్నిక. గుణ మున్నచో విద్వచ్ఛ్రేణ్యులు హర్షింతురని యెంచి వాగ్దేవతాప్రీత్యర్థమై నా యభిప్రాయమును సోపపత్తికముగా వివరించుచున్నాఁడ:

శిలీంధ్ర ప్రస్తావము ప్రాచీన మహాకావ్యంబుల నివ్విధంబునం గన్పట్టుచున్నది:—

**శిలీంధ్రము (=కందళీపుష్పము) కేవల వార్షికము.**

మాఘము, ౬ (౩౨)

నవకదమ్బరజోరుణితామ్బరై
రధిపురన్ధ్రి శిలీన్ధ్రసుగన్ధిభిః,
మనసి రాగవతామనురాగితా
నవనవా వనవాయుభి రాదధే.

వ్యా. శిలీన్ధ్రాణాం కన్దళీకుసుమానామ్.... 'కన్దళ్యాంచ శిలీన్ధ్రః స్యా' దితి శబ్దార్ణవే.

మాఘము, ౬ (౩౦)

ప్రవసతస్సుతరాముదకమ్పయత్
విదళకన్దళకమ్పనలాలితః,
నమయతిస్మ వనాని మనస్వినీ
జనమనోనమనో ఘనమారుతః.

వ్యా. కన్దళీ=భూకదళీ 'ద్రోణపర్ణీ స్నిగ్ధకన్దా కన్దళీ భూకదళ్య' పీతిశబ్దార్ణవే. తస్యాః పుష్పాణి కన్దళాని. పుష్పమూలే బహుళమి త్యణోలుక్.

మాఘము, ౬ (౮౨)

ముద మబ్దభువా మపాం మయూరాః
స్సహ సాయన్తనదీపపాటలాభే,
అళినా రమతాళినీ శిలీన్ధ్రే
సహసాయన్తనదీపపాటలాభే.

వ్యా. శిలీన్ధ్రే=కన్దళీకుసుమే.

గౌడవహము, పే. (౫౫)

ధారాహయగ్గరణి ణావరుద్ధ
ణాకన్దళీసిహోఘరుసమ్,
మహర ముపగాఢసోహం
చనహాని విసమారుణం అహరమ్.

గౌడవహము, పే. ౧౧౭ (౩౮౩)

ఉష్ణాయు న్తగిరియడం
సీమాణిమ్వసిఃరుకన్దళబ్భేయమ్,

దీని ఇంగ్లీషులో—

"by the new flowers of Kandali."

విక్రమోర్వశీయము, ౪ (౫) వర్ష ర్తువు

ఆర క్తరాజిభి రియఃకుసుమై ర్నవకన్దళీసలిలగర్భైః,
కోపాద న్తర్బాష్పేస్మరయతి మాం లోచనే తస్యాః.

దీనికి ఇంగ్లీషు టీక, ౧౧౪:—

"The form, viz. boat-like hollow shape of the covers of the plantain flowers enables them to retain the rainwater in them hours, sometimes days after a rainfall."

(ఇట అనువాదంబులందు 'Plantain' అనుటం కూర్చి మదీయవ్యా ఈగ్రంథమందే రాఁగలదు.)

మేఘసందేశము.

నీపం దృష్ట్వా హరితకపిశం కేసరై రర్ధరూఢై
రావిర్భూతప్రథమముకుళాః కన్దళీశ్చానుకచ్ఛమ్,
దగ్ధారణ్యే ష్వధికసురభిం గన్ధమాఘ్రాయ చోర్వ్యాః
సారఙ్గా స్తే జలలవముచ స్సూచయిష్యన్తిమార్గమ్.

దీని యాంగలానువాదంబున

"After eating on every bank the plantain tree on which first buds have appeared..."

దీని యాంగలటీకలో పే. ౭౫.

"The blossoming of the Kadambas and the budding of Kandalis accompany the advent of the rainy season."

వ్యా. కన్దళీః భూమికదళీః "ద్రోణపర్ణీ స్నిగ్ధకన్దా కన్దళీభూకదళ్యపి"తి శబ్దార్ణవే.

కర్తుం యచ్చ ప్రభవతి మహీ ముచ్ఛిలీన్ధ్రా మవన్ధ్యాం
తచ్ఛ్రుత్వా తే శ్రవణసుభగం గర్జితం మానసోత్కాః,
ఆకైలాసాద్బిసకిసలయ చ్ఛేదపాథేయవన్తః
సంపత్స్యన్తే నభసి భవతో రాజహంసాః సహాయాః

వ్యా. ఉచ్ఛిలీన్ధ్రామ్ = ఉద్భూతకన్దళికామ్. "కన్దళ్యాంచ శిలీన్ధ్రస్యా ...శబ్దార్ణవే. శిలీన్ధ్రాణాం భావిసస్య సంపత్తిసూచకత్వా దితిభావః.

తదుక్తం నిమిత్తనిదానే—

"కాలాభ్రయోగా దుదితాశ్శిలీన్ధ్రాః
స్సంపన్నసస్యాం కథయన్తి ధాత్రీమ్."

అనువాదంబున

"able to make the earth full of mushrooms shooting (from it)"

సుభాషితరత్నభాండాగారము, పే. ౫౫౭:

గోకర్ణంగహమానాః పృథుతరపృవత
గ్రాహిణః శష్పరాఘాౕ
ఆకర్ష న్తో దిగన్తానపిచ విదధతః
కన్దళీసుప్రచారాౕ,
ఏ తే ధావన్తి వార్ధః ... మురుధను
ర్ధారయన్తస్సమన్తా
దావృణ్వన్తో ఽభ్రవీధీం వనమివ శబర
భ్రాన్తిభాజో ఽమ్బువాహాః.

మల్లికామారుతము, ౯ (౧౫) పే. ౭౬౬.

అమీకి మపివాసరాః ప్రసువతేముదం దేహినాం
విజృమ్భితనవకన్దళీవిళసిలీనపుష్పస్థయాః,
పయోదమలినీభవద్గగనదర్శనప్రోచ్ఛలత్
కృషీవలవిలాసినీనయనకాన్తితాః శిష్టితాః.

ఇందుకు కలకత్తాపుస్తకములోని వ్యాఖ్య:

వ్యా. నవకన్దళీనాంపుష్పాణి నవకన్దళ్యః 'ప్రమ్న మూలేషు బహుళమితిలుప్ విజృమ్భితాన్యేయాసవకన్దళ్యః వర్షలక్షణతయా భావిసస్యసంపత్తిసూచకాని, నూతన శిలీన్ధ్రకుసుమాని; ఉక్తంచ "కాలాబ్దయోగా దుదితా శ్శిలీన్ధ్రాః, సంపన్నసస్యాం కథయన్తి ధాత్రీమ్" ఇతి.

దీనికే ధర్మాధికారి చక్రవర్తి అయ్యాంగారు ముద్రించిన తిరుమలతాతాచార్య వ్యాఖ్య:—

అమీఇతి. విజృంభితానాం వర్ధమానానాం నవ కందళీనాం నూతనశిలీంధ్రకుసుమానాం దళేషు పత్రేషు

మా: సౌరభ్య [illegible] గ్నాః [illegible]ప్రపంధయా
భ్రమరాయేషు తే...[ఇట [illegible] ధర్మాధికారిగారి
ముద్రణమునందు ఏవర్ణక్రమ మున్నదో ఆవర్ణక్రమముననే
ముద్రింపఁబడినది]

మాలతీమాధవము, ౮ (౧౬) పే. ౨౩౦.

జృంభాజర్జగడిన్నడన్నరఘన శ్రీమత్కదమ్బద్రుమాః
శైలాభోగభువో భవన్తి కకుభః కాదమ్బినీశ్యామలాః,
ఉద్యత్కన్దళకాన్తకేతకభృతః కచ్ఛాస్సరిత్స్రోతసా
మావిర్భూతశిలీన్ధ్రలోధ్రకుసుమస్మేరావనానాం తతిః.

త్రిపురారి వ్యాఖ్య.—శిలీన్ధ్రాః పున్నాగవిశేషాః, రమ్యేత్యన్యే. శిలీన్ధ్రః కన్దలీపుష్పే కరక త్రిపుటాఖ్యయో రితివిశ్వః. త్రిపుటకేతి విచికిలాది శేషః.

చకోరవన్నామ్ము దితంకరోతి.

జగద్ధర వ్యాఖ్య—శిలీన్ధ్రం కన్దలీపుష్ప మితి విశ్వః. శిలీన్ధ్రం 'నూఱు' ఇతి ఖ్యాతమ్.

దేశికాచార్యులవారి యాదవాభ్యుదయము:—

అమృష్యమాణో విహతాం స్వపూజా
మష్టాం సహస్రేణ తదా మహేన్ద్రః,
అనేహసం రక్తశిలీంధ్రజాలై
రాకాలికైరంచిత మన్వకార్షీత్.

అందులకు అప్పయ్యదీక్షితకృతము-వ్యాఖ్యానము:—

"రక్తశిలీంధ్రజాలైః అరుణకదలీపుష్ప నివహైః, కరణైః ॥ ని ॥ కదళ్యాంచ శిలీంధ్రస్స్యా దితి శబ్దార్ణవే. అంచితం పూజితం, మనోహర మితియావత్—అనేహ సంకాలం వర్షాసమయం, తత్రైవ శిలీంధ్రాణాం విజృంభణాత్. అన్వకార్షీత్ =అనుకృతివాన్. క్షణికై రరుణ కదలీపుష్పై స్సర్వతో వ్యాప్తో వర్షాసమయ ఇవ స్థిత ఇత్యర్థః."

విక్రమార్కచరిత్రము, పే. ౭౯ (౩౫)

లలితగతి న్మయూరికలు లాస్యమొనర్పఁగ భేకసుందరీ
కలకలగానము ల్వెలుఁగ గర్జనవాద్యము లుల్లసిల్లఁ గం
దళకుసుమాంజలుల్వెలయ నర్తనశాల యనం దనర్చె
భూతలము విచిత్రవారిద వితానతిరస్కరిణీసమేతమై.

ఋతుసంహారము, ౨ (౫) పే. ౧౫.

ప్రభిన్నవైదూర్యనిభై స్తృణాఙ్కురై
స్సమంచితా ప్రోత్థిత కన్దలీదళైః,
విభాతి శుక్లేతరరత్నభూషితా
వరాఙ్గనేవ క్షితి రిన్ద్రగోపకైః.

వ్యా. ప్రోత్థితాని నిర్గతాని యాని కన్దలీనాం దళాని పత్రాణి తైః "ద్రోణపర్ణీస్నిగ్ధకన్దా కన్దలీ" ఇతి శబ్దార్ణవః.

ఆంధ్రమాఘము, పే. ౭౮ (౩౧)

గీ. విదళకందళకంపనావిష్కృతుండు
కామినీమానహరణుండు ఘనపవనుఁడు
క్షితిని వనములు కంపింపఁజేసె వనఁగఁ
జెలఁగి విరహులఁగంపింపఁజేయు టరుదె.

ఆంధ్రమాఘము (౩౩)

చ. అతులకదంబపుష్పకర
జోరుణితాంబరము ల్దుపారసం
గతములు కందళీకుసుమ
గంధయుతంబులునైన వాయువుల్
చతురత నూత్ననూత్నముగఁ
జంచలనేత్రలమీఁద సారెకుం
చితగతి రాగము న్గలుగఁ
జేసెను గాముకమానసంబులన్.

ఆంధ్రమాఘము, పే. ౯౫ (౬౨)

చ. ఘనభవవారిలాభ మది
గల్గుచునుండ మయూరము లున్మదం
బున నటియించె కేఁలులు
సముద్ధతిఁ బాఱె మదంఘ్రిదంపతుల్
పనివడి సాంధ్యదీపరుచి
పాటలభూరిసుగంధబంధుర
ప్రణుత శిలీంధ్రపుష్పముల
రక్తిమెయిం జరియించె నత్తఱిన్.

కందళి యను నీమొలకయే కేవల వార్షికము.

"కుసుమైర్ఘనకన్దళీ"—విక్రమోర్వశీ.

కదళియుఁ దత్కుసుమంబును సార్వకాలికంబులు.

వసంతమునం గదళీకుసుమము.

బాలభారతము, పే. ౮౦ (33)

మత్తేషు పక్ష్యె దయితా రసవిహ్వలేషు
పారావతేషు కృతకౌతుకకూజితేషు,
ఏషా వసన్త పరిరంభభరేణ రమ్భా
కామాతురేవ మకరన్దరసం దదాతి.

విక్రమాంకదేవచరిత్రము, పే. ౭3 (౭౧)

పానీయం నారికేళీ ఫలకుహరకుహూ
త్కారికల్లోలయన్తః
కావేరీతీరతాళద్రుమమథితసురా
భాణ్డభాజ్గ్ప్రచణ్డాః,
ఉన్మీలన్నీలమోచాపరిచయశిశిరా
వాన్త్యమీ ద్రావిడీనాం
కర్పూరాపాణ్డుగణ్డస్థలలుఠితరయా
వాయవో దాక్షిణాత్యాః.

దక్షిణమారుతముచే వసంతము సూచితము.

మనుచరిత్ర, [వసంతర్తువు.]

చ. అపరిమితానురాగసుమనోలసరైయె చిగురాకుఁజేతులం
దపసిని గౌఁగిలించె వనితా, యిదె రంభ దలంప రంభదా
నపరిమితానురాగసుమనోలసరైయె చిగురాకుఁజేతులం
దపసినిగౌఁగిలించు టుచితంబె కదా యన నవ్వె రంభ
[యుఁగా.

వసంతములో నరఁటి విజృంభణము.

మాఘము, ర (౬౯)

జగద్వశీకర్తు మిమాః స్మరస్య
ప్రభావనీకేతన వైజయన్తీః,
ఇత్యస్య తేనే కదళీ ర్మధుశ్రీః
ప్రభావనీకేతన వైజయన్తీః.

వ్యా. కదళీః=రమ్భాతరూన్. కదళీషు కామ
వైజయన్తీత్వోత్ప్రేక్షా.

అందులకు ఆం...ధీకరణము, పే. ... (౭౦)

సీ. అతుల ప్రభావ... వనం తెంచిర
సకలజగజ్జయ చతురయిదన
వీరసైన్యమునందు వితతజిత్వరకేతు
వైజయంతులు గూర్పవలయు ననుచు
విసువక కదళులు విస్తరింపఁగఁజేసె
.........................

నేమినిర్వాణకావ్యము, పే. ౪౧ (౫౦)

రమ్భారామా కురవకకమలా
రమ్భారామా కురవకకమలా
రమ్భారామా కురవకకమలా
రమ్భారామా కురవకకమలా

నేమినిర్వాణకావ్యము, (౫౧)

వృక్షైర్వసన్తతిలకాయితపుష్పజాత......

వ్యా. రమ్భాభిః కదళీభి ర్మిశ్రా ఆరామాయస్యాంసా.

ప్రసన్నరాఘవనాటకము. ౨

లక్ష్మణః—

ఆర్య, నిసర్గరమణీయోఽయ మారామః,
అధునాతు మధుమాసావతారేణ కాన్తారమణీయః,

రామః—

శ్యామచ్ఛవీనా మియమన్తరాళే
ప్రాదుర్భవన్తీ కదళీదళీనామ్,
కళేవచాన్ద్రీ నవనీరదానాం
చకోరవర్మ్మ మ్ముదితం కరోతి

*       *       *       *

హేబాల హేమకదళి ధ్రువ మీహసేకి
మూరుశ్రియం కలయితుం తరలాయతాక్ష్యాః;
ఏనాం విలక్ష్యయ విలాసవతీం చిరంహి
స్త్రీణాం కళాః పరిచితాః స్థిరతాం ప్రయాన్తి.

ఉదారరాఘవము, పే. ౧౨౭ (౪౭)

కదళీదళలీనకోకిలాభిః
కృతకోలాహలకాహళప్రపఞ్చః,
మలయానిలమత్తవారణస్థో
మదనస్తత్రచకారజైత్రయాత్రామ్.

వసంతములో అర[illegible]ల్లు పం[illegible].

కువలయాశ్వవిలాసము, పే. ౨౨ (౧,౨ పంక్తులు)

దక్షిణగరుద్విలాసహృతశోత్వ గమ్భరతాధిగతదిగమ్బగ
భాగసంజనితలజ్జయేవ పరిణతఫలభార పరిణమిశశిరోభి
రభిశోభితం రమ్భాభిః.

మనుచరిత్ర (వసంతర్తువు)

ఏటవాలైనచుదియాయరఁటిబాలెంత
చేటునకెయగు చూలుచేఁ గల్గ మేలెంత.

వేసవిలో నరఁటిపెంపు.

శార్ఙ్గధరపద్ధతి, పే ౫౮౦ (౧౭) [వేసవివర్ణనము]

సద్యస్సరణివారిశీతలతటె విన్యస్తపుష్పోత్కరే
నీరన్ధ్రె కదళీవనే గురుదళచ్ఛాయాహతార్కత్విషి,
కర్పూరాగురుపఙ్కపిచ్ఛిలఘనోత్తుఙ్గస్తనాలిఙ్గితైః
కాన్తాకేళిరతై రహః సుకృతిభిర్మధ్యందినం నీయతే.

వేసవిలో నరఁటిపండ్లు పండుట.

విద్ధసాలభఞ్జిక, పే. ౮౨ (౨)

రజని చరమయామే ప్రాదిళ స్త్రీ రతేచ్ఛాం
కిమపి కేతినయ స్త్రీ నారికేళీఫలామ్బః,
అపిపరిణమయిత్రీ రాజరమ్భాఫలానాం
దినపరిణతిభోగ్యా వర్తతే గ్రీష్మలక్ష్మీః.

ఆముక్తమాల్యద: వేసవిప్రస్తావమున:—

సీ. పరిపక్వసురభిరంభాఫలంబులతోడ......
.........ఆనరారు రసవాడిగనెలతోడ.

అరఁటిపెంపు సార్వకాలికము.

నేమి నిర్వాణము, పే. ౮౩ (౧౦)

రమ్భాభిరామం సతతం స్ఫురద్గుణకదంబకమ్,
యాదవీనాం కులం క్రీడావనం తత్రవివేశతత్.

అరఁటిపువ్వు సార్వకాలికము

ఆముక్తమాల్యద:

చ. కదళికభీరపువ్వుపుటి
కాచ్ఛట చేతుల నిప్పసింపిపై
గుదురుగనిల్పి యోపుగతిఁ
గూనల నూనియ నించి త్రాటము
న్నుదికినశాటి త్రేవ నది
నొక్కటఁ గ్రుంకిడివత్తు రెండతే
వదలక యాతనింట శని
వారమునం బరదేశివైష్ణవుల్.

అరఁటిపండు సార్వకాలికము.

ఆముక్తమాల్యద:

గీ. బోటిగట్టిన చెంగల్వపూవు పెట్టు
దరుపరిణతోరు కదళిమంజరియుఁ గొనుచుఁ
బోయి గుడినంబి విజయంబుఁజేయఁజొచ్చి
మ్రొక్కి వేదికఁ బలువన్నె ముగ్గుపెట్టి.

గీ. కపిలగవిసర్పిఁ బ్రజ్ఞుదీపకళికఁదీర్చి
ద్వయముతో వత్సమునఁ గల్వదండ నేర్చి
అగరుధూపంబు లిడి శర్కరాజ్యయుక్త
హృద్యకదళీఫలాళి నైవేద్య మిచ్చి.

క. ప్రతిదినము నిట్లుచని య
చ్యుతుపూజ యొనర్చివచ్చి సుదతివియోగ
చ్యుతధైర్యయగుచు నయ్యదు
పతిగుణములు ద్రవిడభామఁ బాడుచునుండున్.

సూర్యాలోకంబను నొక తెనుఁగు వార్తాపత్త్రికయందు ఉపవిలేఖకులు మోచాకుసుమామోదవిచార వ్యాసంబున నొకదాన పూర్వోదాహృత యాదవాభ్యుదయ శ్లోకమును, దాని యా వ్యాఖ్యానమును ఇట నీ మదీయగ్రంథంబున ముద్రించిన వర్ణక్రమ మర్యాదనే యుదాహరించి—ఈ వ్యాఖ్యలో దీక్షితులవారు తమ వాక్యమునందును తా ముదాహరించిన శబ్దార్ణవవాక్యమందును "కన్దళీ" అని వ్రాయక "కదళీ" అనియే వ్రాసినారనియు, ఆ కారణంబునం జేసి మాఘవ్యాఖ్యయందు మల్లినాథసూరి యుదాహరించిన శబ్దార్ణవ వాక్యమున "కన్దళ్యాంచ శిలీన్ధ్రః స్యాత్తు"ను దాన "కన్దళ్యాము"నట పాఠఁబాటనియు "కదళ్యామ్"నవలసిన దనియు నభిప్రాయము సూచించి— అందుల కుపబృంహకముగా శ్రీ రాజా రాధాకాంతదేవ బహద్దూరు వారి యకారాది నిఘంటువునుండి— ఇట నిందు ముద్రితమైన వర్ణక్రమముతో—శిలీంధ్రం. క్లీం. కదళీపుష్పం, (యథామాఘే

౬-౩౨: "నవకదంబరజోరుణితాంబరై రధిపురంధ్రి శిలీంధ్రసుగంధిభిః")

అని ప్రమాణము నుదాహరించి—మాఘకావ్యమందలి శిలీంధ్రము కదలీపుష్పంబుగా నెంచఁబడినట్లు కనంబడుచున్నదని నిరూపించినారు.

ఇటనెల్ల 'కన్దలీ' యనుటకు మాఱుగా 'కదలీ' అని అచ్చునం బొరఁబాటు పడినదనుట సిద్ధాంతమని వక్ష్యమాణగ్రంథమువలనం దెలియనగును. ఎంతవఱకు:—

(౧) ఈ వ్యాఖ్యయందు 'వర్షాసమయం తత్రైవ శిలీన్ధ్రాణాం విజృమ్భణాత్త'నుటచే శిలీంధ్రము కేవల వార్షికంబ యని రూఢికెక్కినది గదా.

(౨) సూరిదీక్షితులలో నొకరి వ్రాఁతంబట్టి యింకొకరి వ్రాఁతం దిద్ద దొరంకొనుట అమార్గంబు. ఈ యాదవాభ్యుదయ శ్లోకాదికములందు అచ్చుఁ బొరఁబాటులు లేవని యాగ్రహమా? అటులేని దేశికులవారికి మహేన్ద్రశిలీన్ధ్ర అఞ్చితశబ్దాంబులందును, దీక్షితులవారికి అఞ్చితశిలీన్ధ్రః జృమ్భణ శబ్దములందును, మాఘకవికి కదమ్బామ్బరాది శబ్దములందును పరసవర్ణానునాసికమే గాని అనుస్వారము గాదను విషయము తెలియదనవలసి వచ్చును. కావున నీవిషయంబున సందేహమును దీర్ప ప్రమాణము అపేక్షణీయము. మల్లికామారుతమునుండి యీ గ్రంథమున నుదాహరింపఁబడియున్న 'యమికిము'పేత్యాది సమ్పృత్తమున "నవకన్దలీ" యని మూలంబును, తద్వ్యాఖ్యయందు "నూతనశిలీన్ధ్రకుసుమాని" యని తదర్థంబును గలవు పైగా ఆ వ్యాఖ్యయందు "కాలాబ్దయోగాదుదితా శ్శిలీన్ధ్రాః సంపన్నసస్యాం కథయన్తి ధాత్రీమ్"అని నిమిత్తనిదానంబుననుండు ప్రమాణంబు ఉదాహరింపఁబడియున్నది. ఆ ప్రమాణమే మేఘవ్యాఖ్యలో "ఉచ్ఛిలీన్ధ్రామ్" అన్నచోట మల్లినాథసూరి వ్రాసియున్నాఁడు:—కావున అచట మల్లినాథసూరి యుదాహరించిన శబ్దార్ణవవాక్యమున "కన్దళ్యాంచ శిలీన్ధ్రఃస్యాత్త"నుదాన "కన్దలీ"శబ్దము పొరఁబాటు గాదనియు, దానిని "కదలీ"శబ్దముగాఁ దిద్దవలసినపని లేదనియు, దీక్షితోదాహృత శబ్దార్ణవవాక్యమందే అచ్చు పొరఁబాటనియు దీనినే కన్దలీశబ్దముగాఁ దిద్దికొనం దగుననియు, ఈ మల్లికా తద్వ్యాఖ్యలవలన తెల్లమగుచున్నది.—మఱియు దీక్షితులవారి వ్యాఖ్యతో యాదవాభ్యుదయమును అచ్చువేయించినవారు మహీశూర సంస్థాన ధర్మాధికారి శ్రీమాన్ చక్రవర్తి అయ్యంగారువారు. వారే తిరుమల తాతాచార్యులవారి వ్యాఖ్యతో మల్లికనుగూడ నచ్చు వేయించినవారు. ఆ వ్యాఖ్యయందును 'నవకన్దలీ' శబ్దమునకు 'నూతన శిలీంధ్రకుసుమార్థము వ్రాయఁబడియున్నది. యాదవాభ్యుదయటీకలో కదలీయని ముద్రించిన ధర్మాధికారిగారు మల్లికా తట్టీకలపై—మూలమందలి కన్దలీశబ్దమునంగల నకారము తప్పనియేని, వ్యాఖ్యయందలి శిలీంధ్రార్థము తప్పనియేనియు సూచింపరైరి. కావున యాదవాభ్యుదయ టీకలో వారు 'కన్దలీ' అని [నకారయుతముగా] ముద్రింపమికనుదప్పుచేతనని తెల్లమగుచున్నది. ఈ చర్చచేతనే బహద్దూరువారి కదలీపుష్పంబు పొరఁబాటనియు, వారు "కన్దలీపుష్పమ్" అని ముద్రించికొని యుండిన సరిగా నుండుననియుం దెలియనగుచున్నది.

పూ. ద్విరూపకోశమందు:

వాగురావాగురీ నస్యా న్మహిళా చ మహేష్ఠికా,
కదలీకన్దలీ న స్యా ద్దారీ చారరం తథా. ౧౧

అని "కదలీకన్దలీ" శబ్దములకు అభిన్నార్థత చెప్పఁబడినది. కావున నిబ నియ్యెరునాదములంరును పడిన ప్రయాస వ్యర్థము, అని హెచ్చరించువారికి ఉత్తరము:

ఉ. ఈ కోశమందే ముద్రితప్రకారఁబున 'కదలీకన్దలీ' యను వాక్యము మఱియొక శ్లోకమందు మఱల ముద్రితమై యున్నది. మఱియును సమూరు చమూరువులకు అభిన్నార్థత చెప్పఁబడినది.

తువరస్తూవరోఽపిస్యా త్కుపరః కూపలోఽపిచ
ఉత్తమోనుత్తమోఽపిస్యా త్కదలీకన్దలీతథా. ౧౩
పరిరమ్భః పరీరమ్భః క్రోడా క్రోడశ్చ కీర్తితః
గాణ్డీవో గాణ్డివం చాపి సమూరుశ్చ చమూరువత్. ౧౪

అమరమున:

కదలీ కన్దలీ చీన శ్చమూరుప్రియకావపి;
సమూరు శ్చేతిహరిణా అమీ అజినయోనయః.

అని సమూరు చమూరువు ... భేదము చెప్పఁబడినది. కావున సమూరువ త్తనుటకు మాఱుగా లేఖకదోషం బున చమూరువత్తని పడియుండును. ఇటులనే నయిన రూపభేదములు పయితము ఈ కోశంబున "ముసలీ ముశలీ పిచ" ఇత్యాదిస్థలములయందు ఉపాత్తములై యున్నవి. అట్లే 'కదళీకన్దళీ' అనువాక్య మిందు రెండు మాఱులుండుట పాఠమునం బ్రత్యక్షముం దోఁపఁగించు చున్నది. ఒకజత పృథ్వర్థముం దభేదమును ఇంకొకజత మృగార్థముం దభేదమును తెల్పునన వినిగమన మేమి? ఏజత దేనిం దెల్పునో? అందులకు వినిగమనం బేమి? జతను ఒకమాఱే చెప్పినచో నానార్థములందు అభేదము సిద్ధింపదా? "గన్ధర్వోఽపిచ గాన్ధర్వః" అన్నచో నానార్థములం దభేదము సిద్ధింపలేదా? ఇందు తొలిజతకు "కదళీ కన్దళీ"*

"రమ్భాయాం వైజయన్త్యాంచ" అను నానార్థరత్నమాలా వాక్యముం బట్టి కదళియనఁగా రంభ యను నప్సర యని చెప్ప నొప్పునా? "మోచాశాల్మలీ రమ్భయోః" అను మేదినీవాక్యముం బట్టి మోచకు రంభయను నప్సరనూ అర్థముగా చెప్పం జెల్లునా?

కపురపుటనఁటి పూవు శారదము.

బాలభారతము, పే. ౨౦౩ (౪౩)

యద్వనీషు చల ఖఞ్జననేత్రా
 సర్వతః శరదసౌ విలలాస,
తద్వభార భువి తత్పదలేఖా
 విభ్రమం స్థలరుహోత్పలవీథీ.

బాలభారతము, (౪౯)

సప్తదోమహీరయుక్ఛఫప్పం
 నేవ తేస్మ గజదాన సుగన్ధి,
తీక్ష్ణతక్షణ తాళనిపాతః
 క్షద్దాద పిచలా గతి భిభ్యత్.

ఆముక్తమాల్యద, ౪ (౧౪౩)

క. రవిశశిముకురములు శర
ద్యువతి మెఱుఁగువెట్టు భూతియోయనఁ బర్వెన్
బవనాహత సప్తచ్ఛద
నికరపరాగంబుదిశికి నిర్మలకాంతిన్.

శార్ఙ్గధరపద్ధతి, పే. ౫౯౪ (౯)

చేతః కర్షన్తి సప్తచ్ఛదకుసుమరసాసారసౌరభ్యలుభ్య
ద్భృఙ్గీసఙ్గీతభఙ్గీశ్రుతిసుభగదిశో వాసరాశ్శారదీనాః.

ధర్మశర్మాభ్యుదయము, పే. ౭౧ (౫౧)

అయమసజ్జగజస్య మదామ్బుభిః
 పరిమళోనతు శారద భూరుహాః,
ఇయమయం త్రిపదీత్రుటితా భిదః
 కమలినీమలినీ వితి ర్నతు.

రఘువంశము, శరద్వర్ణనము. ౪ (౨౩)

ప్రసవైస్సప్తపర్ణానాం మదగన్ధిభి రాహతాః,
అసూయయేవ తన్నాగాః సప్తధైవ ప్రసుస్రువుః.

విక్రమార్కచరిత్రము, పే. ౭౯ (౩౬)

ఉ. హారిమయూరవిభ్రమము
 లంపలఁ జెందెఁ దటిద్విలాసముల్
తాంపలఁ జేరెఁ బుష్పక
 దంబవిజృంభణ సప్తపర్ణ నా
నారుచిరప్రసూన భజ
 నంబొనరించె శరత్సమాగమం
బారయ నంబువాగము మ
 హామహిమోన్నతి నాక్రమించినన్.

మాఘము: శరద్వర్ణన, ౬. (౫౦)

వవురయుక్ఛదగుచ్ఛసుగన్ధయః... .....

ఈ కపురపుటరఁటియనం బ్రమాణము:-

మనుచరిత్ర:

అరిది యీయేడాకు లరఁటి నగు కప్పురము
సరిగాదు దానికల శశియొడలు కప్పురము.

* ఇచట మూలమున కొంచెము లోపించినది.

ఆముక్తమాల్యద, ౫ (౧౮౩)

శిశికదళీోదరచ్ఛదపుఁ బావడలూరు

చకచకఁబట్టి పాలికిఁజెరంగ.

వ్యా. శిశికదళీ=కర్పూరపు టరఁటిచెట్టుయొక్క.

నవకందళీకుసుమము (శిలీంధ్రము) పాటలము

"శిలీంధ్రైస్సహసా ము స్తనదీపపాటలాభే"

"నవకన్దళీశిఖాపరువం వహసి విషమారుణమధరం"

"అరుణత్వం ధారయద్భి రభితో౽పి శిలీంధ్రైః,"

"విడమ్బ్యమానా నవకన్దళై స్తే వివాహధూమారుణ [లోచనశ్రీః"

"ఆరక్తరాజిభి రియంకుసుమై ర్నవకన్దళీ"

"అవ్యక్తరాగ స్త్వరుణః శ్వేతరక్త స్తుపాటలః"

—అమరము.

కపురపు టరఁటిపువ్వు తెలుపు.

సుభాషితరత్నభాండాగారము, పే. ౫౬౦ (౧౧)

కాశాః క్షీరనికాశాః దధిసరవర్ణాని సప్తపర్ణాని,

నవనీత నిభిశ్ఛన్దైః శరదివత్ర్కప్రభా జ్యోత్స్నా.

బృహత్సంహిత, ౨౯ పే. ౧౫. [యమ్,

ఫలకుసుమసమ్ప్రవృద్ధిం వనస్పతీనాం విలోక్య విజ్ఞే

సులభత్వం ద్రవ్యాణాం నిష్పత్తిశ్చాపి సస్యానామ్. ౧

గోధూమశ్చ యధూకై ర్యవవృద్ధిస్సప్తపర్ణేన. ౪

గావశ్చపాటలాభిః కదలీభి రజావికం భవతి. ౬

బృహత్సంహిత, ౫౧ పే. ౧౬౭.

పనసాశోకకదళీ జమ్బూలకుచదాడిమాః,

ద్రాక్షాపారేవతాశ్చైవ బీజపూరాతిముక్తకాః. ౪

ఏతేద్రుమాఃకాణ్డరోప్యా గోమయేనప్రలేపితాః,

మూలచ్ఛేదే౽థవా స్కన్ధే రోపణీయాః ప్రయత్నతః. ౫

అజాతశాఖాన్ శిశిరే జాతశాఖాన్ హిమాగమే

వర్షాగమేచ సుస్కన్ధాన్ యథాదిక్స్థితిరోపయేత్. ౬

బృహత్సంహిత, ౫౧. పే. ౧౬౮.

జమ్బూవేతసవానీర కదమ్బోదుమ్బరార్జునాః

బీజపూరకమృద్వీకా లకుచాశ్చ సదాడిమాః. ౧౦

వఞ్జులో నక్తమాలశ్చ తిలకః పనసస్తథా

తిమిరో౽మ్రాతకశ్చైవ షోడశానూపజాః స్మృతాః. ౧౧

శ్రీమదమరచంద్ర విరచిత కావ్యకల్పలతా ప్రథమప్రతాన వర్ణ్యస్థితి స్తబకమం దిట్లున్నది.

సురభౌదోలా కోకిలమారుత

సూర్యగతి తరుఃలోద్భేదాః,

జాతీతరపుష్పచయా

మ్రమఞ్జరీభ్రమరఝంకారాః.

* * * *

వర్షా సుఘనశిఖిస్మయ

హంసగమాః పఙ్కకన్దళ్యోద్భేదాః,

జాతీకదమ్బకేతక

ఝఞ్ఝానిలనిమ్నగాహాలిప్రీతిః.

శరదీన్దురవిపటుత్వం

జలాచ్ఛతా౽గస్తిహంసవృషదర్పాః,

సప్తచ్ఛదపద్మసితా

భ్రధాన్యశిఖిపక్షమదపాతాః.

శిలీంధ్రకదళీకుసుమములు–భిన్నపదార్థములు.

ఉదాహృతవర్ణనల ప్రకరణములచేతను, నవకన్దళీ ఉత్కన్దళ కన్దళ్యోద్భేదనవకన్దళైః, ఆవిర్భూతప్రథమముకుళాః కన్దళీః ఉచ్ఛిలీన్ధ్రామ్ ఆవిర్భూతశిలీన్ధ్రా) "అకాలహాసం రక్తశిలీన్ధ్రజాలైరఞ్చితమ్," ఏతామాదిగత విశేషణస్వారస్యంబుచేతను కందళీకుసుమము (శిలీంధ్రము) కేవల వార్షికంబనియు, 'కుసుమైర్నవకన్దళీ' అనుట చేత కందళీయను నీమొలకయే కేవల వార్షికమనియును విశదమగుచుండ – ఉదాహృతకదళీవర్ణనలచే కదళియు తత్ఫలకుసుమంబులును సార్వకాలికంబు లనియును విశదం బగుచుండ, శిలీంధ్రంబును అరఁటిపూవును అభిన్నము లగుట యెట్లు ఘటిల్లును ?

"శిలీంధ్రైరత్నభూషణగణైరివ భూమిర్భూషితా" అని యున్నది. అరఁటిపువ్వు ఆకులజీబులలో స్పష్టముగా అగపడదు. కాన భూభూషణముగా నుత్ప్రేక్షకు దీనికి శోభావహము గాదు. కాన శిలీంధ్ర మనునది జీబున

మొలచుపడక వెలికే స్ఫుటముగ నిగిడియుండు పువ్వు విశేషము గానలయును.

"ఆకర్ణ్య శ్రీమాత్రధ్వనిం వసుమతీ ద(గ్ధే శిలీన్ధ్రధ్వజాః."

అరటిపువ్వు ఆకులచాటున మఱుగి అగపడ కుండును గాన దానికి ధ్వజత్వము చెప్పుట సరిపడదు. కావ శిలీంధ్ర మిట నరటిపూవు గాదు. మఱి యరటి చెట్టె యందమేని ఉఱుము బడబడయన్న మాత్రాన నరటి మొలచి నిగుడుట యనుభవపరీక్షితము గాదు. ధ్వజత్వకథనముచే మొలకయే పూవుతోడిది యభిప్రేత మని తెలంపదగియున్నది. మేఘధ్వానముచే నా మొలక పొడమి నిగుడునని

"మహీ ముచ్ఛిలీన్ధ్రాం కర్తుం ప్రభవతి తే గర్జితమ్"

అనుటచే తెలియుచున్నది.

"ఆకోపసంరక్తశిలీన్ధ్రజాలై రకాలికైః (క్షణికైః) [అఙ్కితమ్"

"నీపం దృష్ట్వా ఆవిర్భూతప్రథమముకుళాః
కన్దలీ ర్జగ్ధ్వా సారఙ్గా స్తేమార్గం సూచయిష్యన్తి"

అనుటచేత, అనగా "సారంగములు నీపకుసుమమును గాంచి పాటమరిచిన తొలిమొగ్గతోడి కందళికలను మెసవి నీదారిని సూచించును" అనుటచేత ఈ మొగ్గ యించుకతడవు క్షణము స్నె మేఘ మటుపోయిన వెంటనే జనించినదని తెలియనగుచున్నది. మేఘసంపర్కముచేత కొన్ని ద్రుమములు పూచుట ప్రసిద్ధమే గదా. నీపవృక్షంబు అట్టిదియకదా, ఇటను నీపకుసుమంబును ఈ మొగ్గయునే గదా మేఘము ఇప్పుడే యీదారిని పోయినదని సూచించినట్టివి. ఆకాలికైః (క్షణికైః)

మాలతీమాధవము :

ప్రథమప్రియాపవన సంక్రమస్ఫుర
త్పులకేన సంప్రతిమయా విడమ్బ్యతే,
ఘనరాజినూతనపయస్సముక్షణ
క్షణబద్ధకుట్మలకదమ్బడమ్బరః.

ఇందలి నూతన క్షణశబ్దముల స్వారస్యము నరయుడు.

నైషధము :

అర్థియను పేరు చెవిసోకినంతమాత్ర
జాదుకొం బులకించె నజ్జనవిభుండు
ప్రావృషేణ్యపయోధర ప్రభవమైన
గాలి సనిచిన నీపవృక్షంబువోలె.

ఇందు సోకనంతమాత్ర ననుపదముల స్వారస్యము నరయుడు.

కుమారసంభవము :

తయాదుహిత్రా సుతరాం చకాశే
స్ఫురత్ప్రభామణ్డలయా సవిత్రీ,
విదూరభూమి ర్నవమేఘశబ్దా
దుద్భిన్నయా రత్నశలాకయేవ.

క్రొత్తయురుముసకు రత్నశలాకయే పుట్టుచుండ, మొలకలు పొడముటయు ననుచుటయు వింతగాదు. కాన నిట మేఘోదయమువలన మొలచునదియు, ననుచునదియు నగు నొకానొక మొలక శిలీంధ్రముగావి, అట్టి ధర్మంబుం బోరయని దగుటచే కదలి శిలీంధ్రము గాదు.

"అమీకిముపి" శ్లోకమందు కందళీకుసుమవికాసము వృష్టికిముస్నె మేఘోదయమాత్రముననకే వర్ణింపబడినది గదా.

మాఘుడు :

"శిలీన్ధ్రసుగన్ధిభిః"అని శిలీంధ్రమునకు సుగంధము చెప్పుటచేతను, ఇచ్చోటి మాఘవ్యాఖ్యానమునను "ఉచ్ఛిలీన్ధ్రామ్" అనుచో మేఘవ్యాఖ్యయందును వ్యాఖ్యాత పదవాక్యప్రమాణపారావారపారీణ మహా మహోపాధ్యాయ శ్రీ మల్లినాథసూరి ఒకచో నిచ్చిన పర్యాయపదమునే రెండవచోటను, ఒకచో నిచ్చిన నిఘంటువాక్యమునే రెండవచోటను ఒసంగియుండుటం బట్టియు, పుట్టగొడుగునకు నీచుకంపేగాని పరిమళము లేమింజేసియు, మేఘమందు శిలీంధ్రమునకు కొందఱు ఒజ్జలు సెప్పు పుట్టగొడుగువివరణము సరిగాదు. మేఘ శిలీంధ్రవ్యాఖ్యయందు కుసుమమని నిర్దేశింపనందునను, మాఘశిలీంధ్రవ్యాఖ్యయందు నిర్దేశించినందునను, మేఘ

మున మొలకయు, మాఘమున దానిపువ్వును ఉద్దేశింపఁబడినవని యించుక భేద మగపడించవలయును.

మాఘమందు శిలీంధ్రమునకు సుగంధము మాత్రము గాక అత్యంతమదనోద్దీపకత్వము సూచిత మైనది. ఉన్నిద్రకందళశ్లోకమందు కందళముయొక్క మదనోద్దీపనమునకు లోఁగనివాఁడు కొమ్ములు లేని యెద్దని చెప్పఁబడియున్నది. అరఁటిపూవున కింత మదనప్రభావము అదృష్టాశ్రుతచరము.

కదళీధ్వజములను వసంతమునకును, శిలీంధ్రధ్వజములను వర్షర్తువునకును జెప్పుటచే నివి వేర్వేఱని తెలియుచున్నది.

"వనాయుభిః","అరణ్యేషు","వనానాంతతిః",వ "సేలకదయాః", "గిరియదేమ్", "నయయతిస్మగవాని", ఇత్యాది వనప్రదేశవాచకపదనిర్దేశంబుచేతను, విక్రమోర్వశియందలి కందళీప్రస్తావంబును, రఘువంశంబునందలి నవకందళప్రస్తావంబును వనవృత్తాంతంబుల యగుటచేను, ఉపవనవర్ణనలలో కందళి లేమిచేతను కందళి కెచటను ఫలములు చెప్పమిచేతను,—ఇది యేదో అరఁటివలెఁగాక తోఁటపెట్టనర్హముగాని యొకవానకారు కాటిమొలక గానోపు.

నిమిత్తనిదానంబున కందళీసమృద్ధికి సస్యసంపత్తిసూచనయు; బృహత్సంహితయందు కదళీసమృద్ధికి అజావికసమృద్ధిసూచనయునను భేదంబుంబట్టి యీ రెండును ఒక్కటియ గావని తలంపఁదగియున్నది.

కందళిని "కన్దలీశ్చానుకచ్ఛమ్", "ఉద్యత్క న్దలీకాన్తకేతకభృతః కచ్ఛాపరితోస్నితసామ్"

అని కాళిదాసభవభూతులు అనూపజముగా తెల్పినారు. వరాహమిహిరాచార్యుఁడు కదళిని ప్రసక్తియున్నప్పటికిని అనూపజములలో చేర్పలేదు.

"జలప్రాయ మనూపంస్యా త్పుంసి కచ్ఛస్తథావిధః" దీనను ఇవి వేర్వేఱని విశదము. —అమరము.

వరాహమిహిరుఁడు అనూపజములలో కందళిని చేర్పమి యేలయన—ఆరామప్రతిష్ఠా హతరువులే అట ప్రకృతమైనవి. తదనాగ్రహమగుటచే నందు కందళి చొరలేదు.

శిలీంధ్రపర్యాయమునకుం గందళికి "స్నిగ్ధకంద" యని యొకపర్యాయము మున్నదిగదా. అరఁటిదుంపనో జిగురులేదు. అంటుకొనుగుణము లేదు. కందళీకందమున నది యుండవలయు.

"ద్రోణపర్ణి" యని కందళీపర్యాయ మొకటి యున్నదిగదా. అరఁటియాకులు డొప్పలవలె నుండవు. అరఁటిపూరేకు లట్లుండును. ఇదియు భేదమునకు నిదర్శనము.

అమరవ్యాఖ్యాత రామాశ్రమి విద్వద్గ్రణి అమరకోశమందలి సకలపదములకును గల నానార్థములనెల్ల తత్తన్నిఘంటుప్రమాణోపన్యాసపూర్వకంబుగా వివరించినవాఁడు కందళీశబ్దము నర్థములలో గుల్మప్రభేదార్థమును వ్రాసినాఁడేగాని కదళ్యర్థమును వ్రాయఁడాయెను. అభేదమును తెల్పఁడాయెను.

శ్లోకరూపము లగు ప్రాచీననిఘంటువులలో నెందును కందళికి కదళ్యర్థములు గాని, కదళికి కందళ్యర్థములుగాని, కందళీ కదళీ శబ్దములకుం బర్యాయశబ్దత్వము గాని, కదళీవాచకములలో కందళీశబ్దము గాని, దీని ద్రోణపర్ణ్యాదిపర్యాయములు దాని పర్యాయములలోఁగాని, దాని రంభామోచాదిపర్యాయములు దీని పర్యాయములలోఁ గానియుం గానరావు. మఱి కదళికిని కందళికిని ఒకదానియర్థములు మఱియొకదానికిఁ గాకుండ వేఱువేఱు అర్థములే చెప్పఁబడి యున్నవి.

నానార్థరత్నమాల:

కన్దళీమృగభేదేస్యాత్......

కదళీ ⌋గే రమ్భాయాంవైజయన్త్యాంచ.

అమరము:

కదళీవారణబుసా రమ్భా మోచాంశుమత్ఫలా.

కాష్ఠీలా......

17

**మేదినీ:**



కదళీ కదళౌ పృశ్న్యాం కదలీ కదలౌ పునః
రమ్భావృక్షేఽథ కదలీ పతాకా మృగభేదయోః,
కదలౌ శిమ్బికాయాం చ శాల్మలీభూరుహేఽపి చ.
మోచః శోభాఞ్జనే పుంసి మోచా శాల్మలిరమ్భయోః,
కన్దళం త్రిషు కపాలే ఽప్యుపరాగే నవాఙ్కురే,
కలధ్వనౌ కన్దలీ తు మృగగుల్మప్రభేదయోః.
శిలీన్ధ్రం కన్దలీపుష్పే కబరే నాగపుష్పాన్తరే,
ద్రుభేదే స్త్రీ తు విహగీభేదే గణ్డూపదీమృదోః.

మల్లినాథధృత శబ్దార్ణవ వాక్యము:
ద్రోణపర్ణీ స్నిగ్ధకన్దా కన్దలీ భూకదళ్యపి,
కన్దళ్యాం చ శిలీన్ధ్రం స్యాత్.

త్రిపురారిధృత విశ్వకోశవాక్యము:
శిలీన్ధ్రం కన్దలీపుష్పే కర త్రిపుటకాఖ్యయోః.

జీవాజీముద్రితమైన శ్రీమదాచార్య హేమచంద్ర విరచితానేకార్థసంగ్రహమం దిట్లున్నది:

..............శిశిరః శీతలే హిమే,
ఋతుభేదే శిలీన్ధ్రస్తు తరుమీనప్రభేదయోః,
శిలీన్ధ్రం కదళీపుష్పే కవక త్రిపుటాఖ్యయోః,
శిలీన్ధ్రీ విహగీగణ్డూపదీమృదథ శీకరః,
కపాలం కుష్ఠరుగ్భేదే ఘటాదిశకలే గణే,
శిరోఽస్థని కన్దళం తు నవాఙ్కురే కలధ్వనౌ,
ఉపరాగే మృగభేదే కలాపే కదళీ ద్రుమే.

ఇందలి యధో రేఖాంకితపదములు మాత్రము నాగర పుస్తకమున పెద్దయక్షరముల నున్నవి.

ఆ పెద్దయక్కరముల పదములెల్ల వర్ణక్రమము ననుసరించి వచ్చుచున్నవి: శిశిర, శిలీన్ధ్ర, శిలీన్ధ్రీ, శీకర...కపాల, కన్దళ, కదళీ. పెద్దయక్కరముల పదములు మూలపదములుగాను కడమవి వాని నానార్థవాచకములుగాను ఈ గ్రంథమునంగల పరిపాటి. దానం జేసి యిట 'కదళీ ద్రుమే' యనుట కన్దళార్థము కాదనియు, సమాసము గాదనియు, కదళీశబ్దమునకు ద్రుమవిశేషము [అనఁగా అరఁటి] యర్థమును సర్థముగా నిది యొకవాక్యమనియు, ఇందు కదళీశబ్దము ప్రథమాంతము మూలముగాను, ద్రుమే యనిసప్తమ్యంతము వివరణము గాను గ్రంథకర్త యభిప్రాయ మనియు నేర్పడుచున్నది.

ఇట 'ద్రుమవిశేషే' అనక ద్రుమే యనుట అరఁటి యను వ్యాఖ్యను బాధక మనఁదగదు. నిఘంటుకారులు 'విశేష' పదమును మానుటయుం గలదు; కనుఁడు నానార్థరత్నమాల:

"కదళీ మృగే రమ్భాయాం వైజయన్త్యాం చ,"

ఇట 'మృగవిశేషే' అనలేదుగదా.

కొన్ని వ్రాఁతపుస్తకములలో శిలీంధ్రమని దీర్ఘమధ్యముగా నున్నదని ముద్రకుల జ్ఞాపిక.

వాచస్పత్యము—బృహదభిధానము.

కన్దళ—త్రి. కది అలచ్, ౧ కలాపే, ౨. ఉపరాగే, ౩. నవాఙ్కురే, ౪. కలధ్వనౌ చ మేది, ౫. అపవాదే-శబ్దర, ౬. కలహభేదే (వాగ్యుద్ధే), ౭. కపాలే చ—పు. ధరణిః—గౌరా—జీష్ కన్దలీ ౮. మృగభేదే చ 'స్త్రీ' మేది. సా చ భూమికదలీ "ద్రోణపర్ణీ స్నిగ్ధకన్దా కన్దలీ భూకదళ్యపీ" తి శబ్దార్ణవోక్తేః. "ధ్వజాంశుకైస్తర్జిత కన్దలీ వనః"—మాఘః; "ఆవిర్భూత ప్రథమముకుళాః కన్దలీశ్చాను కచ్ఛమ్" మేఘ పుష్పేన. "ఏదమ్భ్యసమానా నవకన్దలైస్సై:" రఘుః. "ద్విదళ కన్దళకమ్పనలాలితః" మాఘ, "నిష్పీడితేన్దుకరకన్దళజో ఽనుసేకః" ఉత్తరరామ.

భూమికన్దలీ— స్త్రీ. భూమిలగ్నా కన్దలీ శా. త. కన్దలీభేదే—మాఘః ౬-౩౧, మల్లి.

"అభ్యుల్లసత్కలికా వనరాజిరుచ్చైః"—మాఘః.

కన్దలీకుసుమ. న. కన్దళ్యాఇవ కుసుమమస్య శిలీన్ధ్రే ౬ త. భూమికదలీపుష్పే చ. ద్రోణపర్ణీ—భూమికదళ్యామ్ శబ్దార్థ.

శిలీన్ధ్ర—న. శిలీంధరతి, ధృ. క. పృషోదరాదిః. ముమ్. ౧. కదలీపుష్పే, ౨. కవకే చ—మేది. ౩. త్రిపుటాయాం—విశ్వ.

నవకందళీకుసుమము ఎఱుపుగదా, అరఁటిపువ్వు ముదిరిననేగాని ఎఱ్ఱపడదు.

శిలీంధ్రము కేవల మెఱుపుగాదు తెలుపు గలసిన యెఱుపు "సాయంతనదీపపాటలాభము" గదా. కాననే "అరుణత్వంధారయద్భి శ్శిలీన్ధ్రైః" అనుట "అవ్యక్తరాగ స్త్వరుణః శ్వేతరక్తస్తు పాటలః" అని యమరము. కాననే రఘువులో కందళీకుసుమమునకు "వివాహ ధూమ్రారుణలోచనశ్రీః" యుపమేయము సరిపొంది యున్నది. అట్లే విక్రమోర్వశిలో "ఆరక్త" యనినం బాటలమని గ్రహింపఁదగి యున్నది.

"రక్తశిలీన్ధ్రజాలైః" అన్నచోట నేత్రసాదృశ్య ముంబట్టి రక్తశబ్దము పాటలపరమనియే గ్రహింపనగు.

శిలీంధ్రమన - గపురపుటరఁటిపువ్వని యేనియు వాదింప నలవిగాదు. తొలిది యెఱుపు, రెండవది తెలుపు సంగదా.

"అడవియరఁటి వానలలోనేగాని పూవదు; మన యరఁటులు నీటిసమృద్ధిచే నెప్పుడునుం బూచును కాన కందళి(కాటి)యరఁటి గాఁదగును." అని వాదింపఁ దగదు. కందళి అనూపజముగదా.

ఒకవేళ కబ్బంబుల నెటనేనియు సార్వకాలికం బగుటం గదళికి వర్షర్తువునం బ్రస్తావము కనంబడినను, అంతమాత్రాన దానికిని కందళికిని అభేదము లభింపదు, తత్కుసుమంబును శిలీంధ్రము గానేరదు.

అకారాది నిఘంటువులందు శిలీంధ్రమన నరఁటి పువ్వను వివరణమునకు గతియేమన :—

Vaidya (వైద్యుని నిఘంటువులో)

కన్దళ I. m. n. 6. the plantain tree; కన్దళ దళోల్లాసాః పయోబిన్దవః. Am. S. 48.

III. N. A. Kandala flower. R. XIII.22.

కన్దళీ. f. 1. The plantain tree or the banana tree. కన్దళీశ్చానుకచ్ఛం జగ్ధ్వా. Megha I. 21. Rt. II. 5.

కన్దళీకుసుమ. n. A mushroom.

శిలీన్ధ్ర II. n. 1. A mushroom 'కర్తుంయచ్చ ప్రభవతిమహీ ముచ్ఛిలీన్ధ్రా మవన్ధ్యామ్.' 2. The flower of the plantain tree: 'అధిపురన్ధ్రి శిలీన్ధ్ర సుగన్ధిభిః 'Sis. VI. 32. 'అళినారమతాళినీశిలీన్ధ్రే' 72

శిలీన్ధ్రక. n. A mushroom.

ఇట కందళదళములనా నరఁటియాకులని వైద్యుని యాశయముగాఁ గన్పట్టుచున్నది. కందళిపువ్వుము యొక్క రేకులన్నయెడల మల్లినాథసూరి యభిప్రాయమునకు వ్యతిరేకము. ఎట్లన "కన్దళదళోల్లాసాః" అను నీచోటంబోలె తొలితొలి వానచినుకులకార్యము మాఘములో వర్ణితమైన "ప్రససత స్సుతరాం" మను శ్లోకమున కందళి మనఁగా భూకదళీపుష్పమని మల్లినాథసూరి వివరించినాఁడు. ఇట చెట్టనం గారణవిశేష మగపడదు

వైద్యుఁ డిట కందళశబ్దమునకు మఱియొక యర్థముగా "A Kandala flower" అని వ్రాసినాఁడు; "A plantain flower" అని వ్రాయఁడాయెను. దానం జేసి కందళమన నరఁటిపువ్వు గాదని వైద్యుని యాశయముగా నగపడుచున్నది. మల్లినాథుఁడు "ఏడమ్బ్యమానా నవకన్దలైః" అన్నచోఁ గందళమునకు నేయర్థమును నేప్రమాణమును వ్రాసినాఁడో "వికశకందళ" యన్న చోటను ఆయర్థమునే అప్రమాణమునే వ్రాసినాఁడు. ఇట్లు ఆరెంటికిని అభేదము తదభిమతమైయుండ వైద్యుఁడు అట్టివేయగు నీరెంటను ఇట భేదము తలంచినాఁడు. భేద మనుపపన్నము.

ఇది యిట్లుండ రఘువంశమును హూణభాష ననువదించిన పండితుఁడు ఇచ్చోట plantain flowers అనక "Kandali flowers" అని అనువదించి కందళము అరఁటిపువ్వు గాదనుట తెలిపినాఁడు.

మఱియు మల్లినాథసూరి రఘువులో "నవకన్దలైః", మేఘములో "కన్దళీశ్చానుకచ్ఛమ్" అను రెండు తావులను వ్రాసిన వివరణములచే కందళి యేచెట్టో కందళము అపువ్వేయని తెల్పియుండఁగా వైద్యుఁడు చెట్టు అరఁటి యనియు, పువ్వు అరఁటి కాదనియు వ్రాసినాఁడు.

మఱియును, మల్లినాథసూరి "ఉచ్ఛిలీంధ్రాః కృత్వా" మన్నచోట నేయర్థమును ఏ ప్రమాణముతో వ్రాసెనో "శిలీంధ్రసుగంధిభిః" అన్నచోటను ఆ యర్థమును ఆ ప్రమాణముతోనే నిరూపించినాఁడు. వైద్యుఁడు ఉచ్ఛిలీంధ్రమ్ అను స్థలమున "A mushroom" అనఁగా పుట్టగొడుగని యర్థము వ్రాసినాఁడు. దాని బట్టి మాఘశ్లోకమందును "శిలీంధ్రసుగంధిభిః" అనుచోట పుట్టగొడుగే అర్థము కావలయును. దానికి అనఁగా పుట్టకొక్కునకు పరిమళమును అత్యంతవిరహోద్దీపకపరిమళమును ఈ ప్రయోగమువలననే సాధింపనగును. ఇట్టి యర్థములు ఈ యాధునికాకారాదినిఘంటుకారులం బ్రమాణీకరించిన ఫలము.

మఱియు, పైఁజెప్పిన రెండుతావులను ఏకార్థము మల్లినాథవ్యాఖ్యలచే సిద్ధమైయుండఁగా తద్విరుద్ధముగా వైద్యుఁడు మేఘమునం బుట్టకొక్కనియు, మాఘమున నరఁటిపూవనియు వ్రాయుట పొరఁబాటుగా నున్నది. ఈ యర్థములలో పుట్టగొడుగే రెంటను అర్థమందురేని మల్లినాథసూరి "శిలీంధ్రసుగంధిభిః" అన్నచో నేపర్యాయపద మర్థముగా వ్రాసెనో "అళినారమతాళినీ శిలీంధ్రైః" అన్నచోటను ఆపర్యాయపదముచేతనే యర్థముం జెప్పెను. కాన నీమూఁడుతావులను ఏకపదార్థమే వర్ణితమని తలంచుట న్యాయ్యమైయున్నది. ఇందు మూఁడవతావున శిలీంధ్రము "సాయంతనదీపపాటలాభము" గదా. దానంజేసి మూఁటనుం బుట్టగొడుగయేని, పుట్టగొడుగు ఎఱుపని యేర్పడుచున్నది; ఇది యనుభవవిరుద్ధము. కాన నీ మూఁడుతావులనుం బుట్టగొడుగుగాదు. మూఁడుతావులను అరఁటిగాదన నుపపత్తి తదీయవార్షికత్వమును, మల్లినాథసూరి శిలీంధ్రమున కెచటను పర్యాయముగా కదళిని వ్రాయక కందళినే వ్రాయుటయు.

మఱియు శిలీంధ్రమునం దుమ్మెదలు క్రీడించుననియు, అవి పాటలమనియు మూఁడవయెడ వర్ణితము గదా. పాటలమనఁగా శ్వేతరక్తము. అరఁటిపూవు దొప్పవిచ్చువఱకు దాని అళికి మకరందాదికము నొసంగదు. దొప్పవిచ్చినతఱిని దొప్పగాటపు టెఱుపుగా నుండును, లోపల మీఁగడయుండును గాని తెలుపు మిగిలియుండదు.

కాన నిట నరఁటిపూవు కానేరదు. "అపరిమితానురాగసుమనోలస" గదా "రంభ". దీన వైద్యుఁడు శిలీంధ్రశబ్దార్థములకు తా వ్రాసిన రెండు మూఁడు ప్రమాణముల యర్థమును తాను సరిగా గ్రహింపమి విశదమగుచున్నది. కదళీ కందళీ శబ్దములకుం గల భూయోవర్ణసామ్యము ఈ యకారాదినిఘంటుకారాదుల యీ పొరఁబాటునకుం గారణముగాఁబోలును!

ఇందుల కింకొక యుదాహరణముం దెల్పెద:

అమరములో అజినయోని హరిణజాతి విశేషములు ఇట్లు చెప్పబడి యున్నవి.

"కదలీ కన్దలీ చీన శ్చమూరు ప్రియకావపి,
సమూరుశ్చేతి హరిణా అమీ అజినయోనయః."

ఇందులకు గురుబాలప్రబోధికలో "కదళీశబ్దము మొదలు ౬ ఆస్తరణాదులకు ఉపయోగించు చర్మమునకుఁ గారణములైన యిఱ్ఱిజాతి విశేషముల పేళ్లు" అని కదళీ కందళీశబ్దములు భిన్నవాచకములుగాఁ దెల్పఁబడి యున్నవి. అట్లే రామాశ్రమీయమందును భేదమే చెప్పఁబడి యున్నది. ఆధునిక విద్వద్వరేణ్య ప్రణీతాకారాది నిఘంటువులం గొన్నింట కదళీ కందళీ శబ్దములకు రెంటికిని వింశత్యంగుళోన్నతకురంగవిశేష మర్థముగాన భిన్నవాచకత చెప్పఁబడినది. అట్లే శిలీంధ్రవివరణంబులం గల కందళీశబ్దము మున్నాళ్ల లేఖకాదికుల ప్రమాదంబులంజేసి కదళీశబ్దముగా పరిణమించి రాఁగా రాఁగా శిలీంధ్రము కందళీపుష్పత్వముం గోలుపోయి కదళీపుష్పమై తుదకీ యకారాది నిఘంటువులందు అరఁటిపువ్వయినది గావలయును. బొంబాయిలో ముద్రితమయిన మాలతీమాధవమునం గల త్రిపురారిజగద్ధరవ్యాఖ్యలలో "శిలీంధ్రం కన్దలీపుష్పమ్" అని కన్దలీశబ్దముతోనే విశ్వనిఘంటువు ప్రవర్తింపఁబడి యున్నది; కదళీశబ్దముతోఁ గాదు. మాఘమేఘముల నాగరపుస్తకములలోను కందళి యనియే శిలీంధ్రవివరణ మున్నదిగాని కదళియని యుండలేదు. కావ్యగ్రంథములయందు వర్షాభవముగా కందళికలదేగాని కదళి లేదు. కావ్యగ్రంథంబులయందు ప్రకృతవార్షికోద్భిద్విశేష తత్కుసుమవాచకంబులుగా ఛందోబద్ధంబు

లై యసందిగ్ధరూపంబులై కదళీ కందళీకుసుమ శిలీంధ్ర శబ్దంబులే యుండుటయు, కదళియేనియు తత్పర్యాయంబులు రంభాదికంబు లేనియు లేమియుం గన నగును. దానింబట్టియు విచారింప కందళియే ప్రకృత శబ్దముగాని కదళి గాదనియు, ఎవరి ప్రమాదంబుననో అది కాలక్రమమున కదళిగా విశ్వాదుల యకారాది నిఘంటువులలో పడినదనియు తోఁచుచున్నది. ఒక్క పొరఁబాటు ఇన్ని యాధునికనిఘంటువుల దు నెక్కొనుట వింతగాదా యందురేని, వింతగాదు; ఎట్లన చిత్తగింపుఁడు. ఈ యాధునికాకారాదినిఘంటువులకెల్ల ముందుది, ఒండె, ముఁదుని, ఆకరములు. కావ తొలి నొక్కెంటఁ గల్గిన ప్రమాదము కడను యన్నిటను నెక్కొనుట ప్రాయికము ఈ కదళీకందళుల యభేదభ్రమకు "కదళీ కన్దళీ చీనః" అను నొఁగల "కదళీ కన్దళీ" యను ముక్కయుం గారణమైయున్న నుండవచ్చును. అట్టి పొరఁబాటును గలుగునా యని యాశ్చర్యమేని, ఆ పొరఁబాటును ఈ యకారాది నిఘంటువుకారులు చేసిరని నామాట గాదు, అట్లో యిట్లో జనించి యా పొరఁబాటు తుదకు నీ గ్రంథములందు సంక్రమించి యుండునని నా తలంపు.

ఈ క్రింది గ్రంథములం గనుఁడు:

| | |
|---|---|
| శాకుంతలము | కాళిదాసీయము |
| ఆంధ్రశాకుంతలము | పిశెళలింగీయము |
| ,, | నాసీయము |
| ,, | శ్రీరామీయము |
| ,, | వేంకటరాజీయము |

ఇందు నడిమూఁటను వస్తువొక్కటియే; చిగురని యు, మొగ్గయనియు నిరుదెఱంగుల పల్కులు పేర్కొనంబడి యున్నది. అంతటను మొగ్గయేగాని చిగురుగాదని తుదిదానం దెలియుచున్నది. తొలిదాని తాత్పర్యంబు నదియయని నా మతము. దిగంబరులనాట గోచి పెట్టుకొన్నవాఁడేగదా నింద్యుఁడు.

ఉదాహృతములలో కొన్నిటికి ఇంగిలీషులో టీకలు అనువాదములు వ్రాసినవారును కొందఱు పొరఁబాట్లు గావించినారు. ఎట్లనః—రఘువునకు ఇంగ్లీషు వ్రాసిన పండితులు కందళి యనఁగా కదళియని పొరఁబాటు పడలేదు. "నవకన్దళైః" అనుదానిని "by the new flowers of Kandali" అని పరాణీకరించిరి. "-of the plantain" అని పరాణీకరింపలేదు. విక్రమోర్వశికి టీక వ్రాసినవారు "నవకన్దళీ" అనుచో "Plantain" అని స్పష్టముగా నిర్దేశించినారు. మూలములోని నవశబ్ద స్వారస్యముచే నీమొలక కేవల వార్షికమనియు, దానంజేసియే ఇది కదళి [అనఁగా Plantain] కాదనియు విమర్శించుకోరైరి. మేఘపరాణీకర్త "కన్దళీశ్చానుకచ్ఛమ్" అనుచో "The Plantain tree" అని అనువాదము వ్రాసినాఁడు; దానికే టీకలో "Kandalis" అని టీకాకారుఁడు వ్రాసినాఁడు. ముద్రితప్రకారంబున పరాణీకర్తయు టీకాకర్తయు నొక్కరుండగా నున్నది. కాని యీ భేదంబుం గన విద్వాంసులు పండితు లీరెండుపక్షం గావించినట్లు తెలంపందగియున్నది. "ఉచ్ఛిలీన్ధ్రామ్" అన్నచో "mushrooms" అని యనువాదము వ్రాయఁబడి యున్నది. అది పొరఁబాటని సోపపత్తికముగా తెలిపియే యున్నాఁడఁగదా.

ఆంధ్రించినవారు ఇట్టి పొరఁబాటులు సేయక "విదళకన్దళ" యనుదానికి "విదళకందళ" యనియు "శిలీంధ్రసుగన్ధిభిః" అంటను "కందళీకుసుమగంధయుతంబులునై" అనియు "అలినీశిలీంధ్రే" అనుదానికి "షడంఘ్రి ంపతుల్-పణుతశిలీంధ్ర పుష్పముల" అనియు సరిగానే రచించినారు.

మాలతీటీకలో శిలీంధ్రమనఁగా పున్నాగవిశేషమని వివరణము ముద్రితము. అందులకు ప్రమాణముగా పున్నాగశబ్దమేని తత్పర్యాయమేనియు లేనిది నిఘంటువాక్యము ముద్రితమై యున్నది. అందు శిలీంధ్రశబ్దమునకు కందళీకుసుమము, పడుల్లు, వర్షాకాల మల్లెయు నను మూఁడు అర్థములు చెప్పఁబడియున్నవి. ఇందొకటియు పున్నాగమేని, పున్నాగవిశేషమంగాని యుం గాదు. కావన "పున్నాగ" యనుమాట మూలములో 'పుష్ప'యనుటకు పొరఁబాటుగా పడియున్నది.

శ్రీపు. ఆ వ్యాఖ్యయందే "ర[illegible]భృత్యన్యే" అనుటం గన త్రిపురారికాలమునకే శిలీంధ్రమును రమ్భాపుష్పమని తలంచు పొరబాటు కలిగియుండుననియు, అందులకుం ప్రమాణము గానరామి నాతఁడు దానిని గ్రహింపలేదని యు నెన్నఁదగి యున్నది. భూరంభ యనుటకు అచ్చు లో భూపదముం దొలఁగించిరో యనియు సంశయింపఁ దగియున్నది. ఈ పుష్పమేదో రూఢిచేసికొనఁజాలక త్రిపురారి యిన్ని వ్రాఁతలు వ్రాసెనని తోఁచెడిని.

మఱి యీకందళి యను మొలక యేమొలక యనఁగా—ఇట్లు తోఁచెడిని.

కదళీపర్యాయములలో నెచటను భూకదళి కాన రాదు, కందళీపర్యాయములలో భూకదళి కలదు. మాఘమేఘముల కెంటనం గందళిని భూకదళి యనియే మల్లినాథసూరి వ్రాసెనుగదా. లెంబను భూమిశబ్దమును మానక నిక్కాలిపెఁగదా. స్వార్థమందు, భూమియనఁ గా భూమియనియు, భూచంద్రుఁడనగా చంద్రుఁడని యు, భూకాకమనం గాకమనియు, నిష్ప్రయోజనార్థముగా భూశబ్దము పూర్వపదముగాఁ బ్రయోగింపంబడునని వాదించువారితో నేను డీకొనను. వేమెట్లు నేలవేము గాదో, తాడి యెట్లు నేలతాడిగాదో అట్లే కదళియు భూకదళి గాదు [కందళి గాదు, శిలీంధ్రము గాదు] అనుట న్యాయ్యము. నేలవేఁపదూలములును, నేలతాడి మ్రాఁకులును లేవుగదా. వృక్షవిశేషవాచకములకు పూర్వ పదముగా ప్రయుక్తమగు భూవాచకము క్షుద్రత ద్యోతకముగా నుదాహరణములం దగపడుచున్నది. "భూఖర్జూరీ = క్షుద్రఖర్జూరీ", భూధాత్రీ=భూమ్యామ లకీ="నేలయుసిరిక". ఉసిరిక మహావృక్షము, నేలయుసి రిక లొడితెడు మొలక. "భూనిమ్బః = నేలవేము" వేము మహావృక్షము, నేలవేము లొడితెడు మొలక; అట్లే భూ [illegible]కి అనఁగా కందళికి చెప్పిన వర్ణనలకు ఒప్పునట్టిది [illegible]టి యని యొకటి కలదు. అదియే యీమాట [illegible] పెద్దలునుం జెప్పుట కలదు. దాని యాకులు [illegible]కులవలె నుండును కాని, చిన్నవి; చెట్టును [illegible]వలెనే యుండునుగాని, చిన్నది దాని పువ్వు [illegible]లో వ్రాఁగియుండక, మీదికి నిగిడియుండు

ను ఎఱ్ఱగా నుండును. అది వార్షికము, తోఁటపెట్టం దగినది గాదు. కాన పెద్దలమాటబడి దానినే కందళీ శబ్దార్థముగాఁ గొనుట యుచితము.

మఱి శిలీంధ్ర మేనుయిన మనకేమి, అరగడకు ఈరగడ యేల? పుష్పమాత్ర సాధారణంబగు పరిమళము మోచాకుసుమమునకు (అరఁటిపువ్వునకు) ఏల యొప్పకో రాదు, అని యాక్షేపమేని,—మోచయన నరఁటియు శాల్మలియు; రెండింటి పువ్వులును ఎఱుపు. పుష్పమాత్ర మునకు పరిమళము సిద్ధంబయినను ఎఱ్ఱపూవులకు అది లేమి ప్రసిద్ధము. అట్లే యభియుక్తుల యనుభవసారోక్తి. Bain's Induction. P. 52.

In flowers there is a remarkable concurrence between the scarlet colour and the absence of fragrance. The following quotation gives a selection of instances.

'Among all the colours that blooms assume none are less associated with fragrance than scarlet. We cannot at present recollect a bright scarlet blossom that is sweet scented—yet no other colou among flowers is more admired and sought after. Scarlet prevails among Balsamina, Euphorbia, Pelargonium, Poppy, Salvria, Bouvardia, and Verbena; yet none of the scarlets are of sweet perfumes. Some of the light-coloured Balsams and Verbenas are sweet-scented, but none of the scarlets are. The commonsage with blue blossoms, is odoriferous both in flower and foliage; but the scarlet Salvias are devoid of smell. None of the sweetr scentedleaved Pelargoniums have scarlet blooms, and none of the scarlet bloomers have sweet scent of leaves nor of blooms. Some of the white-margined Poppies have pleasaut odours; but the British scarlets are not sweet-scented. The British white blooming Hawthorn is of the most delightful fragrance; the scarlet flowering has no

smell. Some of the Honey suckles are sweetly perfumed, but the Scarlet Trumpet is scentless.' (Elder, American Gardener's Monthly).

మనకు కింశుకాదుల పరిమళాభావము అనుభవసిద్ధమేగదా, ఉక్తిసిద్ధంబును. "నిర్గన్ధా ఇవ కింశుకాః", పూర్వోక్త 'వేమ' వాక్యంబువలన ఎఱుపు కాఱెఱుపు గాక ఇంచుక తక్కువలై యితరవర్ణములు ఏవేని మిశ్రములైయున్న పువ్వులకు గొజ్జంగ లోనగువానికిం బరిమళము అనుపపన్నము కాదు. అట్లే పూర్వోక్త శిలీంధ్రము పలాశమువలె కేవలము "అతిలోహితము" గాక, "పాటలాభము" గావున దానికిం బరిమళము ఉపపన్నము. అరఁటిపూవును బూరుగుఁబూవును కాఱెఱుపులు, గాన వానికిం బరిమళము ఉపపన్నము గాదు. ఈ యుపపత్తులను అభియుక్తోక్తులు నేల, అనుభవముచే నరఁటియేని, బూరుగేని, రెండునేని, పరిమళవంతములు గాఁగూడదా యని యధిక్షేపమేని—వినుఁడు:

అనుభవమే సర్వోత్కృష్టప్రమాణము, అరఁటిపూవునకును, బూరుగుపూవునకును పరిమళము లేమి యనుభవసిద్ధము. ప్ర ఉంచనింతు, పంచభూతమయంబగు నీప్రపంచంబున పృథివీభూతసంబంధి యగు గంధమేమాయెను? ఆ గంధము లేకపోలేదు. కాని, ఈ యరఁటిబూరుగుల గంధము నలిపి ముక్కుతోఁ బలందూర్చికొని యొకఁబీల్చినఁగాని యించుకేనియు తెలియరాదు. ఆ యించుకయు పరిమళము గాదు. ఆమోదమనందగినది కానే గాదు; అనఁగా మనుష్యఘ్రాణేంద్రియగోచరంబుగా గాలిలోఁ జేరి వ్యాపించునది కానే గాదు. "శిలీంధ్రసుగన్ధిభిః వనవాయుభిః"

"విమర్దోత్థే పరిమళో గన్ధే జనమనోహరే,
ఆమోదస్సోఽతినిర్హారీ...........
సమాకర్షీ తు నిర్హారీ సురభిర్ఘ్రాణతర్పణః."

—అమరము.

"పరిమళః=నానాద్రవ్యములను మెదుపుటవలనఁబుట్టినదై జనులకు మనోహరమయిన గంధము పేరు. ఆమోదః—అతినిర్హారీసః=మిక్కిలి దూరముగా వ్యాపించునట్టి యా పరిమళము పేరు" అని టీక.

మల్లె, సంపెంగ, గొజ్జంగ—ఏనమాదులను వాసనవలననే ఇరువది ముప్పది యడుగుల దూరమునుండియే కనులం గాంచకయే కలవని యెఱుంగవచ్చును. వాని వాసనయు కరమభిలషణీయము, కాననే వానిని లోకులు శ్రమపడియేనియు సంపాదించి చెంతఁ జేర్చుకొందురు, ధరింతురుగదా. అరఁటిబూరుగుల యునికిని చూడ్కిచే నెఱుంగఁదరమేగాని శాఖలలోనే యున్నను వాసనచే నెఱుంగఁదరముగాదు. పరిమళార్థ మెవ్వరును అరఁటిబూరుగులను చెంత నుంచుకొనుట నిప్పటి కింకఁ గని విని యెఱుంగము. గొజ్జంగను గేదంగిం బోలె బూరుఁగును అరఁటిని (కత్తిరించి) జడయల్లుకొను భాగ్యశాలినులు లేరు.

అరఁటిపూరేకులు తెలుపు గల్గు పాలకు ఇంచుక వాసన కలదు, అదియు ఒకగజము దూరమేని ప్రసరింపఁజాలదు, అభిలషణీయమునుం గాదు. దానిని తావి యనం జనదు. అది వెగటుగా నయినను ఉండును. [ఈ యనుభవంబునకే శిలీంధ్రమున నరఁటి గాదని యెఱుఁగందగును]. సుగంధియరఁటి యను వ్యవహారము ఫలప్రయుక్తము గాని పుష్పప్రయుక్తము గాదు. అట్టి యీ పువ్వునకు పరిమళము చెప్పుటయు, అందును అత్యంతమదనోద్దీపక పరిమళముం జెప్పుటయు, ఆపరిమళమునకు లోఁగవి వానిని పసరమని దూఱుటయు నొప్పఁదగిన విషయములు గావు.

ఇవ్విధంబున ననుభవమునకును మహాకవుల రచనలకును విరుద్ధమయిన యరఁటిపూ పరిమళమేనియు బూరుగుపూతావియేనియు సత్ప్రసిద్ధకవుల ప్రబంధములయం దెచ్చటేని త్రవ్వి కనిపట్టినను అయ్యది సాహసికోక్తి యని యనాదరణీయంబ.

పూర్వోక్తమయిన రామకృష్ణయాచార్యులవారి రగడలో మోదయుతు సామాన్యవాచకమును సప్తపర్ణరూప విశేషాభిప్రాయకముగానేని కొందమన్న నందులకు ప్రతిబంధకముగా వారు మోదతో మలయమారుత

మును జోడించినారు. మలయమారుతము వసంతమును దెల్పుచు సప్తపర్ణవికాసమున కెడ మెల్లక యున్నది. కావున మోచాకుసుమామోద ప్రయోగము అపప్రయోగంబు.

శ్రీ పూండ్ల రామకృష్ణయ్య పంతులవారి యాక్షేపంబు అసమాహితంబు.

## ఇందుదాహృత గ్రంథములు

మాఘము
గౌడవహము
బాలభారతము
భోజచంపువు
శార్ఙ్గధరపద్ధతి
ధర్మశర్మాభ్యుదయము
రఘువంశము
విక్రమోర్వశీయము
మేఘసందేశము
౧౦ సుభాషితరత్నభాండాగారము
మల్లికామారుతము
మాలతీమాధవీయము
యాదవాభ్యుదయము
విక్రమాంకదేవచరితము
౧౫ ఋతుసంహారము
అభ్రమాఘము
మనుచరిత్రము
నేమినిర్వాణకావ్యము
ప్రసన్నరాఘవనాటకము
౨౦ ఉదారరాఘవము
కువలయాశ్వవిలాసము
విద్ధసాలభంజిక
ఆముక్తమాల్యద
జక్కన విక్రమార్కచరిత్రము
౨౫ బృహత్సంహిత
నైషధము
కుమారసంభవము
నానార్థరత్నమాల
మేదిని
౩౦ శబ్దార్ణవము
విశ్వనిఘంటువు
వైద్యనిఘంటువు
సర్వశబ్దసంబోధిని
అమరకోశము
౩౫ శాకుంతలము కాళిదాసీయము
,, వీరేశలింగీయము
,, నరసీయము
,, శ్రీరామీయము
,, వేంకటరాజీయము
౪౦ అప్పయ్యదీక్షితవ్యాఖ్య
మల్లినాథవ్యాఖ్యలు
జగద్ధరవ్యాఖ్య
త్రిపురారివ్యాఖ్య
తిరుమలతాతాచార్యవ్యాఖ్య
౪౫ రఘువంశపురాణానువాదము
మేఘ పురాణానువాదము
,, పురాణటీక
విక్రమోర్వశిపురాణటీక
౪౯ Bain's Induction

# కృష్ణరాయబారము

దువ్వూరి జగన్నాథశర్మ గారు

౧

పేదవడి పాండవేయులు వెతలఁగూరి
 యోర్మిమీఱి-మఱి- తెగించి యున్నవారు-
పెంపువడెను: దుర్యోధనసంపద-యది
వారిమధ్యఁ గృష్ణుఁడు రాయబారి యయ్యె.

ఆఁడువాండ్రను మెలపించి, యగడు వడిన
యతఁడు—కృష్ణుఁడు! భళిర! రాజాధిరాజు
లందఱుండ—మహారథు లతిరథులగు
నవనిపు లటుండఁ గృష్ణుఁడా? యగుటదూత?

స్త్రీధనాద్యనురక్తిఁ బ్రసేనజితుని
హత్యగావించి మణిఁగొనె ననుచుఁ గృష్ణు
నూరువాడయు నేకమై కాఱులనరె?
అతని యపకీర్తి కొండంత యగుట వినమె?

అది గణింపఁడు చలపాది యతఁడు తివిరి
జాంబవతిచెల్మిఁ గైసేసి, సత్యభామ
తనకుఁ బదసేవ సేయునంతకును విడఁడు
గోపికాలోలుఁ డతఁడా కొనకు దూత?

౨

స్థలమ్ము జలమని స్థలమని జలముఁ దలఁచి
మయసభను మాయచే నవమాన మంది
వచ్చె దుర్యోధనుండు ద్రోవది హసించె
నంత భారతాహవ బీజమయ్యె నదియె

అదియ ద్రౌపదీవస్త్రాపహరణహేతు
వది: మఱలఁ బాండవేయుల మదిఁ గలంచె
నిట్టు లొండొరుల్ పెరిఁగి రోషించునపుడు
ఆఁడుతగవుల వఱియాద కగున దెవరొ?

ఏదిసత్యమొ! యెఱిఁగి యోచింతుమేని
కృష్ణు నపకీర్తిగూర్చి భాషింపనేల?
తనసతులతోడి యాఁడి తానువడెను
గోపికలు * రుద్రగణికలకులమువారు

తడవె సాందీపునూర్ధ్వరేతస్కవిద్య
నతఁడు: విబుధుఁడు రాజశాస్త్రార్థవేత్త
స్వార్థవిరహితుండగు రాయబారి యతఁడు
కృష్ణు ననఁబోల దతని కింకెవరు సాటి?

---

* "Deva dasi :—In old Hindu Works, seven classes of Dasis are mentioned, Viz.,
(1) Datta ... ... (2) Vikrita ... ...
(3) Bhritya ... ... (4) Bhakta ... ...
(5) Hrita ... ... (6) Alankara ... ...
(7) Rudra Ganika or Gopika, who receive regular wages from a temple, and are employed to sing and dance".—

—Edgar Thurston's
Castes and Tribes of Southern India.

గోపికలు=రుద్రగణికలు. బ్రాహ్మణపరివ్రాజక శబ్దములో బ్రాహ్మణశబ్దము లోపించి పరివ్రాజకుఁడు మిగిలినట్లు, రుద్రగణములోనివారను నర్థమున బైలుదేరిన రుద్రగణిక లనుమాటలో రుద్రశబ్దము లోపించి నేఁడు గణికలని మిగిలినది. గోపికలనఁబడు వీరు కొందఱుతలఁచు నట్లు మగనాండ్రు కారు.

# చింతలపూఁడి రాధామాధవకవి

శ్రీ శేషాద్రి రమణకవులు (శతావధానులు)

25

శ్రీ కృష్ణదేవరాయలయాస్థానమునఁ బ్రసిద్ధి నొందిన మహాకవులలో నీ రాధామాధవ కవియొకఁడు. రసవత్తరమగు నీతని కవితామృతము నాధునికరసికలోకమున కింతవఱకుఁ బరిచయము కాకుంట విచారకరము. రావుబహద్దుర్ కం. వీరేశలింగము పంతులువారు ఆంధ్ర కవుల చరిత్రములో నీరాధామాధవుని బేర్కొని నగరు, పగరు, తొగరు, వగరు అను పదములు చరణాదియం దుంచి భారత భాగవత రామాయణార్థములతో నీకవి రచించిన పద్యరత్నములను మూటి నుదాహరించినారు. రసవత్తరము లగు నీపద్యములు సాహిత్యప్రియుల నాకర్షించి రాధామాధవుని కవితారసము జవిచూడఁ బ్రోత్సహించినవి. కాలగర్భమున మరుగుపడిన యీకవి గ్రంథములు చదువుటకును జీవితచరిత్రము దెలియుటకును దగిన యవకాశము లింతవఱకును సమకూరకపోవుట శోచనీయము.

సారస్వతశోధకులును విద్వదగ్రణులు నగు బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవి (యం. ఏ.,)గారీమహాకవి యుదంతమును మదరాసు విశ్వవిద్యాలయ పక్షమున నొసంగిన ఆంధ్రభాషాచరిత్ర మను నుపన్యాసమున నీ క్రింది విధముగఁ జెప్పినారు.

"చింతలపూఁడి ఎల్లయ్యకవి యొక్క వంశమునందు వరుసగా ఎనిమిది పురుషాంతరముల వఱకు పలువురుకవు లుద్భవించిరి కడపజిల్లాలో పెన్నానదీతీరమున చింతలపూడి యను గ్రామమున వసించి కృష్ణరాయలచే సన్మానింపఁబడెను. రాధామాధవమను గ్రంథమును రచించి శ్రీ కృష్ణున కర్పించెను. అచ్యుతరాయలచే నీకవికి " రాధామాధవ " యను బిరుద మొసఁగఁబడెను. తారకయోగము, శ్రీరాముని ఆధ్యాత్మిక దైవిక మహత్త్వములను దెలుపు తారకబ్రహ్మరాజీయ మను వేదాంతగ్రంథమునుగూడ రచించెను. సకలము తిమ్మయామంత్రి యగు నంజయకుమారుఁడు తిమ్మయ కీపుస్తకము కృతియొసంగఁబడెను. వీరి యేడవ మనుమఁడు మధురవాణీ విలాసమును, నాలవమనుమఁడు సంజీవకవి చంద్రాంగద చరిత్రమును, మూఁడవ మనుమఁడు ఛాయాపతి రాఘవాభ్యుదయమును రచించిరి. ఈ కుటుంబమునందలి కవులలోనెల్ల నీతని కవిత్వ ముత్తమోత్తమ మైనది.

(మా. ఆంధ్రపత్రిక, తే 22-4-21 ది.)

సూత్రప్రాయము లగు నీవాక్యముల యాధారమున నీకవి జీవితచరిత్రము తెలిసికొన యత్నించెదము. ఇంతవఱ కీకవి రచించిన గ్రంథములు మూఁడు లభించినవి. రాధామాధవము, విష్ణుమాయావిలాసము, తారకబ్రహ్మరాజము అను నీమూఁడుగ్రంథములలో విష్ణుమాయావిలాసము శ్రీ రామకృష్ణకవిగారు

పేర్కొనకపోవుటచే నిది వారి కపరిచితము గానోపు. ఇక్కవి తనవృత్తాంతము నీక్రింది విధముగఁ జెప్పుకొనెను.

సీ. శ్రీవత్సలాంఛన శ్రీముఖాంబుజమున
శ్రీవత్స మునికులశేఖరుండు
ప్రభవించె నామహాభాగువంశాంభోధి
దివ్యరత్నంబుల తెఱఁగుమీఱఁ
బుట్టి రనేకులు పురుషార్థపరులైన
వారు వారలలోన వంశకర్త
వర్ణితసత్కీర్తి వల్లభుఁ డొప్పారె
నతనికి శ్రీకృష్ణుఁ డవతరించె
నతనియందుఁ గామనార్యుఁడు జన్మించె
నతనికేను లచ్చమాంబయందు
జననమైతి నెల్లసత్కవిచంద్రగండ
సరసహితచకోర సంఘములర.

ఉదాహృత రాధామాధవ పద్యము వలనఁ బ్రకృతకవినామము ఎల్లసత్కవి. శ్రీవత్స గోత్రుఁడు. తాత శ్రీకృష్ణార్యుఁడు. తండ్రి కామనార్యుఁడు. తల్లి లచ్చమాంబయని తెలియును. ఈయెల్లయకవికి రాధామాధవనామము వచ్చిన సందర్భము రాధామాధవ కృత్యాదియందలి యీక్రిందిపద్యమునందుఁ గలదు.

శా. రాధామాధవ మచ్యుతాంకితముగాఁ
బ్రౌఢక్రియం జెప్పి త
న్మాధుర్యంబునఁ గృష్ణరాయవిభుఁ గ
ర్ణాటేశు మెప్పించి, నా
నాధాత్రప్రతిమాన సత్కవులలో
నన్ భూషణశ్రేణితో
రాధామాధవ నామమందిన జగ
త్ప్రఖ్యాత చారిత్రుఁడన్.

ఈపద్యమువలనఁ గృష్ణదేవరాయలే ఎల్లనకు రాధామాధవనామము ప్రసాదించినటుల స్పష్టమగుచున్నది. అచ్యుతరాయ లీ బిరుదము నొసంగినటుల రామకృష్ణకవిగా రూహించుటకుపపత్తులు గోచరింపవు. ఎల్లయకవి విష్ణుమాయా విలాసము రాధామాధవము గద్యములందు "రాధామాధవ యెల్లనార్యుఁడు, యెల్లనార్యుఁడు" అను నామముల నుపయోగించికొనెను. తారకబ్రహ్మరాజమున నేనామము జెప్పుకొనుటమాని బిరుదనామమునే నామముగాఁ జెప్పుకొన్నాఁడు.

క. రాధారుణాధరోరుప
యోధర కాశ్మీర వరరసోదయ కవితా
మాధుర్యధుర్య నన్నున్
రాధామాధవుని సుకవిరత్నముఁ బలికెన్.

గద్యము. శ్రీమదనగోపాలచరణ కమలసేవా ధురీణ సత్కవిశ్రీపారీణ కృష్ణభట్టారక పౌత్త్ర చింతలపూఁడి కామయ ప్రభుసుపుత్ర శుద్ధసారస్వతవిభవ రాధామాధవ ప్రణీతంబైన శ్రీతారక బ్రహ్మరాజం బను మహాప్రబంధంబునందు.

దీనిచే నెల్లయరచించిన గ్రంథములలో రాధామాధవము మొదటి గ్రంథమనియు, నాగ్రంథరచనమున కానందించి కృష్ణదేవరాయలు రాధామాధవనామము ప్రసాదించెననియు, రెండవ గ్రంథమగు విష్ణుమాయా విలాస

# ఆకస్మిక ఛాయాచిత్రములు



మైసూరు రాజభవనము-వింతదృశ్యము

ఛాయాచిత్రకారుడు: యం. కే. రంగస్వామి అయ్యంగారు, చెన్నపురి.



సూర్యాస్తమయము
ఛాయాచిత్రకారుడు : యం. కే. రంగస్వామి అయ్యంగారు, చెన్నపురి.

మున నిజనామము, బిరుదనామము నుపయోగించుకొనెననియు, ననంతరము రాధామాధవ నామమె జగత్ప్రసిద్ధమగుటచే నిజనామము చెప్పకొనమానెననియుఁ దోఁచుచున్నది.

రాధామాధవుని గ్రంథములు-వివరములు

౧. రాధామాధవము

ఇది మైదాశ్వాసముల పద్యకావ్యము. మదనగోపాలస్వామి కంకితము. ప్రధానరస మిందు శృంగారము. కవిత మృదుమధురము. జయదేవమహాకవి రచించిన సంస్కృత రాధామాధవమున కిది యాంధ్రీకరణము. రాధామాధవమునకుఁ జివర నీపద్యమును రచించి కవి తాను సంకల్పసిద్ధుఁడని చెప్పకొనెను.

ఉ. సంతత భావసిద్ధియుత
సంస్థితియుగ్, ననయక్రియా పరి
క్రాంతియు, సర్వలక్షణ వి
చారతయుగ్ ఫలియించె, రాధికా
కాంతుఁడు ప్రాణవల్లభుఁడు
గావునఁ బావనమూర్తియైన యీ
చింతలపూఁడి యెల్లకవి
శేఖరు కోమలకావ్యకన్యకున్.

౨. విష్ణు మాయానాటకము

(విష్ణుమాయా విలాసము) ఇది మైదాశ్వాసముల పద్యకావ్యము. ఉపలబ్ధమగు గ్రంథమునందుఁ గృత్యాది లేదు. ఆశ్వాసాంత పద్యములవలన నిది శ్రీకృష్ణాంకితమని తెలియును. ఎఱ్ఱగుడిపాటి వేంకటకవి, రోసనూరి వేంకటపతికవి రచించిన విష్ణుమాయావిలాసముల కంటెనిది పూర్వతరము. రసవత్తరము. ఈ యుత్తమగ్రంథము కృత్యాది లభింపకపోవుట సంతాపకరము.

3. తారకబ్రహ్మరాజము.

ఇది మైదాశ్వాసముల పద్యకావ్యము. నంజయ తిమ్మమంత్రి కంకితము. పరమభాగవతోత్తముఁడును, ప్రయాగక్షేత్రవాసియు నగు నారాయణాశ్రములు రచించిన సంస్కృత వేదాంతగ్రంథమునకుఁ దెలుఁగు. ఇందలి యంశము వేదాంతము. ఈ కృతిభర్త యగు తిమ్మమంత్రి విద్యానగరరాజ్యమును గొంతకాలము భరించిన సకలము తిమ్మయకు మంత్రి యని రామకృష్ణకవిగారు వ్రాసిరి. తారక బ్రహ్మరాజమున నీతిమ్మయ అచ్యుతరాయల యొద్ద మంత్రియని స్పష్టముగాఁ జెప్పఁబడినది.

"చ. తిరుపతిగెల్చి పాండ్యనర
దేవుని పట్టముగట్టి యుత్కళే
శ్వరుఁ గరుణించి మ్రొక్కిన స
వాయికిఁ దా నభయం బొసంగి పెం
పరుదుగఁ గీర్తిచేకొనిన
యచ్యుతరాయలమంత్రిరత్నమై
తిరముగనున్న నంజవిభు
తిమ్మరుసుం దగుఁ బ్రస్తుతింపఁగన్.

ఆంధ్రసాహిత్యపరిషత్తులో నున్న ప్రతిలోఁ దిరుపతిగెల్చి యనుటకు బదులు తిరువళిగట్టి యని గలదు.

సంజయ తిమ్మమంత్రి

తారకబ్రహ్మరాజీయము సంకేతము నొందిన తిమ్మమంత్రి కాశ్యపగోత్రుఁడు. శ్రీ రామమంత్రోపాసకుఁడు. ఈయన తాత రాయమంత్రి యమాత్యపదవియందు సుప్రసిద్ధుఁడై నాటి రాచవారికడఁ బేరెన్నికఁ గన్నవాఁడు. తల్లి తిప్పమ్మ, తండ్రి సంజయ, తమ్ముఁడు సంకపరసు. భార్య లింగాంబ. ఈ తిమ్మయమంత్రి కుమారుఁడు సంజయ. ఈయన కులస్థాన పౌరుషంబులు విద్యానగర సింహాసనంబునఁ బ్రసిద్ధము లనియు, తారకబ్రహ్మ రాజీయోక్తివలన నీకృతిభర్త మిగులఁ బ్రసిద్ధుఁడనియుఁ గులక్రమాగత రాజకీయోద్యోగియనియుఁ దెలియుచున్నది. ఈయన రాజకీయవ్యవహారములయందే కాక సర్వవిద్యాపారంగతుఁడనియు, సర్వలిపిజ్ఞుఁడనియు, మంత్రిత్వముతోఁ బాటుగ కంథాసార లేఖకత్వముగూడఁ గలవాఁడని తారకబ్రహ్మరాజీయములోని యీ క్రింది పద్యములవలనఁ దెలియును.

"రాయదేవేంద్రుఁ డచ్యుతరాయవిభుఁడు"

క. ఆరాయలకృపఁ గంథా
సారము వ్రాయుచును గీర్తి సంపాదించెన్
ధీరగుణాఢ్యుఁడు కంథా
సారము నంజరుసు తిమ్మసచివుఁడు సిరులన్"

ఉ. వేదపురాణ శాస్త్రముఖ
విద్యలకెల్ల గురుండు బ్రహ్మవి
ద్యాదృఢబుద్ధి, నేర్చు లిపు
లన్నియు వ్రాయ, సమస్తదేశభా
షాదు లెఱుంగు స్వామిహిత
మైన ప్రయోజనమాచరించు నా
నాదిశలం బ్రసిద్ధుఁడగు
సంజయ తిమ్మనిఁబోల రెవ్వరున్.

చరిత్రాంశములు

తారకబ్రహ్మరాజీయము వలన అచ్యుతదేవరాయలు "ప్రతిసంవత్సరంబును శ్రీవేంకటేశ్వరునకు సత్కావ్యప్రబంధ పుష్పాంజలి సమర్పించుచుఁ గీర్తిసుకృతంబులు నిర్వహించుకొనుచున్నవాఁ"డని తెలియుచున్నది. అచ్యుతరాయల యఖండభాషాభిమానమున కీసూక్తి చాలును. ఈ రాజేంద్రుని కీర్త్యంకము లగు నాంధ్రప్రబంధము లెన్ని యంతరించినవో కదా! ఆనియతి ననుసరించి రాజగు నచ్యుతరాయలకుఁ దనకు శుభప్రాప్తికై తిమ్మమంత్రి తారకబ్రహ్మరాజమును రచింప రాధామాధవుని బ్రోత్సహించెను. ప్రతివత్సరము అచ్యుతరాయలు రచింపించిన గ్రంథరాజములు విద్యానగరసామ్రాజ్యముతోఁ బాటు నశించియుండును. చరిత్రకారు లచ్యుతరాయలను సామాన్యవ్యక్తిగఁ దలంచి తూలనాడిరి. సమకాలికుఁడగు నీ రాధామాధవుని వర్ణనముఁ బరికింపనాతఁ డుత్కలులకు, ఆంధ్రులకు, యవనులకుఁ బూజనీయుఁడై యాదర్శప్రాయముగ రాజ్యమేలెనని తెలియును.

సీ. పద్మాప్తరుచిమించు పద్మరాగపురవి
గూర్చినపతక మక్కున వెలుంగ,

పసిఁడి వ్రాఁతల పచ్చపట్టుపచ్చడ మొస
  పరిఁ వన్నెయై కటి పరిఢవిల్ల
వివిధరత్న దీప్తులు ప్రసరించు మేలు కు
  ళ్లా కిరీటముకంఠె జోకగాఁగ
కస్తూరికాతిలకము పుష్పమాల్యంబు
  మిండతుమ్మెదల కామెతయొనర్ప
దండ నుత్కళయవనాంధ్ర ధరణినాథు
లర్థి సేవింప రత్నసింహాసనమునఁ
గొలువు గూర్చుండుఁ గృష్ణుని చెలువుమీఱ
రాయ దేవేంద్రుఁ డచ్యుతరాయవిభుఁడు.

ఉ. కుంభిని దాల్చి తా నిరవు
  కొల్పిన యచ్యుతరాయ శాసన
స్తంభము మేరుశైలముఁ బ్ర
  తాపయశో రవిచంద్రమండలీ
సంభృత లక్షణం బనుచు
  సంతసమారఁగఁ జూచుచంద మా
జంభవిరోధిముఖ్యులు ది
  శావలయస్థితులౌట యేర్పడున్.

రాధామాధవకవి ప్రశంస :

ఈ చింతలపూఁడి రాధామాధవ కవి నివాసము రామకృష్ణకవిగారు నిరూపింపకయే స్పష్టముగఁ జెప్పిరి. విశేషాంశములు దెలియుటకు వారి నిర్ణయము విశ్వసింపఁదగును. ఆంధ్రదేశమున నెన్నియో చింతలపూఁడి యను గ్రామములు గలవు. పెన్నాతీరస్థమగు చింతలపూఁడియే కవి నివాసస్థలమని ఋజువు చేయు నంశములు దెలిసికొనుట కుత్సాహ పడుచున్నారము.

రాధామాధవ కవి కృష్ణదేవరాయల యుత్తరవయస్సునను అచ్యుతరాయల రాజ్యారంభకాలమునను,విఖ్యాతుఁడై యుండెను.కృష్ణదేవరాయలదర్శించునాటి కీయన రాధామాధవము రచించెను. అల్లసాని పెద్దనార్యుఁడు విద్యాధికారి గావున ఆయనకడఁ బరీక్షలో నుత్తీర్ణుఁడై యిక్కవి రాయల యాస్థానమునఁ బ్రవేశము కలుగఁజేసికొని రాధామాధవమును వినిపించి బిరుదనామము సత్కృతులు బడసెను. ఆతరుణమున రాయలసభ ధాత్రృప్రతిమాన సత్కవులతో నిండియున్నదఁట. తరువాత అచ్యుతరాయలసభయు నటులె ప్రశంసాపాత్రముగ నున్నదఁట. దీనినిబట్టిచూడ రాధామాధవకవి క్రీ. శ. ౧౫౨౦ మొదలు ౧౫౪౦ లోఁగా గ్రంథ రచనమున మేలుచేయియై ప్రసిద్ధి నొందియుండెనని గ్రహింపవచ్చును. ఈ కవివంశజుల గ్రంథములలో నేమేని చరిత్రాధారము లభించినచో నింకను స్పష్టముగఁ గాల నిర్ణయము గావింపవచ్చును.

రాధామాధవుఁడు "కామయ ప్రభు"వని తనతండ్రిని బేర్కొనెను. ఈ ప్రభు బిరుదము వలన నీకవి రాచఱికము, గ్రామాధికారిత్వము గల ధనికుఁడని తోఁచును. కృతిభర్త యగు తిమ్మమంత్రిని బేర్కొను తఱి "నీకు సంకిత మొనర్పఁదలంచిన వాఁడ బంధు సంభావనన్" అని రాధామాధవుఁడు చెప్పెను. దీనిచే రాధామాధవునకు నంజయతిమ్మమంత్రికి బాంధవ్యసంబంధముంట స్పష్టము. అందుచే రాధామాధవుని నియోగిబ్రాహ్మణుఁడని విశ్వసింపవచ్చును.

రాధామాధవుని కవిత మృదుమధురపద భూయిష్ఠమై శ్రవణపేయముగ నుండును. ధార నిరర్గళము. దీర్ఘసమాసములు, శబ్దాలంకారములు, అస్వాభావికవర్ణనములు నీతని కవితలోఁ గానరావు. ఈయన రచించిన గ్రంథములన్నింటిలో రాధామాధవ ముత్తమోత్తమ గ్రంథరాజము. రాధామాధవుల శృంగార విహారము లిందు మనోహరముగ, రసవత్తరముగ నభివర్ణింపఁబడినవి. పదియాఱవ శతాబ్దిలో బయలువెడలిన యుత్తమగ్రంథరాజములలో నొకటి యగు రాధామాధవము నే రసజ్ఞశేఖరులేని ప్రచురించుట యత్యవసరము. విష్ణుమాయావిలాసము కృత్యాదిరహితముగను, దారకబ్రహ్మరాజము తుది యాశ్వాసము కొంతగను లభించినవి. ఇంక నిక్కవి యెన్ని గ్రంథములు రచించెనో, యెన్నటి కవి లభించునో తెలియదు. రసవత్తరమగు నితని కవిత్వముఁ బాఠకలోకమునకుఁ బరిచయమొనర్ప రెండుపద్యములుమాత్ర ముదాహరింతుము.

చ. పవడపుమోవి నీనగవు
 పల్లవభాగతుషార వారిబిం
 దువుగతి నున్న నీవరిది
 తోయపుముత్తియముల్ గడంబడన్
 దివియఁగనీ ప్రకోష్ఠరుచి
 నింపుచు నుచ్చితపం డటంటివా
 భవదుచితోక్తి సత్క్రియలు
 పాయున నామది తోయ జేక్షణా!

చ. పనివడి యేవిధంబునఁ ద
 పం బొనరించెనొ లక్ష్మి యీసనా
 తను సుఖమూర్తి విష్ణుఁ బర
 తత్త్వముఁగూడి సుఖించుచున్న ద
 త్యనుపమలీల నిట్లు మన
 మందఱ మింతులమై రమింతు మీ
 వనజదళాక్షు రాముని న
 వశ్యముగూడి తదర్చ నారతిన్."

నారాయణాశ్రమి రచించిన తారకబ్రహ్మరాజముగాని జయదేవుని రాధామాధవముగాని యిపుడు కనిపించుటలేదు. ఈ యుద్గ్రంథములకు భావానువాదములుగనున్న యాంధ్రప్రబంధములైన లభించినందుల కానందింపవలసి యున్నది. రాధామాధవ కవికృత గ్రంథములు మూఁడును మదరాసులోని ప్రాచ్యలిఖిత గ్రంథాలయమునఁ గలవు. తారకబ్రహ్మరాజము ఆంధ్రసాహిత్య పరిషత్తులోఁ గలదు. ఈమూఁడుగ్రంథములు మేము నిజాము రాష్ట్రమునఁ బరిశోధనము గావించుకతన నల్లగొండ మండలమునఁ జూచినారము. ఇపుడా గ్రంథములయజమాని మరణించినాఁడు, వారసులను విచారింప గ్రంథములు తా మెఱుంగ మనిరి.

ఓరియంటలు లైబ్రరివారి గ్రంథపట్టికయు, ఆంధ్రసాహిత్య పరిషత్తువారి గ్రంథపట్టికయు, మేము సేకరించిన యంశములు జోడించి యీకవిజీవితము నీవిధముగ నాంధ్రలోకమునకుఁ బరిచయము గావింపఁ గల్గితిమి. గ్రంథప్రకాశకు లీయుత్తమ గ్రంథములు ముద్రణభాగ్యము నొందక యనుభవించునజ్ఞాతవాస దుర్గతి తొలగింపఁ బ్రార్థితులు.

# క్రొత్త అల్లుఁడు

బొడ్డు బాపిరాజు గారు.

"రండి,-నీళ్లివె! కడుగుకొనండి కాళ్లు; ఇదెతువాలు! కూర్చుండుఁ డియ్యెడను; - తమకుఁ
దీసుకొని వత్తునా మంచితీర్థ?"మనుచు-ఆదరమ్మునఁబల్కె మామయ్యగారు.
తలఁపెఱుఁగని చూపుల తళుకులీన-మొలకనగవుల బుగ్గబుగ్గల రహింప
ఉయ్యెలఁ బరున్న మఱఁదలు నెయ్యమెసఁగ-స్వాగతమునిచ్చె; వింతభావాల బాస.
ప్రక్క-ప్రక్కలనుండి యొకొక్క తేప-చూచి చూడని యటుల చూచుటయె కాని
ఎదురుపడరైరి ఆయత్తమొదలుగాఁ-గలుగు నైదువ లదియేమి కారణంబొ!
సగము మొగమెత్తి, గోడచాటుగను నిక్కి-నక్కి-చూచి, పకాలున నవ్వులాడి,
తిరిగిచూడకయే చిఱుపరువులెత్తె-సిగ్గునకఁ జిన్నిమఱఁదలు చిలిపిపిల్ల.
కుదురుఁబడయని పదములఁ గూడఁదీసి-కొనుచు నతియత్నమున 'బా-వ' అనుచు 'నగుచు'
తప్పటడుగుల నిడుచుఁ జెంతకునుఁజేరి-చిగురు చేతులఁ బైకెత్తెఁ జిట్టిమఱఁది.

"ఎంతటివాఁడవైతి! వపుడే దరియం జని బావతోడ నే
కాంతము లాడనేర్చితివె! ఆదట ముచ్చటలూరఁ బిల్చుమా
చెంతకు రానివాఁడవు! ఒసే, కొడుకెంతటి బుద్ధిమంతుఁడో
కాంతువ ర"మ్మటంచు నయగారము దేఱఁగఁ బల్కె పిన్నియున్.

* * * * * * * *

ఎడతెఱపిలేని మర్యాద లడరుకతన,-ముమ్మరమ్ముగ సిగ్గు లోఁగ్రుమ్ములాడఁ
బ్రొద్దుపుచ్చుట కెట్లుఁ బాల్పోకయతఁడు-చూపుగమిఁబంచె దిక్కులం జూఱలాడ.

* * * * * * * *

అంతలో—"నాయనా, ఇంటనందఱుకును-కుశలమా! పెద్దదానను గోర్కెదీర
నరయరావుగద! సరి, ఇల్లాలినైన-నరయ నొకపరి రాగూడదా" యటంచు
పలుకు నమ్మమ్మ నుడికి మార్పలుకకుండ-నానఁదలవంప మునిముసి నగవు లురల
"పురుషుఁడవు నీకు సిగ్గేల? పూవుఁబోఁడి-మనుమరాలు గన్గొన్న నవ్వుదుఁ గదోయి!
ముసలిప్రాణము—ఎపుడేగిపోవునో గదా యనుచు చింతిలితి; కుఱ్ఱదాని పెండ్లిఁ
గండ్లఁజూచెడి ప్రాప్తము గలుగదనుచు-ముదుపుఁగట్టితి నిలవేలుపులకునెల్ల.

స్వామికృపచేతఁ గోర్కె సాఫల్యమయ్యె-ముసలిమొఱ లాలకించెనేమో విధాత!
ఆస లుడిగెను; పీడపొమ్మనుచు, కాదు-రమ్మనుచునున్న; దింకనా బ్రదుకిదేల?
అందఱికనుల ముందర హాయిగాను-గుప్పెడూపిరి విడుచుటే కొఱంతపడెను.

పోయినదీపావళి కా-ప్యాయనముగఁ బిలువనెంచ జ్వరముగలిగె న
బ్బాయికి; ఇప్పుడయిననే-మో! ఏచిక్కులో! అటంచునుంటిమి; దైవేన.

చల్లగఁ జూచెను దైవం-బుల్లాసంబయ్యె మాకు; నొప్పుగ మీ రి
న్నాళ్లకు నట్టింటను మా-చల్లాన్నము దినఁగనయ్యెఁ జా, లదె పదివేల్."

అనుచు నిటులు గలుఘుఁగోలుఁదనము గదుర-నెమ్మదిగమాటలాడ...... శిరమ్ము నూపి
"ఔను,...మంచిది,...ఉ,...సరియె," అనుటె కాని-అగ్గలంబగులజ్జ నాయవ్వపలుకు
లకు జవా బీయఁడయ్యె;—అలక్ష్యమంచు-నెంచెనో! సిగ్గటంచు నూహించెనో! మ
తేమిభావించెనో! కాని ఇంటిలో-నికరిగె ముసలమ్మ తోడిబడు నడుగులిడుచు.

* * * * * *

"ఉదయమయ్యెడిని లేచెదరా! తమ"రనుచు-మృదువుగా నొకకేక మేలుకొలిపి,
"దయచేయుఁడిటు దంతధావన మొనరింప"-నని వెండిపాత్ర నీళ్లను నొసంగి.
"స్నానము జేయ నుష్ణజలములను సిద్ధ-మొనరించినారు రం"డనుచుఁ బిలిచి,
"ప్రొద్దెక్కె-లెండిఁక భోజనంబున"కని-తాను నాపంక్తి నాసీనుఁడగుచు,
"మంచిభోజనమాయె! వడ్డించినట్టి వెల్ల నట్టులె మిగిలిపోయెను! సెబాసు!
పాయసము, గారె, తెమ్మందు"యటంచు-మన్ననల్ చేసినారుగా మామగారు.

తొట్టిలోనుండు పసిపాప దొట్టి యరువ-దేండ్ల ముసలాపె వఱకు నాయింట నుండు
నెల్లరును పేర్మికూర్మి సంధిల్లనల్లఁ-దలిరుటేకుల కన్న మేల్తరము గాఁగ
నవ్యనవనీతమునకంటె నవకముగను-కంట నొత్తిడుకొని కడు గారవమునఁ
గొసరికొసరి కోర్కుల సమకూర్చినారు-క్రొత్తయల్లున కెందునఁ గొఱంతలేక

* * * * * *

హరిహరుల యంతవారలే అత్తవారి-మందిరమునందు విందు మరగి తిరిగి
నిజనివాసంబులనుజేర నేరరైరి;-అత్తవారింటఁగల సౌఖ్య మల్లునకును
వేయిజన్మాలకైన లభింపఁగలదె !!!

---

౧

—అది ఆతనికి మామూలయిపోయింది. ఏమీ తోచనప్పుడల్లా వచ్చి నా బుర్రని కవ్వించి పోట్లాడి పోతూంటాడు.

కాని ఆతనితో కబుర్లువేయడమంటే నాకమిత కులాసా. ఆతను చెప్పేవేమీ—చేసేవేమీ కాని— నాకు నచ్చవు. ఆ సంగతి ఆతనికీ బాగా తెలుసును. అయినా ఎప్పుడో ఓమారైనా మాట్లాడకుండా—పోట్లాడకుండా—రోజు గడిచేది కాదు. అందుచేత నేమో కూడను—మాకిద్దరికీ అంతస్నేహం.

మామూలు వేళకే, మామూలుకన్నా మరీ చక్కగా వేషం వేసుకొని, ప్రత్యక్షమైనాడు సుందరం—నా చదువు చెడగొట్టడానికి. దూరాన్నుంచే నా చేతులో పుస్తకం కనిపెట్టి, తమాషాగా, చిరునవ్వుతో నావైపే చూస్తూ వస్తున్నాడు: నేనూ అది గ్రహించి, శాకుంతలం మూసేసి, సిగరెట్టు ముట్టించుకొని తయారుగా ఉన్నాను;

—మళ్లా మొదలూ!

కోటిమీద కోటి ఎక్కుస్తున్నాడు: ఆతని ధోరణంతా వింతగా ఉన్నది:

'అవును ఆలాగే ఉంటుంది అర్థం గాకపోతే' అని ఈసడించాడు సుందరం.

నాకక్కడితో హుషారెక్కింది: ఇక ఊరుకోవలేదు:

'అయితే, కవిత్వానికీ, వేషానికీ సంబంధమేముందీ?' అని నేనందుకున్నాను.

'తెలియకపోతే ఆలా అడుగు—దోవలోకి రా—ఏముందా? సోమయాజులుగారికీ శాలువకూ ఏం బాంధవ్యముందో, అంతకన్న—'

'అంటే'

'ఏపాటకి తగిన ఆట ఆపాటకి అమరాలన్న మాట చూళ్లేమూ? తత్త్వాలు వ్రాసిన బ్రహ్మంగారూ, సిద్ధయ్యగారూ సన్యాసులయినారు. శృంగారం కురిపించిన సూరన్నగారు—'

'మహారసికులనే—కాదూ, నీవనబోయేది?'

'అవును. ఆలోచనవరకే కాకుండా—అనుభవంలోకి తెచ్చుకున్న రసికత్వం కూడాను వారిది.'

'అనుభవం లేకపోతే నేం—ఊహించకూడదూ?'

సుందరం నవ్వాడు. నాకూ అది పిచ్చిప్రశ్నేమో ననిపించింది.

'సరే అనుగుణ్యమైన సంస్కారం అవసరమని—పోనీ—ఒప్పుకుంటాను: మరి ప్రత్యేకమైన నేపథ్యం ఎందుకూ'

'అవసరమే!—తన నమ్మకానికీ, ఇతరులని నమ్మించడానికీ: రంభతో ఇంటర్వ్యూ ఆసించపోయే అవధాన్లగారు, వేషమంతా దిగవిడిచి, గావంచాతో బయలుదేరుతాడేమో కనుక్కో— పేస్‌పోర్టు కావద్దూ?—అందుకనే కవితాకన్యకు ప్రియులమవుదామనుకునే మాదృశులు—'

'అదేమిటోయ్—నీవు కవివి కాదూ?—కవికన్న కూతురు కవికి ఏమవుతుంది?'

'ఆఁ—ఏమవుతుందా?—వాణి బ్రహ్మకు ఏమవుతుందో—నిమ్మళంమీద అది అవుతుంది: అవన్నీ పూర్వపుమాటలోయ్—ఇప్పటి రకాలందరూ, పెంచుకొనే బాపతు కాదు.'

'సరే, పెంచుకోండి, ఏమన్నా చేసుకోండి—మీరు చెడ్డది కాకుండా కవిత్వాన్ని ఓకన్నెనుచేసి, దాన్ని చెడగొడుతున్నారు.'

'అక్కడే మళ్లా పొరబడుతున్నావు—అందరికీ తలో కన్నేనూ—అసలు పిల్ల ఒక్కతే: ఆమెను

ఏమహానుభావుడో ఎవరికీ తెలియకుండా రైలెక్కిస్తాడు: మిగతా దండంతా, ఆ అమ్మాయికి పింతల్లి పెత్తల్లి బిడ్డలోయ్—ఎవరైతేనేం—రక్తస్పర్శ ఉంటేసరి.'

'కనుక,'

'ఇంతదూరం వచ్చినా మళ్లా మొదటికేనా?—తీరుబడిగా ఆలోచించుకో. నిమ్మళంమీద నీకే అర్థమవుతుంది—'శృంగారీచేత్' మొదలైన వాక్యాలన్నీ సరిగా అర్థంచేసుకోకుండా ఎందుకూ వాదిస్తావూ?'

సుందరం అంతటితో అనుగ్రహించి విడిచిపెట్టాడు—అతనువెళ్లిపోయిన చాలా సేపటిదాకా నవ్వుకుంటూనే ఉన్నాను.

చిన్నప్పటినుంచీ ఎరుగుదున్నాను సుందరాన్ని. ఎప్పుడూ ఇంతే! అన్నీవిపరీతం ఆలోచనలు: కొత్తగా మాట్లాడేవాడు మాత్రం కొంతసేపు ఉక్కిరిబిక్కిరవుతాడు—ఓమాదిరిగా ఎరుగున్నవాడు 'క్రాక్' ఏమోననుకొని జాలిపడతాడు: ఏమైతేనేం మొత్తంమీద చాలా చురుకైనవాడు—అక్కరకు రావలసినవాడు:

ఉన్నట్టుగా ఉండి—కవికిప్రత్యేకంగా ఓవేష ముండాలని సుందరానికి సూచించింది: వెంటనే వెనుకటి ఫక్కీఅంతామార్చేసి క్రొత్తపద్ధతిని తయారయినాడు. అసలే చక్కనివాడు: అంతకన్నా చక్కగా అలంకరించుకునేవాడు: అతను దోవను పోతూంటే చూసి, మెచ్చుకొని,—'ఇట్టిమనోహరాంగుడొకడెందయిననొకల డేని' అన్నపద్యం భావాన్నిస్మరింపని—పడుచుపిల్లలుండరనుకుంటాను.

సుందరానికి లక్షణవతియైన భార్య ఉంది: అనుభవించడానికి కావాలిసినంత ఆస్తి ఉంది: హాయిగాతిని, ఇంటిపట్టున కడుపులో పాలు కదలకుండా కూర్చోక ఏమిటీ ఈవేషాలన్నీ అని ఒకొక్కప్పుడు నాకు కోపం వచ్చేది: కాని ఏం లాభం? నాచేత నేమవుతుందీ? అతను తనకుతోచినంత తానుచేయడమేకాని.

ఇంకొకరు ఏమనుకున్నా—ఏం చెప్పినా—లక్ష్యంచేసేవాడుకాదు; వినేవాడూ కాదు:

౨

అప్పటికి అరగంటనుంచీ కనిపెడుతున్నాను: సుందరం అలాగే కదలకుండా—నిల్చునే ఉన్నాడు:

నాకు కనబడి వారం అయింది అప్పటికి. ఎక్కడికన్నా వెళ్లాడేమో ననుకున్నాను: నాకోసమేవస్తూ—

అక్కడ ఆగిపోయి ఉంటాడు — అందులో ఆశ్చర్య మేమీ లేదు. సుందరం, ప్రకృతిదేవత సౌందర్యాన్ని ఉపాసించే జట్టులో ఒకడు: ఒక్కొక్కనాడు అన్నమాటకూడా మరచిపోయి, ఆకాశంలో మబ్బు బాగుందనుకుంటూనో, నక్షత్రాలు మినుకుమంటున్న వనుకుంటూనో, నిలుచున్నచోటనే రెప్పవేయకుండా రాత్రంతా గడిపేవాడు.

వెన్నెల బాగావచ్చింది. చందమామ నాకే చూడటానికి చాలా ముద్దుగా ఉన్నాడు:—పరివేషం మరీ అద్భుతంగా ఉంది: మేఘాలన్నీ బాలచంద్రుడు తాకుతాడేమోనని పతివ్రతలలాగా పరుగెత్తుతున్నాయి: కొబ్బరిచెట్లు—చేయితాకి నాకొంత వాసేనని—కొనలు చాచి అందుకోవాలెనని తంటాలుపడుతున్నాయి—ఆ మనోహరదృశ్యాన్నంతా చూస్తూ, తలన్నా త్రిప్పకుండా అక్కడే నిలుచున్నాడు సుందరం.

ఆ మనోహరదృశ్యం—

అద్దాలతలుపులమీద ఆమెనీడ పడుతూంది—మేడమీంచి గ్రామోఫోను వినబడుతూంది:

చూసినకొద్దీ నాకు అనుమానంగానే ఉంది-కాని-ఏమో, ఏటు చెప్పడానికీ వీలులేదు:

ఫోను పాటచాలించింది:—లోపల దీపకాంతి కూడా—తగ్గింది:

—రోమియో: జూలియట్‌లో సీను సాక్షాత్కరించింది:

తెల్లనిచీరె కట్టుకుని, వెన్నెట్లోకూడా తళతళలాడి పోతూ—ఆమె—బాల్కనీలోకి వచ్చి నిలుచున్నది-

ఇక చూడనక్కరలేకుండానే సంగతేమో తెలిసిపోయింది:—ఏముందీ, సుందరం, పైకి ఎక్కివెళ్లి—

# చిరకాలమునుండి బాధించుచున్న మూత్రవ్యాధులకును గళ (గనేరియా) వ్యాధికిని క్రొత్తగాకనిపెట్టబడిన దివ్యౌషధము.




# గనోకిల్లర్ (రిజిష్టర్డు)

ఈయౌషధము శ్రేష్ఠతమము. ఇంగ్లీషుమందులను దేశీయములగునౌషధములను పుచ్చుకొనినను గుణము కలుగనియడలను, యింజక్షనులవలనను వాక్సినులవలననుగూడ లాభము లేకపోయినయడలను కడపటిప్రయత్నముగా మా గనోకిల్లరునుగూడ పుచ్చుకొనిచూడుడు. పెక్కుయేండ్లనుండియున్నను లేక క్రొత్తగా కలిగినను ఏరకము శగసంకటమైనను మరెట్టి మూత్రవ్యాధులనైనను స్త్రీలకైనను పురుషులకైనను గనోకిల్లరు తప్పక కుదుర్చును. మూత్రము ఝూరీగా వెడలును. మూత్రముపోవుచున్నపుడును కలుగుమంట తగ్గిపోవును. మూత్రనాళము నందలి వాపు తీసిపోవును. శగవ్యాధి (గనోకోకసు) వలన మూత్రము బొట్లుగా పడుట, మేహరోగమువలన మూత్ర ద్వారమునుండిపోవు తెలుపు, యూరెత్రిటిసు, ప్రొస్టాటిటిసు, సిస్టిటిసు, లుకోరియా, మున్నగువ్యాధులన్నియును స్త్రీలకును పురుషులకునుగూడ గనోకిల్లరువలన కుదురును. వీర్యము (సెమను) పోవుట, స్త్రీలు గర్భవతులుగా నున్నపుడు కలుగు మూత్రవ్యాధులు మున్నగునవిగూడ దీనివలన కుదురును. 50 మాత్రలుగల సీసా ఖరీదు రు. 3-0-0 వీ. పీ. చార్జీ ప్రత్యేకము. ఒక్కసారి 3 సీసాలు తెప్పించుకొనిన వీ. పీ. చార్జీ మేమే భరించెదము.

**అడ్రసు:—డాక్టర్ డి. యన్. జస్సాని, 137 కికావీధి, గులాల్ వాడి, బొంబాయి 4.**

**Tel. Add. "GONOKILLER" Dr. D. N. JASAN1, I37 Kika Street, Gulalvadi, Bomday, 4.**

మద్రాసు సిటి ఏజెంట్లు దాదా అండు కంపెనీ, 260 చైనాబజారురోడ్డు, మదరాసు.

---

## రోల్డుగోల్డు రిస్టువాచ్



చూచుటకు యందముగనుండి లివర్ యంత్ర నిర్మాణముగల శ్రేష్ఠమైన గడియారము. 36 గంటలకొకతూరికి యిచ్చిన సరిగా పని చేయు రైల్వే రిస్టు లేటరు. 2 సం॥లు గ్యారంటీ.



5 సం॥లు గ్యారంటీ యొసంగబడును. కొలదికాలము మాత్రమే. ఎట్టిమాదిరి గడియారమైనను, ధరించుకొను తోలుపట్టతో సహా రు. 7/-ల కొసంగబడును. పైగడియారము కొన్నవారికి ఒక బర్మా అలారంక్లాక్ ఉచితముగ నొసంగబడును.

పై రెండును కొన్నవారికి ఒక జత కండ్లజోడ్లు, రాళ్లుపొదిగిన ఉంగరము, ఒక కత్తి, ఒక ఎలెక్ట్రిక్ లైటుతో సహా రు. 4/8/-లు.

## ఎస్. సి. మేయర్ అండు కో.,

---

## పండిట్ ఏ. జె. సోమయాజిశాస్త్రి,

## ఆయుర్వేదఫార్మసీ.

రావిపాడు, అంబాజీపేట, P. O. తూర్పుగోదావరి.

1. భస్మ, లేహ, ఆసవ, తైలాది అన్ని ఆయుర్వేదౌషధములను ప్రత్యేకశ్రద్ధతో తయారుచేయువారు.

2. వైద్యసభలు, నేషనల్ కాంగ్రెస్‌లలో స్వర్ణ పతకయోగ్యతాపత్రములు పొందియున్నవారు.

3. సోమనాథరసము:—జీర్ణించిన సుఖవ్యాధులు ఎగ్గైరాలచే జనించిన అతిమూత్రమును పోగొట్టుటకు సర్వసమర్థమగు దివ్యౌషధము. నెలకు రు. 5/-లు.

4. 12 ఔషధములు గల కుటుంబసంరక్షణి పెట్టె (Family Medicine Chest) రు. 5/-

5. అశోకఅరిష్ట, మాత్రలు, భస్మ, చూర్ణములు కలసిన సెట్టు 1-కి రు. 3-10-0

సర్వ స్త్రీవ్యాధులను అనేకవేలసార్లు జయప్రదముగ కుదిర్చిన రాజౌషధములు.

బ్రాంచి:—ఆర్. విశ్వనాధ శాస్త్రిగారు,

తిమ్మనచర్ల, గుంటకల్లు రైలుస్టేషన్.

కేటలాగు ఉచితము. ఏజంట్లు కావలెను.

కాదు, నేనే పొరబడ్డాను: సుందరం నిలుచున్న చోటినుంచి కదలలేదు: ఆమెమాత్రం—రెండునిమిషాలు అలా నిలుచుని, తరువాత లోపలికి వెళ్లి తలుపు వేసుకున్నది:

దీపం సాపుగా ఆరిపోయింది:

సుందరం అక్కడనుంచి బయలుదేరాడు. మొదట్ల ఇంటికి వెళ్లిపోవాలనుకున్నాడు కాబోలు, ఇంటిదోవ పట్టాడు, కాని మళ్లా ఏ మాలోచించుకున్నాడో, వెనక్కు తిరిగి, తిన్నగా మాయింటికి వచ్చేశాడు:

నేను అతను రావడం కని పెట్టి ఏమీఎరుగనట్లుగా సిగరెట్టు కాల్చుకుంటూ కూర్చున్నాను — మధ్యమధ్య కూనిరాగంలో, 'మేరెమాలాలాబులాలో,...అనుకుంటూ—

—నన్ను పలుకరించలేదు: వచ్చి ఎదురుగా కుర్చీలో కూలబడి, చేజాచి, బల్లమీద, 'శ్వేతకాష్ఠం' అతికి అందుకున్నాడు—నేనూ చూస్తూ ఊరుకున్నాను.

'ఎక్కడనుంచి మొదలుపెట్టనూ, కథ' అని అతనే ఎత్తుకున్నాడు కొంచెంసేపటికి.

నేను దానికి జవాబు చెప్పకుండా,

'ఈమధ్య నీవు ప్రకృతినిఉపాసించడం మానేసి'—

'అవునోయి—ప్రకృతిని కొన్నాళ్లదాకా మరచి పోవాలిసివచ్చింది—చైతన్యాన్ని...'

వాడు నవ్వువచ్చింది.

'సరేలే—కథ నీవు చెప్పాలి! — నేను గ్రహించలేను!' అన్నాను.

'అందుకనే నేను చెప్పేది. నీవు తిన్నగా చూస్తే కాదూ సరిగా గ్రహించేది.

'తిన్నగానే చూశాను—కాని నీవనేదేమో మాత్రం గ్రహించలేను'

'పోనీ అక్కడికి కొంతనయమే—వింటావా?'

నేను తల ఊపాను:

'ఆ—అనసూయ—కీ—నాకూ, స్నేహం లేదు—తెలిసిందా.'

'అంటే'

'నీవుచూసిందాన్ని బట్టి— నిన్ను నేనుచూశానులే— నీవేమి అనుకుంటావో, అది కాదంటున్నాను;

నేనేమీమాట్లాడలేదు.

'క్రిందటి మంగళవారం నాడు—మీయింట్లోనే భోజనంచేశాను—జ్ఞాపకం ఉంది కదూ.'—ప్రొద్దుపోయే దాకా 'హిందూ' చదువుకుంటూ కూర్చున్నాను. నీవు అప్పుడే నిద్రపోయినావు—

—పడుకున్నవాడిని లేపడం ఎందుకని, నీతో చెప్పకుండానే వెళ్లిపోయినాను. అప్పటికి పన్నెండు దాటిం౧.

'ఎవరో పెళ్లివారు—అక్కడ ఆగారు. కాన్సర్టు, 'వేణుగానలోలా—' మాషోగ్గావాయిస్తున్నారు. వినడంతోనే నిద్రంతా అమాంతంగా మాయమయింది నాకు. అక్కడనుంచి కదలడానికి మనసు ఒప్పిందికాదు.

'పైకి—ఊరికేనే—చూశాను: అనసూయ నిలుచుని ఉంది:'

'అదివరకు చాలా సార్లుచూశాను, కాని ఎన్నడూ అంత అందంగా కనబడలేదు. చూపు మరల్చనే లేకపోయినాను. చూసినవాళ్లేమనుకుంటారో అన్నతలపే లేకపోయింది.

'నేను తెలివితెచ్చుకొనే టప్పటికి—పెండ్లివారు చాలామూరం సాగిపోయినారు. రోడ్డుమీద కూడా ఎవరూ లేరు.'

'కాని ఆమె ఇంకా అక్కడనే,నిలుచున్నది.

'తలుచుకుంటే నాకే సిగ్గువేసింది. ఆమె నన్ను కని పెట్టే ఉంటుంది. ఏమనుకుందో.

'ఇక అక్కడ నిలువలేకపోయినాను. ఇంటికి ఎట్లావెళ్లానో నాకే తెలియదు—ఎట్లా తెల్లవారిందో

'మరచిపోదామనుకున్నాను. అలాంటి పాపపు తలపులు చేరనీయరాదనుకున్నాను—కాని, నామనసు నావశం మీరిపోయింది. ఆమెను చూడకుండా—ఆమెను తలచుకోకుండా—ఉండటం దుర్లభమనిపించింది.

'బయటికి రావడానికి చాలాసిగ్గువేసింది — ఎవరి కన్నా తెలిసిందేమో — ఏమనుకుంటారోనని, చాలా తపించాను'.

'కాని నావశము కాకపోయింది. ఇంట్లో కూర్చోలేకపోయినాను. పవల్లా ఏలాగో వేగిరించి, చీకటిపడగానేవచ్చి అక్కడే నిలుచుంటున్నాను.

'క్రమంగా నాకు తగనిధైర్యం వస్తూంది. ఎవరన్నా లక్ష్యంలేకుండా పోతూంది — ఆమే — ఆమెతప్ప లోకమే లేదు నాకిప్పుడు—'

నేనాతనిమాటకు అడ్డురాకుండా, వింటూ కూర్చున్నాను. విన్నకొద్దీ—అతని ఉద్రేకాన్ని చూస్తున్నకొద్దీ—భయంవేసింది.'

'ఏమంటావు?' అని అడిగాడు సుందరం.

ఏమంటాను—నీవు చేస్తున్నపని అంత బాగుండదేమో—

'ఎవరికి?'

'లోకానికి'

'నీక్కూడానా?'

'నామాటకేం లే'

'నేను అడిగేది నీమాటే'

ఇక తప్పించుకోడానికి వీలు లేక పోయింది. చూస్తూ ఊరుకోలేక పోయినాను.—

'సుందరం—నా అభిప్రాయం మాత్రం'—

'నేను తప్పు చేస్తున్నాననేనా?—'అని అతడు అందుకున్నాడు.

'అవును.'

'అయితే ప్రయోజనం లేదు—నీవు అర్థంచేసుకోలేవు?'

'ఈపట్టున నీకు అర్థంకానివి—నీవు గ్రహించనివి కూడా కొన్నివిషయాలున్నాయి—తెలుసునా?'

'ఏమో, నాకు తెలియదు—తెలియనక్కరలేదు—కాని—నా ప్రేమా—నా ఆవేదన—సంగతి నీకెల్లా తెలుస్తుంది?'

నేను 'నిజమే'నని తల ఊపాను.

తరువాత ఎవరమూ ఏమీ మాట్లాడలేదు.

## 3

రామమూర్తిగారు పడుచుదనంలో చాలా చక్కగా ఉండేవాడట—కాని నేనెరిగినప్పటినుంచీ ఆలాగే ఉన్నాడు—పిలకజుట్టు, సగంనెరిసిన గడ్డం—ముడతలు పడ్డమొగం.—ఏమో, అప్పటి ఆకారాన్ని చూసి ఊహించనైనా లేకపోయే వాణ్ణి, వయసులో ఉన్నప్పుడు ఎట్లా ఉండేవాడో.

మావైపునుంచే రోజూ కారులో కోర్టుకివెళ్లేవాడు. ఆయన్ని చూడటం వ్యవధానంగానే మా ముసలమ్మ—'ఎల్లా ఉండేవాడనుకున్నావు? సరిగా దొరలాగా,—ఆమీసాలూ, ఆనుదురూ—నల్లలాంకోటు, జరీతలగుడ్డ, పెట్టుకుని నడుస్తుంటే, వీధంతా కలకలలాడిపోయేది.—ఈనాటిమాటా,—ఇప్పటికి ముప్ఫైఏండ్ల కిందట—అప్పుడు మీతాతయ్య సబుకోర్టులో పనిచేస్తుండేవాళ్లూ—నీవేం ఎరుగున్నావు. మీ అమ్మేచంటిపిల్ల......,—అని ఆయన్ని ప్రశంసించడం మొదలు పెట్టి, సాంతకథలోకి దించేది. నేను విసుక్కుని అక్కడనుంచి లేచిపోయే వాణ్ణి.

అనసూయ అయినయింటిపిల్ల. చాలాచక్కనిదీ, చదువుకున్నదీ. ఆ అమ్మాయికీ, రామమూర్తిగారికీ అధమం మూడు పుష్కరాలన్నా తేడా ఉండవచ్చు వయసులో.

—లోకంలో పాటుకథే. రామమూర్తిగారికి మొదటిభార్యతో వియోగం కలిగిన తరువాత, చాలా కాలం ఒంటరిగానే ఉండిపోయినాడు. ఏకాకో లేచిపోతాడేమోననుకునేవాళ్లుకూడాను. కాని ఉన్నట్లుగా ఉండి ఎవరికి తెలియకుండానే, ఇట్టె పడుచుభార్యను సంపాదించుకువచ్చాడు.

అనసూయను వీధిమొగం చూడనీయడనీ, చాలా కోరంటికం పెడుతాడనీ, కొడతాడనీ—పడుచుభార్య లున్నముసలివాళ్ల కచ్చేదుర్బుద్ధులన్నీ ఉన్నాయనీ—అందరూ చెప్పుకునే వారు.

రూపాన్ని కాకుండా, గుణాల్ని వరించే పిల్లలు కూడా ఈకాలంలో ఉన్నారని నమ్మేరకం కాదు నేను. అయినా అనసూయ విషయంలో ఏమనుకోవడానికీ పాలుపోలేదు. అప్పటివరకూ పొల్లుమాట బడకుండా, మానవతిగానే కాపురంచేస్తున్నది.

నేనామెను ఎన్నడూ సరిగా చూడనన్నా లేదు. అసలు ఆ అమ్మాయి సాధారణంగా కనబడదుకూడాను. మాయింటికిదగ్గరనే కనుక, ఎన్నడన్నా, ఏడుపుమాత్రం వినిపించేది. రామమూర్తిగారు—ఆకిరాతుడు-ఆఅమ్మాయిని తరుచు హింసించేవాడు.

సుందరంగాథ విన్నప్పటినుంచీ, నాకూ ఆమె అంటే కులాసాపుట్టింది —'నపరిహార్యేవస్తుని పౌరవాణాం మనః ప్రవర్తతే'—మావాడికికూడా మనసు మారిందంటే, ఆమెసామాన్యురాలై ఉండదన్నమాటేకాదూ?'

సుందరం, స్త్రీజనం విషయంలో అసలు చాలా జాగ్రత్తగా ఉంటాడు.—అపట్లమాత్రం చంచలుడుకాడు. అతడు అనసూయను వరించాడంటే—నాకు ఆశ్చర్యం వేసింది మొదట.

కాని సందేహ మేమీలేదు. నిజంగా సుందరం వంటివాడికి తగిందే. ఆమెకూ అతనే తగినవాడు.—ఈ యుగంలో వీలులేదు కనుకగాని—ఏసూంసో మధ్యరాయబారం నడుపుతే ఎంతో త్వరగా తేలిపోయేది కదా ఏదో ఒకటి అనిపించేది.

నే నాతనికి సహాయమూ చేయదలచలేదు. వారించ దలచనూలేదు—చూసి సంతోషిద్దామనుకున్నాను.

... ... ... ...

అకాలజలదోదయమయింది.

సుందరం పరుగెత్తుకుంటూ—నిజంగా పరుగుతోనే—వచ్చాడు. వేసవిలోకన్నా ఎక్కువగా ఎండ కాస్తూంది. నేనూ అప్పుడే కాఫీ పుచ్చుకుని—నిద్రపోవాలనుకుంటున్నాను.

అమాంతం వచ్చి వెన్నుమీద చరిచాడు. మత్తంతా వదిలిపోయి లేచి కూర్చున్నాను. అతనుమాత్రం కూర్చోకుండా—ఒకచోట నిలవకుండానే.—

'లేవోయి — వద్దువేసుకుని బయలుదేర్వు—త్వరగా—లే—అలా చూస్తావేం'—

అని గబగబ నన్ను హెచ్చరించి, ఉత్తరీయమూ, వద్దు తీసుకునివచ్చి నామీద పడేశాడు.

'ఏమిటీహడావడి?' అని నేను చాలా తీరుబడిగా అడిగాను, అతని తొందరంతా లెక్కపెట్టకుండా.

'కాదు-దోవలో చెపుతాను ముందుబయలుదేరు.'

'సంగతేమో తెలియందీ, కదలను. అసలు ఇంకోరైతే, ఇప్పుడు లోనికి రానిచ్చేవాణ్ణే కాను. ఏమిటి ఎండలో నన్నా కాస్సేపు పడుకోనీయకుండా.'

'ఎప్పుడూ నీతో ఇంతేనోయి' అని చిక్కుమొగంవేసి, కూర్చున్నాడు సుందరం.

కొంచెంసేపు తలవంచుకుని ఏదో ఆలోచిస్తున్నట్లుగా ఊరుకుని,

'రామమూర్తి—రమ్మన్నాడోయి మన్ని' అన్నాడు చప్పున తలఎత్తి నావైపుచూస్తూ.

'ఏమిటీ?'

సుందరం మళ్లా చెప్పాడు.

'నిజంగానా?'

'ఇంకా నమ్మకపోవడమేనా.'

'సరే వెళుదాము.'

'తప్పకుండా—నీదే ఆలస్యం'

—'కారణం ఏమిటో'

'ఏమయినా, నాకులక్ష్యంలేదు—అనసూయ...'

'కనిపెట్టాడా?'

ఎన్నడో కనిపెట్టాలిసింది. అది అతనిపొరబాటే'

'దుర్మార్గుడు; మనంకాస్త జాగ్రత్తగా'

'అయితే లెక్క ఏమిటోయి-అతనితో చెప్పే—అనసూయను—లాక్కుంటాను.'

'అన్యాయమేమో'

'అతను చేసేదానికంటేనా?'

—ఇద్దరమూ వెళ్లి రామమూర్తి లైబ్రరీలో కూర్చున్నాము. లోపలికి కబురుపంపించాము.

నే నదివరకు ఎన్నడూ లోపలికి వెళ్లలేదు. ఆయనకు అంత మంచి లైబ్రరీ ఉన్నదని కలలోనన్నా అనుకోలేదు. పాతవకీళ్ల దగ్గర ఉండేసరంజామా అనుకున్నానుగాని—చూసేటప్పటికి నాకు తలతిరిగిపోయింది.—పేరున్న ఆధునికుల గ్రంథాలన్నీ మంచిప్రతులు, ముద్దులు మూటగడుతూ అలుమారల నిండా ఉన్నాయి.—

లోపలికి రమ్మని నౌకరువచ్చి చెప్పాడు. సుందరం, నేనూ,—లోపలికి వెళ్లాము.

డ్రాయింగురూము—ఫొటోగ్రాఫులలోనే కాని ప్రత్యక్షంగా ఎన్నడూ అలాటిది చూడలేదు—ఎంతో బాగుంది—నాకు లోపలికి వెళ్లడానికే అదేదో అనిపించింది.

రామమూర్తిగారు చెస్టరుఫీల్డులో కూర్చుని ఉన్నాడు. ప్రక్కన ట్రేలో కాఫీ సామగ్రి అంతా ఉన్నది.

మమ్మల్నిచూసి, లేచి ఎదురుగుండా వచ్చాడు. సబహుమానంగా లోపలికి తీసుకునివెళ్లి కూర్చోబెట్టి తానుకూడా మాకు ఎదురుగా కూర్చున్నాడు, చేతులో పుస్తకం ప్రక్కన పెట్టేసి.

అందరమూ కాఫీ పుచ్చుకున్నాము.

అంతవరకూ సుందరం ఏమీ మాట్లాడలేదూ—నేనూ ఏమనడానికి తోచక ఊరుకునే ఉన్నాను. రామమూర్తిగారే మాట్లాడుతున్నారు ఏవో అమాటలూ—ఈ మాటలూను.

ఆయన మొగం, వాలకంచూస్తే, మోసమేమీ స్ఫురించడంలేదు, కాని నాకాయనఎదుట ముండ్లమీద కూర్చున్నట్టుగా ఉంది. ఎప్పుడు బయటపడుదామా అనుకుంటూ, విధిలేక తప్పని సరిగా కూర్చున్నాను.

'అనసూయా!'

రామమూర్తిగారు నెమ్మదిగా పిలిచారు. నాకు గుండెలు ఆగిపోతాయేమో ననిపించింది. నిలువున నీరైనాను. సుందరంస్థితి గమనించడమే లేదు.

గాజులుచప్పుడు వినబడ్డది. గుమ్మానికి అడ్డమున్న తెరతొలగించుకొని అనసూయలోపలికి—

—రాలేదు. ముందరికి అడుగువేయబోతూ, మమ్మల్ని చూసి, చప్పున లోపలికి పోయింది.

'పరవాలేదు—రా.'

ఆమె తలవంచుకునివచ్చి దూరంగా నిలవబడినది. నాకు నిజంగా భయంవేస్తూంది. ఆమెమొగంలో మాత్రం ఆశ్చర్యం కనబడుతూంది.

రామమూర్తిగారు లేచి నిలుచున్నారు. అనసూయ ఆయనకు చాటుగా ఉంది. మాకు కనిపించడం లేదు.

'కష్టమనుకోకుండా పిలువగానే వచ్చారు. కృతజ్ఞణి' అని రామమూర్తిగారు ఎత్తుకున్నారు.

నాకు ఏంజవాబుచెప్పవలెనో తోచలేదు. అసలు అవసరం లేదేమో కూడాను. మాట్లాడకుండానే కూర్చున్నాం.

'సుందరంగారూ, మిమ్మల్ని నేను చిన్నప్పటి నుంచీ ఎరుగున్నాను. మీనాయనగారికీ నాకూ, ఒకప్పుడు స్నేహంకూడా ఉండేది.

సుందరం తెల్లబోయి ఆయనవై పేచూస్తున్నాడు.

'—మీకన్న వయసు చెల్లినవాడిని గనుక, రెండు ముక్కలు వేదాంతం మాట్లాడుతాను, విసుక్కోబోకండీ—మానవుడికి ఆయుఃప్రమాణము శతాధికం అని నిర్ణయం ఉన్నా, విధిదుర్విజ్ఞేయం కాదండీ—శంకరుడు జీవనం విద్యుచ్చిరమనే అన్నాడు. అనుభవం విషయంలో లోకాయతికులమతమే నాకు నచ్చిందండీ—ఏమంటారు!'—'

మేమేమీ అనలేదు. ఆయనే అందుకున్నాడు—

'ఇకమామూలు ధోరణిలోకివస్తాను:—కులాసా రెండు విధాలని నా ఊహ—సొంతం, పరకీయం అని అంటే, తాననుభవించడం, ఎవరినన్నా చూసి ఆనందించడం. ఎవరి అదృష్టాన్నిబట్టి ఎవరికివారికి—ఏదో, ఈ రెండు రకాల్లో, ఒకటి—

సుందరం రెండుమూడుసార్లు మాటకు అడ్డం రాబోయినాడు. కాని రామమూర్తిగారు మాట చొర

నీయలేదు. ఇక ప్రయోజనం లేదని, మాట అందుకో డానికి యత్నంమానేసి, అభినయంతో, తనఅభిప్రాయం తెలియజెప్పాలని తంటాలుపడుతున్నాడు. ఆయన అది గ్రహించాడు కాబోలు చిరునవ్వుతో—

'నాతునా తొందరపడకోయి! నీకు నాలో మూడవపాలు వయసుంది!—వస్తున్నానుకదూ?' అన్నాడు,

నాకిక ఆబిగివిని కూర్చోడం దుర్భరమయి పోయింది. అప్పటికి పదినిమిషాలనుంచీ వింటూన్నా కని బెదుతున్నా, మాటలధోరణేమిటో, మనసులో ఏముందో—ఏమీ—గోచరించనేలేదు. ఆయనసముక్షంలో ఉండటమే యాతనగా ఉంది. ఆచూపు—

ఆచూపు తమాషాగా ఉంది, కాని అర్థం అయే టట్టుమాత్రం లేదు. మా ప్రజ్ఞలన్నీ మా అధీనం దాటి పోతూన్నాయి.

—అది అంతకన్నా చిత్రంగా ఉంది!—ఇప్పుడు గాంభీర్యం ఉట్టిపడుతూంది ఆముఖకవళికలో. అ—ధీరుడు ఓమాదిరిగా, దుర్నిరీక్షుడుగా ఉన్నాడు—మారిపోయి నాడు.

'అనసూయను నీవు ప్రేమిస్తున్నావుకాదూ?'

పిడుగుపడింది:—కాని ఆయన చలించలేదే?

'అడుగినక్కరలేదు—నీకు—ఆ—మె—మీద చాలా ప్రేమ ఉంది—నాకు తెలుసును.'

అగ్నిపర్వతం అడుగంటా కదిలి పోయింది:— తప్తధాతుప్రవాహం ముంచుకువస్తుంది.

—సుందరం కూర్చున్నచోట నుంచి లేచి— ఎగిరి—నిలుచున్నాడు—వణకిపోతున్నాడు. కళ్లు,భావ— కవిత్వ—రాగాన్ని క్రక్కుతూన్నాయి.

రామమూర్తిగారూ—నేను అనసూయను...... అనసూయ నీది—నాకు కావాలి—........ ఆబంగారు బొమ్మను—మీరు—మీరు—ఆమెకు మీరు తగరు—ఆమె జీవితాన్ని పాడుచేస్తున్నారు. ఆలావణ్యరాశి—ఆ....

రామమూర్తిగారు ఈధూకుడు చకితుడైనా కాలేదు. చిరునవ్వు—నిజంగానే—చిరునవ్వు నవ్వాడు—

'అవునోయి—ఆమెనీకుకావాలి; నేనుసంతోషంగా అనసూయను, ఆమెప్రేమను ఆశీర్వచనపురస్సరంగా నీ కిచ్చివేస్తాను. హృదయపూర్వకంగా ఆమెను ఆమె వరిం చిన అదృష్టశాలిదగ్గరకు బ్రహ్మరథంపట్టి తీసుకుని వెళు తాను. నీవు పోషించనక్కరలేదు. నాకు కలిగిన దంతా ఆమెదే. ఇప్పుడే ఆమెకు యిచ్చివేస్తాను. ప్రేమేకాదూ, నీవు కోరేదీ, నీకు కావలసిందీ?—'

విన్నాం ఈమాటలన్నీ విన్నాం. కాని అప్పటి మాస్థితి ఏలా తెలియజేయడం?

నీలాంబుదాలమాటునుంచి తొంగుతూ ఉన్న విద్యుద్వల్లి తెరతొలగించుకుని మాకళ్లయెదుట మెరిసింది.

చెంగున ముందరికి దుమికింది. అప్పటికి మేం అన సూయ మాటే మరచిపోయినాం. రామమూర్తిగారు కూడా.

ఆయనకూడా ఈధోరణిలో ఆమెను గమనించ డమే లేదు. అమాంతం, ముందుకు ఉరికి ఎదుట నిలువ బడేటప్పటికి ఎంత నిగ్రహమున్నా మాలాగే ఆయనా ఉలిక్కిపడ్డాడు.

'ఏమిటే ఆగడం?'

ఎవ్వరమూ మాట్లాడలేదు. మెదలనన్నా లేదు.

'అనసూయో!'

రామమూర్తిగారు చాలా ఆశ్చర్యపడుతూన్నా రు. ఇక అనసూయో.

ఆచూపులు, ఆచూపులకి అర్థం తెలియడం లేదు కాని ఆమెకళ్లయెదుట పడుటకన్న ఏమైపోయినా బా గుండుననిపిస్తూంది. ఆకోపం—ఆవిషాదం;

'అభిమానంలేదూ. మీభార్యను పరు డెవ్వడో మెచ్చుకున్నాడని ఆ—ఆతనికి దానంచేస్తారా? పశువుల్లో పక్షుల్లో కూడా లేదే ఇంతధర్మబుద్ధి?

రామమూర్తిగారు అనసూయన తేరి బార చూశాడు—

'వెళ్లవా?—నీ జీవితాన్నంతా వ్యర్థం చేసుకుంటా వా?—నీవు సుఖపడటమే నేనకోరేది—నీమీదప్రేమ'—

అనసూయ ఆడుపులిలాగా గర్జించింది—

'నామీద—ప్రేమ—అవును, నిజంగానే—నామీద మీకు ప్రేమ—దయ—ఆపేక్ష—ఎన్ని ఉన్నాయి!— పశువధ చేసేవాళ్లన్నా, ఆప్రాణిమీద కనికరిస్తారు — మీకా మాత్రమన్నా జాలిలేదే?

రామమూర్తిగారు తెలతెలబోయినారు.—

'అనసూయా—పొరబడ్డానా?' అని సంశయిస్తూ ప్రశ్నించాడు.

'మీరు తప్పుచేశారని—ఈదాసి అనగలదా, అనడానికి అధికారముందా?—కాని, ఇంతకాలమున్నా, నామనస్సు కనిపెట్టలేక పోయినారుకాదా?'

'నీవు—ఈ—ఈయననూ—'

'అవును. మీ మాటలన్నీ విన్నతర్వాత సంగతంతా తెలిసింది. నాకు తెలియకుండానే నన్ను ఇమిడ్చి వింతకథ అల్లారు.'

'ఏమిటీ?'

'వీరు—ఎవరూ?'

అని మమ్మలను చూపించి అడిగింది.—నేనూ సుందరం తెల్లబోయినాము. మేము ఎవరమోకూడా అనసూయకి తెలియదా?

కాని రామమూర్తిగారికి కోపంవచ్చింది. ఆయనకు అనసూయమాటలు అర్థంకావడం లేదు కాబోలు!

'ఏం వేషాలూ—ఎవరో తెలియకుండానే,— ఆయన్ని—'

అనసూయ నవ్వింది.

'ప్రేమించావనేనా, మీరడుగబోయేది?'—

'అవును'—అని రామమూర్తిగారు తలఊగించారు

మళ్లా—ఈమారు బిగ్గరగానే—నవ్వేసింది అనసూయ.

'అయితే—నేను ప్రేమించానా?—ఎవరినీ?'

'ఎరుగవా?'

'మీకు—తెలియదా?'

'తెలుసును. నేను—చూశాను. ఆవెన్నెల రాత్రుల్లో ఆతనికోసం నీవూ—నీకోసం ఆతడూ—పరితపించడం—'

'రామమూర్తిగారు ఉగ్రుడైపోయినాడు. మనసులో దాచలేక, కథంతా చెప్పేశాడు — నిత్యమూ సుందరం—అనసూయకోసం నిరీక్షించడం—ఆమె ఆతనికి కనబడటం—...

ఇంకా ఏవేవోమాట లన్నాడు—వింత వ్యాఖ్యానాలు చేశాడు—ఆ శాంతమంతా ఎక్కడికి పోయిందో.

అనసూయ అంతా విన్నది—

—'అలాగేం—ఒకరిని మించినవారొకరూ—మీరు ఆయన్ని చూశారు—ఆయన—నన్ను చూశారుకాదూ— సరే అంతవరకూ మీకథ బాగానేఉంది—ఒప్పుకుందాం—కాని మిమ్మల్ని ఇద్దర్నీ—నేను చూడలేదే?'

—ఇక ఎవరేం మాట్లాడుతారు?

'—చూడకపోవడం నాదిపొరబాటే — లేకపోతే ఇంతకథ ఏలాజరుగనూ. అయ్యో, వృథాగా ఎంతకష్టపడ్డారూ? నన్నడుగలేకపోయినారా? నా—నామీదనా మీ కపనమ్మకం. అంత విశ్వాసం లేకపోయిందా?'

'అవును ఏలాఅడుగుతారు అబద్ధం చెపుతానేమో ననుకున్నారుకామూ. మీతో—మీతో అబద్ధమాడుతానని మిమ్మల్ని మోసం—మీకు ద్రోహంచేస్తానని ఏలా అనుకున్నారూ! అంతమాత్రం నన్ను నమ్మలేకపోయినారా? అబ్బ! మీది ఎంతరాతిగుండె!'

'మీ ఎదుటబడి ఇతరులున్నప్పుడు ఇంత నదురూ బెదురూ లేకుండా మాట్లాడడం తప్పే. నాకూ తెలుసును. కాని స్త్రీకి ఇంతకన్న గొప్పపరీక్ష ఏముంది. మీవంశగౌరవం, మీప్రతిష్ఠ, నన్నుకన్నవారిమర్యాద నేను కాపాడుకోవద్దూ?

'మీకూ తెలుసునుకాదూ. భోజనం అయిన తరువాత నిద్రపోకముందు కాస్సేపు చల్లగాలిలో తిరిగే అలవాటు నాకుందని? నేను కాపురానికి వచ్చినప్పటినుంచీ మీరు చూస్తూనే ఉన్నారు. చిన్నప్పటినుంచీ కూడా అంతే. కావలిస్తే మావాళ్లని కనుక్కోండి.

45

చక్కగా వెన్నెలఉండి, చంద్రుడూ, నక్షత్రాలూ, మెరుస్తూ కనబడుతూంటే—క్రిందరోడ్డూ-రోడ్డుమీదపోయే మనుష్యులనీ చూడటానికి—ఎవరికి మనసొప్పుతుందండీ?—నాధ్యానంలో నేనుంటే—పాపం. ఆయన నన్ను చూసి ఉంటాడు:—

'వీరివేషం, వైఖరీ మాత్రే కవిత్వంచెప్పేవారులాగా కనబడుతున్నారె—మీరూ,—ఓపికలేక బయటికి అనక పోయినా—మనసులో ఉందికాదూ మీకును ఆధోరణి—కనుక ఇది మీరుభయులూ కలిసిచేసిన వంచనా?,

'—మా నాన్న అనేవాడు లేండి 'నిరంకుశాః కవయః' అని—మాచిన్నతనంలో సరిగా అర్థంచేసుకోలేక, ఈకవులందరూ, సరిగా అంకుశంపెట్టి పొడిచిమంచిదోవలోకి తీసుకువచ్చేవాడు లేక ఈలాచెడిపోతున్నారనుకునేవాళ్లం—కాని బుద్ధితెలిసినకొద్దీ, ఆ అమాయకపు ఊహాలే నిజం అవుతున్నాయే?—మీరందరూ, 'నిజం చేస్తున్నారే?

'మీ ఆలోచనలో మంచి చెడ్డలు మీకు తెలియాలి—కాని—అందరూ, మీలాగానే అనుకొని—అందరూ మీ అందుబాటులోవారనుకుని—వృథాగా కష్టపెట్టకండీ—మీరుకష్టపడకండి.'

వింటున్నకొద్దీ, కాళిదాసు శకుంతలచేత చెప్పించిన లెక్చరు, దీనిముందర చాలా నీరసంగా కనబడ్డది—నిజంగానే, చక్కని వాళ్లకు, కోపంకూడా అదోమాదిరి అందమే—

అనసూయ, ఈమాటలన్నీ రామమూర్తిగారికి ఎదురై అన్నది. ఇకచాలించి, మమ్మల్ని రక్షిస్తుందేమో ననుకున్నాం—నేనుమాత్రం, నాజన్మనూ—దానికి కారకులనూ, మావంశానికి మూలపురుషులనూ, శాపాస్త్రాలన్నీ తప్పించి ఇందాకా బ్రదుకనిచ్చిన దైవాన్నీ—ఎంత తిట్టానో—తిడుతూన్నానో—ఎవరి కెరుక?

కాని, మా కంతటితో తప్పించుకుని బయటపడే భాగ్యం లేదు. రామమూర్తిగారి దిక్కునుంచి మావైపుకు తిరిగింది ఆతుపాను. ఒక్కటే విసురు.

'అయ్యా! మీరెవరో ఎరుగను — క్షమించండి. కాని, మీతో బుట్టువునే, ఆమాదిరిగా—చూడటానికి మీ మనసు ఒప్పదనుకుంటాను—కాదూ?'

అని అన్నది మృదుమధురస్వరంతో — ఎంతో నెమ్మదిగా.

ఆదెబ్బతో మాయిద్దరిపనీ ఆఖరయిపోయింది. సుందరం నేనూ.—ఎవరు ముందో, ఏలావచ్చి బయట పడ్డామో, తెలియదు.

నేను కాస్త వెనుకపడ్డా ననుకుంటాను. రామమూర్తిగారు అనసూయయెదుట సాంజలియై క్షమార్పణ వేడటం, ఆమె ఆయన్ని తగనిప్రేమతో వారించడం చూశాను చూచాయగా.

సుందరం ఈమధ్య అసలే కనబడటంమానేశాడు. వేసవికి ఊటీ వెళ్లాడేమో?

అమాటే—ఆ అమ్మాయి మాటే ఆమె అన్న ఆ మాటే ఎప్పుడూ తలపునస్తూంటుంది. తలచుకున్నప్పుడల్లా నవ్వుకుంటూంటాను. నిజమే—ఒకరిని వించినవారొకరూ!

---

## ఒకనాటి గీతి

ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి గారు

ఎన్నియబ్దాలనుండో నాహృదయసుమము
సమధికానందశాఖతో జంటఁబాసి
భగ్నమై ధూళియై తుదిభస్మమయ్యె
నే సహింపంగలేక నిర్నిద్రనయన
జలదమాలాకవోష్ణంపు సలిలధారఁ
దడపిపదనిడఁజూడ దుర్దైవహతక

చోదితుండయి యెవ్వఁడో చూరగొంచు
నెగురఁగొట్టెను నాకర్మ మేమనందు
కూర్కు రాదయ్యెఁ గన్నులు గ్రుచ్చుకొనిన
మెతుకువోదయ్యెఁ గొంతులో మెదపికొన్నఁ
గనులు మూసి సమాధిలోఁ గలసిపోవ
హృదయసుమసౌరభంబులు కదలుచుండె.

నే నభిలషింపవలసిన నిస్తులంపు
వస్తువేదేని జగతిలోపలను లేదా?
ఉన్నను గ్రహింపలేకయే యొక్కదాని
కై, తపించుచునుంటినో? కాదు కాదు
యే నపేక్షింపవలసిన దిదియ నిజము
మఱల నామేను కష్టాల మరుగుచుండె

అంతమేలేని దార్ద్ర్యహవ్యవాహ
కీలలెగఁజిమ్మి మఱికొంత తూలనేసె
నదనెఱిఁగి వచ్చిపడుగాదె యరిబలంబు.
ఒంటిగానుండ భయము మహోగ్రరూప
ధారియై యొక్కయధముఁడు తారుకొనును

నంతవఱకును నాకష్ట మంతరింప
జిలిబిలిగ ముద్దుమాట తేనెలను జిమ్ము
సుద్ది నన్నలరించు నాముద్దుబిడ్డ
యట్టె తానెగిరి చనునమ్మా! యటంచు
యెవ్వ తెరుఁగుదు రంత నేమేమిచనెనో

ఈశ్వరా! యిట్టిదుఃఖనిరీహమతిని
వేదనాధూయమానత వేఁగ వేఁగ
నెన్ని హేమంతములు యెన్ని యెన్ని వార్ష
దినములు వసంతకములును జనఁగవలెనో?
నీవెటుంగుదువా? లేక నిత్యసాక్షు
లయిన కొబ్బరికొనయా? యమల సలిల
కౌశికయ? వృద్ధగౌతమికాల్వయా......

ఎగిరిపోయిన సుమభస్మమెట్టులైన
శాంతికల్లోలినీపరిసరములందుఁ
బ్రోవుచేసి తదీయ కల్లోలలోల
వాయుసుకుమారసఖుని సహాయమునను
నపుడ పునరుద్ధరింపంగ నాసపడితి
నరిమె నాకూతునసఖియె వసంతలక్ష్మి

నిస్తులమనోహరపుఁ గుహూనిస్వనాల
నల్లదే! పోలుస్వాగతంబడిగి పిలిచి
పరచెఁ దెలితెలియిసుక క్రొంబట్టుపరుపు
అనిలసుకుమారుఁ డల్లన నరుగుదెంచి
కోమలములగు నాదు ముంగురులఁ గేల
నూచియెగఁద్రోసి మూసి దోఁబూచులాడె
ముద్దుగూఁతురు నగుచు నామ్రోల నిలచి
భావకుసుమంబు రేకెత్తి పరిమళించె.

నీరసంబగు చేతుల నెత్తికొంచు
నాయవస్థలఁ గన్గొని నవ్వినవ్వి
పొంగి బోరగిలఁబడెదు పొమ్ము చాలు
యెండినను వక్రగుణమ? త్రాచేటి బోటి
నాకుయశమబ్బ నాస సుంతయును లేదు
యొరుల మెప్పింత మనునిచ్ఛ నుండనీను
దోడివారల యెగతాళిఁ ద్రుంగిపోను
మిత్రు నభినందనంబుల మిట్టిపడను

నాదుముద్దుల కొమరిత నవ్యమధుర
మధురభాషాస్రవంతిపై మలయుచుందు
నాతనూజాత శుభవదనంబుపైని
దొలఁకునవ్వు పూలనావపైఁ దూఁగిపోదు
సొగకన్నులప్రకృతిక శోభలందుఁ
దూఁటి యానందవాహినిఁ దోఁగిపోదు
అవధిలేనిది కాల మీయవని విపుల
యెవ్వ రేమనుకొన్న నాకేమి కొదువ.

---

ఆదివారము సాయంత్రము నాలుగు గంటలవేళ చంద్రశేఖరరావు పేపరు చదువుతూ ఈజీ చైర్ మీద పడుకున్నాడు. "నాన్నగారూ, కాఫీఫలహారము తీసుకువచ్చినాను. పుచ్చుకోండి, చల్లారిపోతుం" దని లలిత కాఫీఫలహారములను అక్కడపెట్టి లోపలికి వెళ్లింది.



శ్రీమతి ద్రోణంరాజు సీతాదేవిగారు

"ఏమండీ లలితకి పదమూడవ యేడుకూడా వెళ్ల వస్తోంది. నేనిదివరకు రెండేళ్ళనుంచి పోరుతున్నా మీకేమీ నాటుకోలేదు. కచేరీపను లున్నవని కొన్నాళ్లు, కోర్టులో దావాపను లున్నవని కొన్నాళ్లు కాలయాపన చేస్తూవున్నారు. ఈమాఘమాసములోనైనా పెళ్లి చెయ్యకపోతే మనము నలుగురులోను తలయెత్తి తిరుగలేము" అన్నది అంతట్లో లోపల్నుంచి వచ్చిన సుందరమ్మ.

"అవును నేను ఆలోచిస్తూనే వున్నాను మరి. ఇదివరలో మనమాలోచించినసంబంధాలు భూవసతి లేకపోవడము, పిల్లవాడికి చదువులేకపోవడము, ఇవన్నీ వుంటే అబ్బాయి కురూపి అవడము తటస్థపడుతూవుంది. మన యిందిరకు వచ్చినసంబంధములాటిదే వెతికి, మూడువేలైనాసరే కట్నంపెట్టి, లలితకి అనుకూలమైన వరుని తేవాలి. లలిత రూపవతి. ఇంగ్లీషుకూడా బాగా చదువుకుంది. దానికివచ్చిన వరుణ్ణి చెయ్యాలి. నాకు వారంరోజులైనా సెలవివ్వడు. ఉఫిరి తీసుకోటానికైనా తీరుబడిలేదు."

"నిజమే, యేంచెయ్యాను మరి. మా పినతల్లి కొడుకు శేషగిరిరావు నాలుగునెలలు ప్రివిలేజీ లీవు తీసుకొని కాళీగా యింటిదగ్గఱ కూరుచున్నాడు. అతని స్నేహితులు గొప్పగొప్పవాళ్లు చాలామంది వున్నారుట. ఈ సంబంధము విషయములో అతనిని సహాయము చెయ్యమంటే బాగుండును."

"అవునే, సమయానికి మాబాగాజ్ఞాపకముచేసేవు. నేనామాటే మరచిపోయినాను." అంటూంటే ఇంతట్లో ఖద్దరుపంచె కట్టుకొని తువాలు మీదవేసుకొని శేషగిరిరావు లోపలికొచ్చాడు.

"ఓహో! బావగారా, వెయ్యేళ్లు. నేనూ, మీచెల్లెలూ యిప్పుడే మీమాటనుకుంటున్నాము. ఈ కుర్చీమీద దయచెయ్యండి." అన్నాడు చంద్రశేఖరరావు.

"అన్నయ్యా, వారంరోజులనుంచి యెక్కడా కనబడటంలేదే! పిల్లలంతా కులాసాగా వున్నారా? ఒకమాటు వద్దామంటే వకవూరు ప్రయాణమైనట్టు రావాలి. మీరు యీవూరువచ్చి ౧౫ రోజులైనా ఒక్కమాటు మాయింటికి రాలేకపోయేను. పాపము వదిన యేలాగో తీరుబడి చేసుకుని వచ్చింది."

"అవునమ్మా చాలామారమే. వారంరోజులనుంచి శ్రీనివాసానికి జ్వరం వస్తోంది. నిన్ననే పథ్యంపెట్టేము. నాకూ అందుచేత రావడానికి వీలులేకపోయినది. మాటల సందడిని మరచిపోయేను. నీమాటే అనుకుంటున్నామని అన్నారేమిటిబావగారూ?"

"ఏమీ లేదు. లలితకి ౧౨ యేళ్లు వెడతాయి. సంబంధాలు వెతకడానికి నాకెక్కడ తీరుబడిలేదు. మీరు సెలవుమీద తీరుబడిగా కూర్చున్నారు. ఈ వుపకారం మీరు చెయ్యాలి. తగిన సంబంధమేదోచూచి యీయేడు పెళ్లిచెయ్యక తప్పదు. ఈభారమంతా మీదే."

"అయ్యో! యీపాటిదానికే నన్నింత ప్రాధేయ పడాలా, బావగారూ; నాచేతనైనంతవరకు నే నీ ప్రయత్నం చేస్తాను. రేపటిరోజున నేను శిస్తులువసూలు చేసుకోటానికి అమలాపురంవెళ్లాలి. ఆప్రాంతాల్లో ధనికులు నాకు తెలిసినవాళ్లు కొంతమంది వున్నారు. ఏదో మంచిగౌరవమైన సంబంధం చూచుకొనియేరీ వస్తాను."

"అన్నయ్యా! లలితఅందానికి తగ్గ పెండ్లికొడుకును చూడాలిసుమీ, నీ పిల్ల ఒకటీ నాపిల్ల ఒకటీ అనుకోకు. ఈభారమంతా నీమీదే వదిలేశాము."

"అమ్మాయీ, నాకింతగా చెప్పాలా? మన లలితకి తగినవరుని వెతకటం పూచీ నాది. బావగారూ, సెలవు. రేపుదయం పడవకిబైలుదేరుతాను. వారంరోజుల్లో తిరిగివస్తాను. అమ్మాయీ, వెడతాను."

"మంచిది."

* * *

చంద్రశేఖర్రావు రెవిన్యూ ఇన్స్పెక్టరు పనిలో వున్నాడు. గౌరవమైన కుటుంబములోనివాడు. వారికి పాలుకి ౨౦౦౦ రూపాయిలు రాబడిగల భూవసతి. పెద్ద నాలుగిళ్ళ భవంతి. ఇంటిచుట్టు తోటలో ఫలవృక్షములును, గులాబీ, సంపెంగ మొదలైన పువ్వులచెట్లును నిండి యున్నవి. ముగ్గురు కూతుళ్లు ఇద్దరు కొమాళ్లు. పెద్దకుమార్తె యిందిరకు పెళ్లియయి కాపరానికి వెళ్లింది. రెండవకూతురు లలితకు వివాహవిషయమై రెండు సంవత్సరాల నుంచి ప్రయత్నం చేస్తున్నారు గాని ఒకటీ అనుకూలమైంది దొరకలేదు.

ఒకనాటి సాయంకాలము శారద, శ్రీనివాసం, మరి కొందరు పిల్లలూ ఆడుకుంటూ శేషగిర్రావు గుమ్మంలోకి రాగానే "అమ్మా, అమ్మా, మామ వచ్చా" డని పరుగెత్తికొనిపోయి లోపలవున్న తల్లితో చెప్పేరు. సుందరమ్మ మిక్కిలి ఆత్రముతో చావడిలోకి వచ్చి,

"అన్నయ్యా, యెప్పుడు వచ్చినావు, వెళ్లిన పని యేమైంది?" అంది.

"ఏమిటమ్మా, ఇదేమి కూరగాయల బేరమా యేమిటి బజారెళ్లి కొనుక్కురావటానికి? మంచీ చెడ్డా కాస్త ఆలోచించాలా? అమలాపురంలో భుర్రా కామేశ్వర్రావుగారి అబ్బాయి వున్నాడుగాని చదువుబొత్తిగ తక్కువ. మోడేకుర్రులో చేబ్రోలువారి సంబంధము ఒకటుంది. అన్నివిధాలా బాగుంది కాని, లలితకి ఈడు తగడు. మల్యాలవారిఅబ్బాయి వున్నాడు; సాలీనా ౫౦౦ రూపాయిలు వస్తాయి, బి. ఏ. ప్యాసయి, యల్. టి. చదువుతున్నాడు. ముప్పదియేళ్లున్నాయి. తల్లీ, తండ్రీ లేరు. ఇంట్లో మరెవ్వరూ దక్షతలేరు. ఈమూడుసంబంధాలూకూడా నాకేమీ నచ్చ లేదు. విశాఖపట్టణంలో ౨, ౩ మంచిసంబంధాలున్నాయని నాస్నేహితుడొకడు నిన్న పడవలో కనబడి చెప్పాడు. అవికూడా ఆలోచిద్దాము. నేను యింటికి వెడతాను. మరి బావగారు యింకా యింటికిరాలేదు కాబోలు! ఈసంగతులు ఆయనతో చెప్పు" అని వెళ్లాడు.

* * *

"ఏమే? శేషగిర్రావు, బెజవాడ వుద్యోగంలో కెళ్లి ఆరుమాసాలయింది. అక్కడ యెవరన్నా పెళ్లికొడుకులుంటే వాకబుచేస్తానని చెప్పాడు. అక్కడా యేవీకుదరలే దనుకుంటాను. ఆతనికి బెజవాడనుంచీ విశాఖపట్నం ట్రాన్సుఫరు అయిందని మొన్న వెంకోబరావు చెప్పాడు. అవూళ్లో యేవో సంబంధాలున్నాయని యిదివరలో మనము అనుకున్నాంగాదూ? శేషగిర్రావు పేర విశాఖపట్నం ఈవాళ ఒకవుత్తరం వ్రాస్తాను."

"ఏం రాస్తారో, మీరు రాయటం, అతను తిరగటం సరిపోతూందిగాని, యేమీలాభం లేదు. పెళ్లికొడుకు బాగు లేడనీ, ఆస్తితక్కువనీ, యేవో వంకలు పెట్టి వచ్చిన సంబంధాలన్నీ మించబెట్టారు గదా! పైకి చెప్పుకుంటే సిగ్గు. దానికి కార్తీకమాసానికి ౧౭ వెళ్లి ౧౮ యేడు వస్తుంది. ఏమీ పాలుపోవడం లేదు."

"ఏంచేస్తాము మరి? అనువైన సంబంధము దొరక్కపోతే, ఏదారేపోయేవాడికో కట్టపెడితే, దానికి వాడిమీద యిష్టంలేకపోతే, బతికినన్నాళ్లూ మన జీవానికి వునూరుమని యేడుస్తూంటుంది. అది రజస్వలైతే అవుతుంది. మంచివరుడు దొరికేవరకూ నేను చెయ్యదలచుకో లేదు."

ఇంతలో టపాబంట్రోతు కవరొకటి యిచ్చి వెళ్లాడు. చంద్రశేఖర్రావు తొందరతో విప్పిచదివాడు.

విశాఖపట్నం, మహారాణీపేట
౯-౧౦-౨౭

మహారాజశ్రీ బావగారి సన్నిధికి, నేను ఈవూరు వచ్చి ౧౦ రోజులైనది. ఈవూళ్లో దుగ్గిరాల ఉమామహేశ్వరరావుగారి కొమారుడు బి. ఏ. చదువుచున్నాడు. సమస్తవిధముల వారి కేలోటు లేదు. మన లలితకు అనుకూలవరుడుగా నున్నాడు. ఈసంబంధము స్థిరపరచవలెనని యున్నది. రేపటి వుదయము నే నక్కడికి వస్తూవున్నాను. అన్నిసంగతులు విశదంగా మాట్లాడవచ్చును.

ఇట్లు: విధేయుడు,
స్వా. శేషగిరిరావు.

ఆరాత్రి తెల్లవారింది. "టైము యెంతైంది. మేలు వేళయిందా" అని అందరూ అనుకుంటూ వుండగా, గుమ్మంలో బండి ఆగింది. "వచ్చాడు, వచ్చాడు, మామ" అని పిల్లలు కేకలేయడం మొదలుపెట్టారు. తండ్రి ఆ మాటలు విని నీళ్లు పోసుకొని తుడుచుకొంటూనే చావట్లోకి వచ్చి "దయచేయండి బావగారూ, అంతా క్షేమమా" అన్నాడు.

"ఆ తమదయవల్ల అంతా బాగావున్నాము."

"అన్నయ్యా, మడి గట్టుకో; పాపము! నిన్న యెప్పుడు భోంచేసివచ్చావో, సావుకాశంగా ఆనక మాట్లాడుకోవచ్చు" నన్నది సుందరమ్మ.

"ఔను, స్నానంచెయ్యండి బావగారూ!"

"అలాగే."

అంతా మడికట్టుగుని భోజనాలుచేసి తాంబూలంవేసుకుంటూ చావిట్లో కూచున్నారు.

"భావగారూ! ఈ ఆశ్వీజ బహుళ తదియరాత్రి 9 గంటలకు వకమూహూర్తముందిట. అది తప్పితే మళ్లీ చైత్రమాసందాకా లేదట. అబ్బాయి దసరాశెలవులు ఆఖరవగానే చదువుకి తిరిగీ చెన్నపట్నం వెళ్లిపోతాడు. యేమంటారు?"

"అయితే భావా, వాళ్ల స్థితిగతులేమిటో తీరా చెప్పావుగావు."

"ఉమామహేశ్వర్రావుగారి కొక్కడేకొడుకు. సాలుకు 1500 రూపాయలు రాబడిగలభూములున్నాయి. ఒక యిల్లుంది. పిల్లవాడు బి. ఏ. చదువుచున్నాడు. వాళ్లు మంచి సాంప్రదాయం కలవాళ్లని చాలామంది చెప్పారు."

"అన్నయ్యా? పెళ్లికొడుకు అందంగా వుంటాడా!"

"ఆ, అందాని కెక్కడికీ, సూటు, బూటు, క్రాఫు వుంటే అందమా; లేకపోతే లేదా? పరువు, మర్యాద ఆలోచించాలి కాని? నామట్టుకు బాగానే వున్నాడు; తెలివితేటలు కలవాడు."

"ఔనండీ బావగారూ, మీరన్నది నిజమే. ఈ సమ్బంధం బాగానేవుంది. అయితే కట్నంమాటేమిటి?"

"లాంఛనాలు 500 రూపాయలు పెడితే కట్నము 1500 రూపాయలు. లేకపోతే 2000 పొయ్యడమే మామూలయిపోయిందిగామా."

"సరే. ఈ తదియముహూర్తానికే అయేటట్లు ఆరేంజమెంటు చెయ్యండి."

"అలాగే; మీప్రయత్నాలు మీరు చెయ్యండి. నేను వెళ్లాలి. ఈవాళ ఆదివారం గనుక నాకు రావటానికి వీలయింది. సాయంకాలం ప్యాసెంజెరులో వెడతాను."

రాత్రి శేషగిరిరావు విశాఖపట్టణం వెళ్లాడు.

* * * *

"ముహూర్తం ఈవాళకి 9 రోజులుంది. ఏమే? మనసుబ్బాయమ్మకీ, రమణమ్మకీ కబురుపంపి మనవాళ్లను నలుగురినీ పిలిచి, అప్పడాలు, అటుగులు, ఒడియాలు మొదలైన మడిపనులన్నీ చేయించు. పప్పులు, ఉప్పులు యింట్లో చేయించడానికి వ్యవధి లేదు. పచ్చిపప్పులు బజారులో తెప్పిద్దాము. ఒరే, వెంకన్నా! ఇలారా, మన లలితమ్మకి పెండ్లి వారంరోజులుంది. పందిళ్లుపాకలు

వేయించాలి. సుబ్బయ్యనీ, రామయ్యనీ పిల్చుకొచ్చి యెల్లుండికి ఆపనులన్నీ చేయించాలి."

"చిత్తం బాబూ, యేవూరండి అబ్బాయిగారిది?"

"విశాఖపట్నంరా ?"

"బాగుంది బాబూ. వీధులో పందిరిస్తంభాలకి మనతోటలోని గెలలతోవున్న అరటిచెట్లు కట్టిస్తాను బాబూ."

"కట్టించు, ఎలావుండాలనుకొన్నావు, సీతాకళ్యాణమండపంలాగుండాలి. ఇవిగో ఈ ఐదురూపాయలు. రంగులకాగితాలు తెప్పించి బుట్టలు మొదలైనవి పందిరిలో కట్టించు."

"చిత్తం బాబూ, సెలవు."

* * * *

గోదావరిదగ్గరకు స్నానానికి వచ్చిన ఆడవాళ్లలో కావేరమ్మ "ఏమమ్మా కిష్టమ్మా? వింజమూరి వారి లలితకి పెళ్లిట. యెప్పుడూ ?"

"నువ్వెరగవా యేమిటే? అప్పుడే పందిళ్లూ పాకలూ అన్నీ వేశారు. చుట్టాలుకూడా చాలామంది ఈవాళ వొచ్చారు. ఎల్లుండి పెళ్లి. రేపు పెళ్లికూతుర్ని చేస్తారు."

"పెళ్లికొడుకు ఏవూరు ?"

"విశాఖపట్నంట. వాళ్లింటిపేరు దుగ్గిరాలవారుట; భావరాజువారింట్లో విడిది."

"దుగ్గిరాల ఉమామహేశ్వరావధానులుగారా? సరి; మొన్న మా వేనగోడలిపెళ్లికి పురోహితుడే ఆయన. ఇదేమి టమ్మా! యిన్నాళ్లు పెంచి యిలాటి సంబంధముచెతిగారూ? పది హేనేళ్లూ గుజ్జంలాగపిల్లని పెంచి అవధాన్లుకొడుకిస్తున్నారా? గొప్పవాళ్లేపనిచేసినా బాగానే వుంటుంది."

"సుబ్బమ్మా, నీకెందుకమ్మా, ఇచ్చేవాళ్లూ చేసుకునేవాళ్లు వుండగానూ, అవుధాన్లు అవుధాన్లు అంచున్నావు, అవుధాన్లు బ్రాహ్మడు గాడా యేమిషి?"

"ఊరుకోండమ్మా, కిష్టమ్మా, అవధాన్లంటే బ్రహ్మావధానులుగారి భార్యకి కోపం వచ్చింది. మన కెందుకీ అనవసరమైన ప్రసంగాలూ? మాటలతో పొద్దెక్కిపోతూంది. మాఅబ్బాయికి కాలేజీవేళకి పదిగంటలకు వంట కావాలి నేను వెళుతున్నాను."

"నీకేనా? నాకుమాత్రము మావారి కచేరీవేళకి వంటకావొద్దూ, నేనూ వెళుతున్నాను."

అని బిందెలు బుజానబెట్టి తడిని చెయ్యిపెట్టుకుని ఎవరితోవని వారు వెళ్లారు.

* * * *

చుట్టాలంతా గలగల్లాడుతూ యింటినిండావున్నారు, లలితని ఆవేళ పెళ్లికూతుర్ని చేశారు. సాయంత్రం పేరంటాళ్లంతావచ్చి మంగళహారతు లిచ్చారు. "రాత్రి 7 గంటకి మేయిల్లో మగపెళ్లివారంతా దిగుతారు. పెండ్లివారిని యెదురుసన్నాహం చేయుడానికి తోటలోకి వెళ్లాలి. దబ్బున అంతా జడలువేసుగుని, చీరలుకట్టుగొండర్రా?" అని సుందరమ్మచెల్లి అన్నపూర్ణమ్మ కేక లేస్తూంది.

"లైట్లు యింకా రాలేదేమిరా వెంకన్నా?" అన్నాడు పంతులు.

"వచ్చాయిబాబూ, నాలుగులైట్లు తీసుకొచ్చారు"

"మేళం వొచ్చిందా?"

"ఆ, అంతా సిద్ధంగావున్నారండి."

"మీరు బైలుదేరండి 6 గంటల 25 నిమిషా లైంది. త్వరగా రావాలి అన్నాడు" పురోహితుడు.

"రైలుదగ్గిరికి పెళ్లివారికి కారు పంపేర్రా, లేదా?" అన్నది సుందరమ్మ రవికతొడుక్కుంటూ.

"ఆ అన్నీ పంపేనే, 'చీరకట్టేటప్పటికి పట్నం మటు మణిగిం' దని నీవింకా రవిక తొడగటంతోనే వున్నావు, చీరకట్టావూ? జడవేసుగోవాలా యిప్పుడు?"

"అన్నీ అయినాయి పదండి. నా ఆలస్యం లేదు. సుబ్బమ్మా, రంగమ్మా, అంతా రండి. మీ బావగారు కని పెట్టుగున్నారు."

ఆడవాళ్లూ, మొగాళ్లూ అంతా ముస్తాబయి వర పూజ చేసేటప్పుడు యివ్వవలసిన లాంఛనాలన్నీ పట్టించుకొని గ్యాసులైట్లతో గన్ సెట్ మేళంతో బైలుదేరి తోటలో బంగాళాలోకి వెళ్లారు. పెళ్లివారు పావుగంట క్రిందటనేవచ్చి అక్కడవున్నారు. అక్కడ చెయ్యవలసిన లాంఛనాలన్నీ జరిపి వరపూజచేసి తాంబూలాలు పుచ్చుకొని పెళ్లివారిని మేళంతో తీసుకొచ్చి విడిదిలో దింపారు. రాత్రి 9 గంటలైంది. అంతా భోజనాలుచేసి తాంబూలాలు వేసుకుంటూ ముచ్చటలు చెప్పుకుంటూ కూర్చున్నారు.

లలిత, ఆమె పింతల్లికూతురు కమల, మేడ మీద ఒకగదిలో కూర్చొని తాంబూలం వేసుకుంటున్నారు. వారిద్దరూ చిన్నప్పటినుంచీ 8వ తరగతివరకూ ఒకబడిలో ఒకక్లాసులో చదివేవారు. చుట్టరికమే గాక స్నేహమెక్కువ. లలితకంటె కమల ఒకసంవత్సరము పెద్ద. కమల 10 మాసములక్రిందటనే అత్తవారింటికి కాపురమునకు వెళ్లినది. అనంతపురములో ఆమెభర్త ప్లీడరు. కమల కాపురమునకు వెళ్లినతర్వాత లలితను చూడవచ్చుట ఇదియే మొదటిసారి.

"కమలా? యెన్నాళ్లయినదే నిన్నుచూచి! ప్రాణములేచి వచ్చినట్లుందే!"

"ఈమధ్య మీ బావగారిఇంట్లో జబ్బుచేయటంచేత నీవుత్తరములకు జవాబులు వ్రాయుటకైనా, నాకు తీరికలేకపోయింది. భగవదనుగ్రహమువల్ల నెలరోజులనుంచి కొంచెములేచి తిరుగుచున్నారు. నీవు నీభర్త పెండ్లిపీటలమీద కూర్చునియుండగా చూడవలెనని యభిలాషచే, పెండ్లి 5 రోజులుండి వచ్చెదనని మీబావగారిని కోరివచ్చితిని."

"అక్కా, ఎన్ని యిబ్బందులున్నా వీలుచేసుకొని అంతదూరము నుంచివచ్చుటకు నీకు నామీదగల ప్రేమకు నేనెంతయు కృతజ్ఞురాలను. అయితే, నీవు యింకా తోటలోకి వెళ్లావా? విశేషములేమిటి?"

"విశేషాలేమున్నాయి? నీవు యినివరలో పెండ్లికొడుకుని చూచావా?"

"లేదు. ఏమి అలా అంటున్నావు? బాగా లేడా యేమిటి?"

"ఎక్కడికీ బాగు? పేరయ్యశాస్త్రులగారి కొడుకు వెంకటశాస్త్రిని చూచావా? మల్లయ్యశాస్త్రిగారింట్లో వేదాలునేర్చుకునేవాడు జ్ఞాపకముందా! అదే అచ్చు పెండ్లికొడుకు. అదిగాక వియ్యాలవారితోవచ్చిన వారిలో నౌకరు వియ్యంకుణ్ణి అవధాన్లుగారూ అని పిల్చారు. అదేదో వైదికసంబంధములాగ కనబడుతూంది. అయినా యిప్పుడేమనుకుంటే యేమిలాభము?"

"లాభమో, గీభమో, ఈసంమంధము మానెయ్యటమే. ఇది తప్పిపోయే సూత్రమేదో చూడాలి, యేమాలోచన చెపుతావు?"

"లలితా, అంతా సిద్ధమైనాక యింకా యేమాలోచన? ఇప్పుడీపెళ్లి మానివేస్తే నలుగురు పెద్దమనుష్యులలో నాన్నగారికి అవమానంకాదూ; నీమీద ఆయనకు కోపం రాదా?"

"కోపంమాట కేమిలే, ఆయనకి అవమానమా? అది నానెత్తినే పెట్టుకుంటానులే. ఆయనపట్టి అమాయకులు. ఆయనమాత్రం పెళ్లికొడుకుని యివరకు చూశారా యేమిటి?"

"అయితే మీనాన్న కూడా యెలాస్థిరపరిచారు? ఈవాజె పెళ్లికొడుకెక్కడ సంభవించాడు? ఈసంబంధము వెతకినవారెవరు మరీ?"

"అక్కా, అమ్మ పింతల్లికొడుకు శేషగిరిరావు మామనెరగవూ! ఆయనే దేశాలన్నీ తిరిగి ఆఖరికి ఈ సంబంధము కుదిర్చాడు."

గట్టిచిక్కువచ్చింది యిప్పుడు. రాత్రి ఒంటిగంటయింది. లలితకి కంటిమీద కునుకులేదు. యేమీ పాలుపోవటంలేదు. ఈపెండ్లితప్పిపోయే ఆలోచన చేస్తూంది. తెల్లవారింది. "తలంటుకుందు గాని లే అమ్మా లలితా" అని పిల్చింది అమ్మమ్మ.

"ఏమితలంటూ? నావంట్లో యేమీ బాగులేదు. తలనొప్పిగావుంది. నేలేవలేను" అని కప్పుకొని పడుకుంది

లలిత. "అలాఅంటే యెల్లాగేమరీ, సుందరమ్మా నీకూతు రు తలంటు గోదుట. వంట్లో బాగు లేదని కప్పుకొని పడు కుంది." అని బిగ్గరగా కేక లేసింది. ఈమాటలు విని చావట్లోంచి తండ్రి లలితదగ్గరకువచ్చి, "అమ్మా లలితా? లేవవేమమ్మా?"

"యేమీ లేదండీ నాన్నగారూ, నావంట్లో బాగు లేదు."

"రాత్రి పదుండువరకు కులాసాగా తిరిగితివి గాదూ? నిజముగా నీవంట్లో సుస్తీగా ఉన్నదా, ఈ సంబంధములో యేదైనా లోటున్నదా? చెప్పు."

"యేలోటూ లేదుగాని నేను పెండ్లికొడుకుని చూడాలి"

తండ్రి యేమంటాడు? వాళ్ల కీవర్తమానం చెయ్య లేదు. ఆలోచిస్తూ గదిలోకూర్చున్నాడు. ఎనిమిది గంట లైంది. 10, 11, 12 గంటలైంది. ఇంట్లో యెవరిమట్టుకు వారు యేమీతోచకుండా కూర్చున్నారు.

మొగపెళ్లివారింట్లో అంతా చాలా హడావిడిలో వున్నారు. కాని 12 గంటలైనా యింకా బుక్కోత్రము రాలేదు. వియ్యంకుడు వీధి అరుగుమీదకూచుని, "12 గంటలైంది. ఇంకా బుక్కోత్రము తేలేదేమి చెప్మా" అని ఆలోచనచేసిచేసి ఒంటిగంట విన్నాడు.

"ఇంక కూచుని ఆలోచిస్తే యేమీలాభంలేదు. నేనే స్వయంగావెళ్లి కనుక్కుంటా" నని చెప్పి పైనజరీ ఓణీ ఒకటి వేసుగొని వియ్యాలవారింటికివచ్చి "ఒంటి గంట అయింది. ఇంకా బుక్కోత్రము కావడి పంపక పోవుటకు కారణ మే"మని అడిగాడు. చంద్రశేఖర రావు మామగారు విశ్వేశ్వరరావుగారు వచ్చి, వియ్యం కుని కుర్చీమీదకూర్చుండజేసి, "అయ్యా, మరేమీ లేదు గాని తమ అబ్బాయిని మా అమ్మాయి (పెళ్లికూతురు) చూడాలని అంటూవున్నది. ఇందు చేతనే ఆలస్యానికి కారణమైనది. ఈసంగతి తమతో మనవిచెయ్యడానికి మాఅల్లుడు సిగ్గుపడుతున్నాడు. క్షమించాలి."అన్నాడు.

"ఇందులో తప్పేముంది లెండి! మా అబ్బాయి కుంటివాడా, గుడ్డివాడా? చదువురానిమూర్ఖుడా? నా కలాంటిభయ మేమీ లేదు. ఇప్పుడేవెళ్లి తీసుకొస్తాను" అని వెళ్లి పావుగంటలో పిలకజుట్టు, చెవులకిఅంటుబోల్లు, కళ్లకి పెట్టిన కాటుక కనబడకుండా స్పెక్టకల్స్, కాళ్లకు పసుపుపారాణి కనబడకుండా స్టాకింగ్సు, బూట్సు, గ్లాస్గోమల్లుపంచ కట్టి, మెడ్రాసు హాఫ్కోటు తొడిగి, శేలం అంచుపట్టుకండువా పైనవేసుగొన్న పెళ్లికొడుకు తోనూ, మరికొందరు బంధువులతోనూ సిద్ధమయాడు వియ్యంకుడు. ఇంట్లో మొగాళ్ళు వచ్చినవాళ్లూ అంతా కచేరీచావిట్లో కూచున్నారు. తలుపు వోరవాకిలిగావేసు కొని సందులోనుంచి చూస్తూంది లలిత. నల్లగావున్నా డు; తలమీద పిలకజుట్టు; స్పెక్టికల్స్‌లోనుంచి కళ్లకి దిట్టంగా పెట్టిన కాటుక; చెవులకి అంటుబోల్లు; మొహాని కెక్కడా కళాకాంతులులేవు, నాజూకుతనము లేదు. మొద్దుస్వరూపములా గున్నాడు.

ఇంతలో గుమ్మముదగ్గర కొచ్చి "లలితా, కం హియర్" అన్నాడు తాత. గ్లాస్గో పైటపావడకట్టి బెత్తెడుచేతులు, కంఠమెడ, గల విక్టోరియాపల్లూరవిక తొడిగి, చేతులకు రెండు బంగారుగాజులు, మెడలో ఒక నెక్ చైనుమాత్రమే కలిగి, పక్కపాపిడి, పిరుదుల నంటుచున్న సిల్కురిబ్బన్‌గల వాలుజడ, కాళ్లకు స్లిప్పర్లు వేసికొని యూరోపియన్ లేడీవలె, "ఎస్, గ్రాండ్ ఫాదర్, ఐయామ్ కమింగ్" అని చావిట్లోకివచ్చి నిలబ డింది లలిత. పావుగంటసేపు చూసింది; ఎవరూ యేమీ మాట్లాడలేదు.

" ఈయనే పెళ్లికొడుకు. బాగా చూచుగో, మెడ్రాసులో బి. ఏ. సీనియర్ చదువుతున్నాడు. మాట్లాడవేమి లలితా" అన్నాడు మేనత్తమొగుడు.

"ఏమిటీ, బి ఏ. చదువుచున్న మొహమేనా యిది? మెడ్రాసులోవుండీ తలమీద క్రాప్‌అయినా లేకుండా తల నున్నగా డొక్కించి వంగతొడిమలాగ పిలకవుంచుగోటానికి యీ బి. ఏ. స్టూడెంటుకి సిగ్గులేక పోయిందా? అదిగాక. తెలివితేటలున్న మొహంలాగ కనబట్టంలేదు. మీరు మీరు యేంముళ్లొబెట్టుకున్నా సరే గాని, నాకుమాత్ర మీవరు డక్కరలేదు." అని చటా లున లోపలికి వెళ్లింది లలిత.

"ఆపిల్ల అలాఅంటూంటే మనమేంచెయ్యగలము? ఇదివరలో వరుని పిల్లకు చూపించకుండా వివాహము సెటిలం చెయ్యటం తప్పు మాది. క్షమార్పణ కోరుకొంటున్నా" నన్నాడు విశ్వేశ్వరరావు.

"క్షమార్పణమాటకేంగాని మేము పెళ్లి నిమిత్తం చేసుకొన్న సరంజామ్ము, బంధుల రాకపోకల రైలుఖర్చులు అయిదువందలరూపాయలు వృథాగా మీవల్ల అయినాయి. వాటిమాట యేమంటారు?" అన్నాడు వియ్యంకుడు.

చంద్రశేఖర్రావు గదిలోంచి ఫ్రూడి యివతలికే రాలేదు. ఉమామహేశ్వరరావు లోపలికివెళ్లి అల్లుడితో ఈసంగతులన్నీ చెప్పి 500 రూపాయలు పెట్టె చావట్లోకి తీసుకొనివచ్చి నలుగురిలో కళ్లనీళ్లుకారుస్తూ వియ్యంకుడి చేతులో గుమ్మరించాడు. ఎవరిదోవని వాళ్లు వెళ్లారు. చంద్రశేఖర్రావు చాలా సిగ్గుపడిపోయాడు. "భగవంతుడా! ఈ ఆడపిల్లల పెళ్లిళ్లనుగురించి ప్రాణాంతకంగా వుంది. నేను స్వయంగా చూచుకోక ఈపని వాళ్లమీద పెట్టినందుకు తగినశాస్తి అయింది. చేసిన పనులన్నీ వృథాఅయినాయి. నావుద్యోగం పోతేపోయిందిగాని 4, 5, నెలలు శెలవుపెట్టి, నేనే స్వయంగావెళ్లి వెతకాలి. ఈలోపుగా శారదాబిల్లు ప్యాసైతే రజస్వలానంతరవివాహమని, నిషేధముకూడా వుండదు" అని నిశ్చయించుకున్నాడు.

---



౧. బద్దెకొమ్ముజుట్టు మళయాళీ



౨. ఆచార్ల అయ్యవార్లుగారు



3. సుందరమగు వేలుముడి



౪. యిదియొక క్రొత్తపక్షము కాకపక్షము

55




## కొంగ - రొట్టెముక్క

అయ్యగారి సత్యనారాయణ మూర్తిగారు, బి. ఏ.

అనగనగా ఓకొంగ. ఆకొంగ కందిచేనంతా తిరిగి కందిగింజ, శనగచేనంతా తిరిగి శనగ్గింజ, మినపచేనల్లా తిరిగి మినపగింజ, పెసరచేనల్లా తిరిగి పెసరగింజ, ఉలవచేనల్లా తిరిగి ఉలవగింజా తెచ్చి రొట్టెకాల్చింది. చూసి చూసి ఆ రొట్టె తినలేక కొం గేంచేసింది: పొద్దున్నే మేతకెడుతూ ఏకులోడికే ముసలమ్మ దగ్గర కెళ్లి దాన్ని దాచిపెట్టమని యిచ్చి చక్కాపోయింది. ఏకు లొడుకుతూ అవ్వకు కునికిపాట్లువస్తే రొట్టెముక్క జాగ్రత్తగా వుండదేమో అని అవ్వ దాన్ని కాస్తా తినేసింది. సాయంత్రానికల్లా కొంగ తిరిగివచ్చి అవ్వదగ్గర కెళ్లి "అవ్వా! అవ్వా! నా రొట్టెముక్క నాకు తే" అంది. "నాకు నిద్రవస్తూంటే జాగ్రత్తగా వుండదేమో అని దాన్ని కాస్తా తినేశాను. ఆ కందిరొట్టె కేకులనూలు" అని అవ్వ కొంచెం నూలిచ్చి పంపేసింది. తరువాత ఓసాలాడు బట్టలు నేస్తూంటే వాడిదగ్గర కానూలు తీసికెళ్లి అందికదా కొంగ "సాలి బావా! సాలిబావా! నేనేమో మేత కెడుతున్నాను. ఈనూలు కాస్తా దాచిపెట్టుదూ" అని నూలిచ్చి చక్కాపోయింది. వాడేం జేశాడు తనబట్టకి నూలు తక్కువయితే ఆనూలు కాస్తా నేసేసుకొన్నాడు. సాయంత్రం వస్తూనే కొంగ సాలాడిదగ్గర కెళ్లి "సాలి బావా! సాలిబావా! నానూలు నాకి"మ్మంది. సాలాడన్నాడుకదా బట్టలోకి నూలు తక్కువైతే ఆనూలు కాస్తా నేసేసుకొన్నాను. కందిరొట్టె కేకులనూలు, ఏకులనూలికి కమ్ములపంచ" అని ఓకమ్ములపంచ యిచ్చాడు. ఆ కమ్ములపంచ చంకబెట్టుకొని, మేత కెడుతూ దాన్ని దాచమని ఓ గుర్రాలకాపరి కిచ్చింది. ఆరోజునే గుర్రాలకాపరి యింటికి చుట్టాలూ పక్కాలూ వచ్చారు. వాళ్లకీపంచ బహుమతీ యిచ్చి కాపరి వాళ్లను సాగనంపాడు. కొంగ సాయంత్రం మళ్లీవచ్చి ఆకాపరిని పంచ ఇమ్మని అడిగింది. "ఇంకా నీ పం చెక్కడుంది? చుట్టాలొస్తే వాళ్ల కిచ్చేశాను. అంచేత కంది

రొట్టి కేకులనూలు, ఏకులనూలికి కమ్ములపంచ, కమ్ములపంచకు కొమ్ములగుర్రం" అని కొంగ కో కొమ్ములగుర్రా న్నిచ్చి పంపేశాడు. ఆ మర్నాడు కొంగ మళ్లీ మేత కెడుతూ గుర్రా న్నో మావటివాడి కిచ్చింది దాచమని. వా డేంచేశాడు ఇంటికి చుట్టాలొస్తే దానిమీా దె క్కించి పంపేశాడు. యథాప్రకారం సాయం త్రానికల్లా మళ్లీ వచ్చింది కొంగ. "నాగుర్రం నాకు తే" అని మావటివా ణ్నడిగింది. వా డన్నాడు, "చుట్టాల నెక్కించి పంపేశాను. అంచేత కందిరొట్టి కేకులనూలు, ఏకులనూ లికి కమ్ములపంచ, కమ్ములపంచకు కొమ్ముల గుర్రం, కొమ్ముల గుర్రానికి దాట్ల యేనుగు" అని బాగా దాట్లువేసే యేనుగు నిచ్చి పంపాడు కొంగను. మర్నాడు మేత కెడుతూ ఆ యేనుగు నో వరహాలవర్తకుడి కిచ్చింది దాచమని కొంగ. ఆవర్తకు డేంజేశాడు, దాన్ని కూతురి కరణ మిచ్చి పంపించాడు. సాయంత్రానికల్లా మళ్లీ కొంగ తయారు. వచ్చి ఏనుగు నిమ్మని వర్తకు ణ్నడిగింది. "ఏను గెక్కడుంది గనుక. కూతురి కరణమిచ్చి పంపించేశాను. కందిరొట్టి కేకుల నూలు, ఏకులనూలికి కమ్ములపంచ, కమ్ముల పంచకు కొమ్ములగుర్రం, కొమ్ములగుర్రానికి దాట్లయేనుగు, దాట్లయేనుక్కు మానెడు సోలెడు వరహాలు" అని మానెడు సోలెడు వరహాలూ కొంగకు కొలిచియిచ్చాడు. ఈ వరహాలన్నీ పట్టుకెళ్లి కొంగ జేసింది మర్నా డు మేత కెళ్లేటప్పుడు పిడకలమ్మేదానికి దాచ మని యిచ్చింది. దొరకిందే సందని ఆవరహా లన్నీ ఖర్చు చేసుకొంది ఆ అమ్మి. సాయంత్రం కొంగ వచ్చి వరహా లడిగితే ఎక్కడున్నాయి? ఖర్చయినా" యంది పిడకలమ్మి. అని "కందిరొట్టి కేకులనూలు, ఏకులనూలికి కమ్ములపంచ, కమ్ములపంచకు కొమ్ములగుర్రం, కొమ్ముల గుర్రానికి దాట్లయేనుగు, దాట్లయేనుక్కు మానెడు సోలెడు వరహాలు, మానెడు సోలె డు వరహాలకు గంపన్నర పిడకలు" అని గంప న్నర పిడక లిచ్చింది. మర్నాడు పొద్దున్న మేత కెళ్లేటప్పుడు ఈ పిడకలన్నీ తీసుకుపోయి ఓ పెద్దమ్మ దగ్గర దాచబెట్టింది. పెద్దమ్మేం జేసింది పిడకలన్నీ పొయిలోవేసి హాయిగా అట్లొండుకుంది. మళ్లీ సాయంత్రం కొంగొచ్చి అడిగింది పిడక లిమ్మని పెద్దమ్మను. "పిడకలతో అట్లొండుకొన్నాను. అంచేత కందిరొట్టి కేకు లనూలు, ఏకులనూలికి కమ్ములపంచ, కమ్ముల పంచకు కొమ్ములగుర్రం, కొమ్ములగుర్రానికి దాట్లయేనుగు, దాట్లయేనుక్కు మానెడు సోలెడు వరహాలు, మానెడు సోలెడు వరహా లకు గంపన్నర పిడకలు, గంపన్నరపిడకలకు అట్టున్నర" అని ఓ అట్టూ దానిలో సగమూ యిచ్చింది పెద్దమ్మ. దక్కిందే శాన అనుకొని అట్టున్నరా తీసుకొని,—అప్పుడైనా తినవచ్చు నా—దాన్ని పొద్దున్నే మేతకుపొయ్యేటప్పు డు ఊసుపోక కునికిపాట్లుపడుతూ కూర్చున్న ఓ ముసలమ్మకు దాచమని యిచ్చింది. కునికి పాట్లుపడుతూ పడుతూ పరాగ్గా ఆ అట్టముక్క కాస్తానోట్లో వేసేసుకొంది ముసలమ్మ. కొంగొచ్చి సాయంత్రం అట్టున్నర ముక్క అడిగితే "కునికి

పాట్లుపడుతూ పరాగ్గా నోట్లో వేసుకొన్నాను. అంచేత కందిరొట్టి కేకుల నూలు, ఏకుల నూలికి కమ్ములపాచ, కమ్ముల పంచకు కొమ్ముల గుర్రం కొమ్ముల గుర్రానికి దాట్ల యేనుగు, దాట్ల యేనుక్కు మానెడు సోలెడు వరహాలు, మానెడు సోలెడు వరహాలకు గంపన్నర, పిడకలు గంపన్నర పిడకలకు అట్లున్నర, అట్లున్నరకు చెంపపెట్లున్నర" అని ఓ చెంపకాయ ఘట్టిగాను, ఓ చెంపకాయ పుల్లిగాను కొట్టింది. దానితో కొంగ యేడుస్తూ యింటికి చక్కాపోయింది.

కథ కంచి కెళ్లింది. మనం యింటికొచ్చాం.

---

# శంభులింగం

కొలచిన చటర్జీ గారు




"ఊరికి కావలికాస్తు వీధిలో అరుగుమీద కూర్చున్నాడు."

సుమారు నూరేండ్ల క్రిందట శంభులింగమనే ఒక బ్రాహ్మణుడుండేవాడట. వారిది పల్లెటూరుట. ఆవూరికి బందిపోటు దొంగలు వస్తారని వదంతిపుట్టిందట. పుట్టగానే ఊళ్లోవాళ్లందరు ఒక పెద్ద గడ్డివామిలో చెంబులు తప్పేలాలు సామాను సొమ్ములు అంతా పెట్టేశారట. అంతా ఎక్కడికోపోయి దాగుకొన్నారట. శంభులింగం మాత్రం "ఊరికి కావలి కాస్తు వీధిలో అరుగు మీద కూర్చున్నాడట.

అంతలో బందిపోటువాళ్లు వచ్చి శంభులింగం తప్ప పిట్టపురుగన్నా కనబడక ఆశ్చర్యముతో "నీపే రేమిటి" అని అడిగేరట. "నా పేరు శంభులింగం" అని చెప్పే డట. ఆదొంగలు హాస్యానికి, "శంభులింగం, నీచెంబు ఎక్కడ పెట్టేవు" అనిఅడిగేరట. "అందరు గడ్డివామిలో పెట్టితే నేను గడ్డివామిలోనే పెట్టాను" అని



"అందరు గడ్డివామిలో పెడితే నేనూ గడ్డివామిలోనే పెట్టాను"

చెప్పేడట. దొంగలు కష్టము లేకుండా గడ్డివామి వెళ్లగించి దానిలో వున్న సొమ్మంతా తీసుకొని వెళ్లిపోయినారట. ఊళ్లో వాళ్లు వచ్చి చూచి "చాదస్తపు శంభులింగం, నీమూలముగా చెడిపోయినా మ"ని యేడ్చారట. శంభులింగం "నా చెంబు మాత్రం పోలేదా" అన్నాడట.



"చాదస్తపు శంభులింగం, నీ మూలముగా చెడిపోయినాము"



ప్రతిబింబము

ఛాయాచిత్రకారుడు : యం. కే. రంగస్వామి అయ్యంగారు, చెన్నపురి.

౪౬



చిట్టి పొట్లకాయ
సీమ నెల్లికాయ
గోడపుచ్చకాయ
గొబ్బినెల్లికాయ
అత్తకు పెడితే అల్లం
నేతికి బెల్లం
కొత్తకుండల్లోని గోధుమల్లారా!
పాలకుండల్లోని పసిబిడ్డల్లారా!
అమ్మలమ్మ నీబిడ్డ పేరేమంటే
నీళ్లల్లో నిమ్మపండు,
పాలల్లో పనసపండు
నేతిలో నేరేడుపండు.

౪౭

## బొమ్మల పెండ్లి

బాలికలు చందనపు బొమ్మలకు పెండ్లితంతు నడిపింతురు. అప్పు డీ పదము పాడుదురు.

చిట్టిబొమ్మలపెండ్లి చేయవలెననగా
శృంగారవాకిళ్లు సిరితోరణాలు
గాజుపాలికలతో గాజుకుండలతో
అరటిస్తంభాలతో అమరె పెండ్లరుగు.

చిన్నన్న పెట్టెనే వన్నెచీరల్లు
పెద్దన్న పెట్టెనే పెట్టెల్లసొమ్ము
నూరుదునె బొమ్మనీకు నూటొక్కకొమ్ము
పోతునే బొమ్మనీకు పొన్నెఱునీళ్లు
కట్టుదునె బొమ్మనీకు కరకంచుచీర
తొడుగుదునె బొమ్మ నీకు తోపంచురవిక
ఒడిబియ్యం పెడుదునే ఒడిగిన్నె పెడుదు
అత్తవారింటికి పోయి రమ్మందు
అత్త చెప్పినమాట వినవె ఓబొమ్మ!
మామ చెప్పినపనీ మానకే బొమ్మ!
రావాకుచిలకమ్మ ఆడవేపాప
రాజుల్లు నీ చెయ్యి చూడవచ్చేరు.

ప్రధానపుంగరం పమిడివత్తుల్లు
గణగణగ వాయిస్తు గంటవాయిస్తు
గజంబరాయడూ తర్లి రాగాను
తల్లిముందరనిలచి యిట్లన్ని పలికె



అన్న అందలమెక్కి తాగుఱ్ఱమెక్కి
గుఱ్ఱమ్ముమీదను పల్లమున్నాది
పల్లమ్ముమీదను బాలుడున్నాడు
బాలుడిముందరికి కూతుర్ని దేరె



బొమ్మల పెండ్లి

కూతురిసిగలోకి కురువేరు దేరె
నాకొక్క ముత్యాలబొట్టు దేరమ్మ
బొట్టుకు బొమ్మంచు చీర దేరమ్మ
చీరకు చిలకల్ల రవికె దేరమ్మ
రవికకు రత్నాలపేరు దేరమ్మ
పేరుకు పెట్టెల్ల సొమ్ము దేరమ్మ
చిన్నన్న దెచ్చాడు చింతాకుచీర
పెద్దన్న తెచ్చాడు పెట్టెల్ల సొమ్ము
రావాకుచిలకతో ఆడబోకమ్మ
రాజుల్లు నీచెయిది చూడవచ్చేరు.
వీధిలో ముడివిప్పి ముడువబోకమ్మ
పల్లెత్తిగట్టిగా పలుకబోకమ్మ
పొరుగిళ్లకెప్పుడూ పోవకేబొమ్మ
నలుగురినోళ్లల్లో నానకేబొమ్మ!

ఈ బొమ్మల పెండ్లిళ్లలో వియ్యాల వారి విందులు, అలకలు, మొదలుగా పెండ్లి మర్యాదలన్నీ నడుపుదురు. ఇది భావికాలమందు వాస్తవముగా జరుగబోయే విషయములకు అభ్యాసకృత్య మనవచ్చును. యాజ్ఞికుల శుష్కేష్టుల వంటిది. దీనిచే పసితనముననే బాలికలకు, కులాచార సంప్రదాయములందు ప్రవేశ మేర్పడును. ఈ యలవాటుచే నటుతర్వాత వానిని చక్కగా జరుపుకోగల్గుదురు.

## ౪౭



చెమ్మ చెక్క
చేరడేసి చక్క
అట్లు పొయ్యంగ
ఆరగించంగ
ముత్యాల చెమ్మచెక్క ముగ్గు [లెట్టంగ
రత్నాల చెమ్మచెక్క రంగు లెట్టంగ
పండ్లల్లో మాబావపెళ్లి
ఆకులుపోకులు తెండి
ఆశీగివత్తాంరండి
సూర్యదేవుడి పెళ్లి
చూచివత్తాం రండి
మావాళ్లింటో పెళ్లి
మళ్లీవత్తాం రండి.

బాలికలు ఇద్దరిద్దరు చేతులు చేతులు కలపి తట్టుతూ చుట్టి తిరుగుతూ ఈ పదం పాడుతారు.

## ౪౮

జీర్ణంజీర్ణం వాతాపిజీర్ణం
గుఱ్ఱాల్ తిన్న గుగ్గిళ్లరిగి
ఏనుగుల్తిన్న వెలక్కాయ లరిగి
అర్జునుడుతిన్న అరటిపళ్లరిగి
భీముడుతిన్న పిండివంట లరిగి
గణపతితిన్న ఖజ్జాలరిగి
అబ్బాయి తాగిన పాలు ఆముదము అరిగి
పందల్లే పాకి
కుందల్లే కూర్చుండి
నందల్లే నడిచి
గుఱ్ఱమంత పరుగు



ఏనుగంత సత్తువ ఉండేటట్టు
సాకుమీా యీబిడ్డను సంజీవిరాయ.

తల్లులు రెండు సంధ్యలను పసిబిడ్డలకు పాలు ఆముదముకుడిపి పయిపదము చెప్పుతూ కాళ్లుచేతులు సాగలాగి ఒంటికి ఆముదము పూస్తారు.

## ౪౦



దొంగవో? దొరవో?

పెద్దవారు బిడ్డను ముందు కూర్చుండ బెట్టుకొని 'నీవు దొంగవో దొరవో కనుగొందునా' అని అడిగి—

దొంగవో దొరవో?

దొంగవో దొరవో?—

అంటూ ముడ్డిపూసదగ్గరనుండి ముచ్చిలిగుంట దాకా వెన్నెముకను అలాకనగా తాకుతారు. దానిచేత బిడ్డకు చక్కిలిగిలి యేర్పడుతుంది. కొంతదూరము ఓర్చుకోవచ్చునుగాని ముచ్చిలిగుంట చేరువకు రాను రాను చక్కిలిగింతను నిబ్బరించుకోవడము సాధ్యము కాకపోతుంది. నిబ్బరించుకోలేక చక్కిలిగింతపడి బిడ్డనవ్వును. నవ్వితే దొంగ, నవ్వకుంటే దొర, అని నిర్ణయము. 'నవ్వినావు గనుక నీవు దొంగవైనావులే' అని చక్కిలిగిలి పెట్టినవారు గేలిచేస్తారు. అందుకని బిడ్డ చక్కిలిగింత పడకుండా నిబ్బరించుకునేటందుకు ప్రయత్నించును.

# అధ్యాస

శతావధాని వేలూరి శివరామశాస్త్రి గారు



శ్రీ శంకరాచార్యులవారు అద్వైత వేదాంతము అను ఒకగొప్ప మేడను 'అధ్యాస' అను పునాదిమీఁదకట్టిరి. ఈపునాదికి మొదట మొదట ఉప్పరపని చేసినవారు బౌద్ధులని పురాతనవస్తుశోధకులు కనుఁగొనుచున్నారు.

ప్రాజ్ఞులు ప్రజ్ఞానేత్రముతో పఠింపఁదగిన బ్రహ్మసూత్రములకుభాష్యమువ్రాయఁబోవుచు శ్రీయాచార్యులవారు అద్వైతమతమునకు పీఠికగా అధ్యాసభాష్యమును రచించిరి. ఈ పునాదిలోని ఇసుకనే గీతాభాష్యమునందును వెదఁజల్లిరి. ఈరేణువులే మధురమగు వారి కవితాగానములో స రి గ మ ప ధ ని.

౧

బ్రహ్మము అనఁగా పరమేశ్వరుఁడు ఒకఁడే ఉన్నాఁడు; వేఱేమియు లేదు.

౨

బ్రహ్మమునందు జగద్భ్రాంతి (అధ్యాస) కలుగును.

3

జగత్తు లేనే లేదు.

పరమేశ్వరుఁడు ఉండెనో లేఁడో కానితానును, జగత్తును ఉన్నటులు ఆబాలగోపాల మెఱుఁగునుగదా! జగత్తులేదనుట యెటులు?

ఎటులంటివోయి! బ్రహ్మమునందు జగత్తు కల్పిత మగుచున్నది! చీకటిలో త్రాటినిజూచి పాము అని అనుకొనవా? ఎండలో తలతల లాడు ఆలిచిప్పను చూచి వెండిరేకనుకొనవా? ఎడారులలో ఎండమావులను చూడవా? ఈ త్రాటియందు పాము ఆరోపితమయినది. ఆలిచిప్ప వెండి యయినది. తెలిసిన పిదప త్రాడు త్రాడే ఆలిచిప్ప ఆలిచిప్పయే. ఈ రీతిగనే బ్రహ్మమునందు జగత్తు ఆరోపితమయినది. తెలియుచో అంతయు బ్రహ్మమే.

మూఁడు

మనకు మూఁడు పదార్థములు చూపట్టుచున్నవి. ౧. పరమేశ్వరుఁడు లేక బ్రహ్మము ౨. జీవాత్మ లేక నేను 3. ప్రపంచము లేక జడము.

బ్రహ్మము

బ్రహ్మము సత్ + చిత్ + ఆనంద + స్వరూపము. సత్ అనఁగా ఎల్లపుడును (నశింపక) ఉండునది చిత్ = చేతన స్వరూపము, అనఁగా ఎఱుకయే స్వరూపముగా గలది, మఱియు ఆనందముగూడ ఆయనస్వరూపము.

పరమేశ్వరుఁడు చచ్చిపోవు స్వభావము కలవాఁడనిగాని, తెలివితక్కువ మొద్దని గాని, ఎపుడును ఏడ్చుచు కూరుచుండువాఁడని గాని ఎవఁడును అనుకొనఁడు కావున పరమేశ్వరుఁడు సచ్చిదానందస్వరూపుఁడని యనినచో ఎవరును వాదింపరు. ఇట మతభేదము లేదు.

### జీవుఁడు లేక నేను

నేను అను ఎఱుకకు తావు అయిన వాఁడు జీవుఁడు. ఇతఁడు దేహేంద్రియాదు లగు ఉపాధులతో కూడుకొని ఉన్నాఁడు. ఇతఁడే ఆత్మ, జీవాత్మ, ప్రత్యగాత్మ, చిదాత్మ, కర్త, భోక్త.

'నేను పుల్లయ్యను', 'నేను వెంకయ్యను' 'నేను పుల్లమ్మను', 'నేను వెంకమ్మను' అని ఇతఁ డనును. ఇతఁడు సుఖముకొఱకు దేవు లాడును. ఆ సుఖము కొఱకు ఎన్నియో దుఃఖములు అనుభవించును.

### ప్రపంచము లేక జడము

బుద్ధి మొదలుకొని శరీరము వఱకు అయిన ప్రకృతి పరిణామ మెల్లయు జడము. ఇది అసత్తు, అచేతనము. సచ్చిత్ స్వరూపుని కంటె వేఱయిన దెల్లయు జడము.

ఇది నేనుకంటె వేఱు. కావున దీనికి 'నీవు' అని వేదాంతములలో వాడుక. ఇది నేను అను ఎఱుకకు తావైన జీవాత్మచే చూడఁ బడును గావున విషయ మనిపించుకొనును. కాఁగా జీవాత్మ లేక 'నేను' విషయి యాయెను.

ఈజడమే ఈజగత్తే అందఱచేతను బోల్తాలు కొట్టించుచున్నది. వింతలో వింత యేమనఁగా లేకుండఁగనే ఉన్నా ననిపించు కొనుచున్నది.

* * *

నిక్కమునకు జడము లేక ప్రపంచము, విడిగా లేదు. చైతన్యసంయోగము లేక జడము దొరుకదు. ఆకాశసంయోగము లేక గాలి విడిగా దొరుకునా? కావున నే పుట్టునటువంటి స్థావర జంగమాత్మక మగునది యెల్లయు ప్రకృతిపురుషసంయోగమువలన పుట్టునని గీత చెప్పెను.*

ఆత్మ అత్యంతనిర్మలము అతిశుద్ధము. బుద్ధియు అత్యంతనిర్మలము అతిశుద్ధము. అద్దమునందు సూర్యుఁడు ప్రతిబింబించినటులు బుద్ధియందు ఆత్మచైతన్యాభాస కలుగును. బుద్ధ్యాభాస మనస్సునందును, మనఆభాస ఇంద్రియములందును, ఇంద్రియాభాస దేహము నందును కలుగును.†

ఇట్టి బుద్ధి సంయోగము ఇటు ఇంద్రియ ములకును అటు ఆత్మకును గలదు.

### అధ్యాస

చీకటిలో త్రాడు చూచి పామనుకొను చున్నాము. త్రాటియందు పాము అధ్యస్తము అనఁగా ఆరోపిత మగుచున్నది.

---

* యావత్ సంజాయతే కించిత్ సత్త్వం స్థావర జంగమమ్. క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్.—౧౩-౨౬.

† బుద్ధేశ్చ ఆత్మవమ నైర్మల్యా ద్యుపపత్తేః, ఆత్మచైతన్యాకారాభాసతోపపత్తేః, బుద్ధ్యాభాసం మనః, తదాభాసా నీంద్రియాణి, ఇంద్రియాభాస శ్చ దేహః. [అతో లౌకికై ర్దేహమాత్రే ఏవ ఆత్మదృష్టిః క్రియతే.]—గీతాభాష్య. ౧౫-౨౦.

ఒకవస్తువునందు మఱియొక వస్తువు నారోపించుట అధ్యాస.

ఆకాశమున చంద్రుఁ డొకఁడే వెలుఁగుచున్నను దృష్టిదోషము గలవానికి చంద్రు లిరువురు కానిపింతురు.

దవుదవుల ఎండమావులు కానిపించును. ఇట్టి మిథ్యారోపమే అధ్యాస.

అధ్యాస భాష్యము

'నాయిల్లు నాశరీరము నాచేయి నామనస్సు' అని మనము వ్యవహరించుచున్నాము. ఈవ్యవహారమునందలి ఇల్లు శరీరము చేయి మనస్సు అను వీనికంటె వేఱుగా నేను అని ఒకపదార్థము కలదు. ఈ నేనే దర్శనములు వక్కాణించు చిదాత్మ. ఆచిదాత్మకంటె వేఱయిన ఇల్లు శరీరము చేయి మనస్సు ఇవి జడములు, అనాత్మపదార్థములు లేక నీవు. పై నేను విషయి. ఈనీవు విషయము.*

ఈ నేను నీవులు లేక చిజ్జడములు చీకటి వెలుఁగులవలె వేఱువేఱు దినుసులు. నేను నీవు కాదు, నీవు నేను కాదు. నేను= చిదాత్మ. నీవు=జడము. చిదాత్మయం దుండు ధర్మములు జడమునందును జడమునం దుండు ధర్మములు చిదాత్మయందును ఉండవు. ఇటులయినను చేతనధర్మములు జడమునందును జడధర్మములు చేతనమునందును ఆరోపించుచున్నాము.

దేహముకంటె, ఇంద్రియములకంటె, మనస్సుకంటె నేను వేఱుగా నున్నను ఆదేహధర్మములను ఆ యింద్రియధర్మములను ఆ యంతఃకరణధర్మములను ఈ నేను నందు ఆరోపించుచున్నాము. నేను ఎఱ్ఱగా నున్నాను అని దేహధర్మమును ఆరోపించుకొనుచున్నాము. నేను మూగను అని ఇంద్రియ ధర్మమును ఆరోపించుకొనుచున్నాము. కామము మొదలగు అంతఃకరణధర్మములను ఆరోపించుకొనుచున్నాము †

ఈయారోపము పేరే అధ్యాస.

అతిశుద్ధము అతిసూక్ష్మము అగు ఈనేనునకు (జీవునకు) బాహ్యజగత్తుతో సంబంధము కలుగునపుడు ఈయారోపము కలుగుచుండును.

ఈనేను అనుచిదాత్మ లేక వ్యక్తిగతముగు ఆత్మ విషయధర్మములచే అనఁగా జడధర్మములచే ఆవరింపఁబడి నేను అను ఎఱుకకు పాల్పడెను. ఇది సాక్షిగాదు కర్త. ఇది అప

---

* యుష్మదస్మత్ ప్రత్యయగోచరయోః విషయ విషయిణోః, తమః ప్రకాశవద్ విరుద్ధస్వభావయోః ఇతరేతర భావానుపపత్తౌ సిద్ధాయాం, తద్ధర్మాణా మపి సుతరా మితరేతర భావానుపపత్తి రిత్యతః, అస్మత్ ప్రత్యయ గోచరే విషయిణి చిదాత్మకే యుష్మత్ ప్రత్యయ గోచరస్య తద్ధర్మాణాం చ అధ్యాసః. [బ్రహ్మసూత్ర భాష్య.]

† తథా దేహధర్మాన్ — స్థూలోఽహం, కృశోఽహమ్ గౌరోఽహమ్, తిష్ఠామి,గచ్ఛామి, లంఘయామిచేతి, తథా ఇంద్రియధర్మాన్ — మూకః, కాణః, క్లీబః, బధిరః, అంధోఽహమితి, తథాఽన్తఃకరణధర్మాన్ — కామ సంకల్పవిచికిత్సాఽధ్యవసాయాదీన్. —[అధ్యాసభాష్య.]

రోకము కాదు కావుననే దీనికి అర్థభానము మెండు.

దేహాదులను నేనే యని అనుకొనుట భ్రాంతి. అటులయినను వ్యవహారమునం దది సంభవించుచున్నది. ఇది నైసర్గికము. అనాది. ఇదియ అధ్యాస.

త్రాటియందు మనకు అజ్ఞానమువలన అనఁగా 'ఇది త్రాడు' అని స్పష్టప్రతిపత్తి లేమివలన సర్పభ్రాంతి కలుగుచున్నది. లోఁగడ మనము పాము నెఱిఁగియుంటిమి. త్రాటిని గూడ నెఱిఁగియుంటిమి. రూపుచే త్రాడు పామును పోలియుండును. చీకటిలో ఆ త్రాటి యొక్క మిగిలిన ధర్మములు కానిపింపవు. సర్పసామ్య మొకటియే కానిపించును. పూర్వ సంస్కారవశమున భయము కలుగును. దాన మోహ ముదయించును. దాన పాము అను భ్రాంతి కలుగును.

అన్ని భ్రమలకును మున్మొదట ఇట్టి* కారణములు ఉండును.

బ్రహ్మమునందు జగద్భ్రాంతి కలుగుటకు ఇట్టి కారణసామగ్రి కలదా? అసలు జగత్తునకును బ్రహ్మమునకును సామ్యము కలదా? బ్రహ్మము సత్తు, జగత్తు అసత్తు. బ్రహ్మము చిత్తు, జగత్తు అచిత్తు. బ్రహ్మము ఆనందము జగత్తు దుఃఖము. ఇఁక నీ రెంటికి పోలికయేడ?

దీని ప్రణాలి యిది కాదు జీవుఁడు జడ రథమును అధిరోహించినాఁడు. ఆరథముకూడ తా ననుకొనుచున్నాఁడు. జీవుఁడు దేహ మను చొక్కా తొడుగుకొన్నాఁడు. ఆ చొక్కా కూడ తా ననుకొనుచున్నాఁడు. భ్రమచే బ్రహ్మస్వరూపము మనకు ప్రచ్ఛన్నమయి యున్నది. కాన మనము జగదాకారముగా బ్రహ్మమునే చూచుచున్నాము. భ్రమ పోయినచో బ్రహ్మ స్వరూపము ప్రకాశించును. అపుడుమనకు బ్రహ్మజ్ఞానము కలుగును. పిమ్మట బ్రహ్మమునందు జగద్భ్రాంతి కలుగఁజాలదు.

శంకరులవారి యభిప్రాయ మేమనఁగా జగత్తనికాని, జగదాకారమనిగాని యేమియు లేదు. ఉన్న దొక బ్రహ్మమే. బ్రహ్మము తక్క జీవాత్మయని వేఱొకటి లేదు. జీవాత్మ పరమార్థమున లేదు. బ్రహ్మమునందు జీవాత్మ అధ్యస్త మగుచున్నది.

అధ్యాసవలననే మనకు దుఃఖములు. అధ్యాసకే అవిద్యయని మాఱుపేరు. అవిద్య మనకు సెలవిచ్చుచో ముక్తిద్వారము ఎదుట. అవిద్యను తొలఁగించుటకే వేదాంతశాస్త్రము దండధారి. ఇదియే శంకరదర్శనము.

### జగత్తు, అధ్యాస (అవిద్య)

ఉండునది సత్తు. ఉండనిది అసత్తు. సత్తునకు మార్పు ఉండమి ఒకవిశేషము.

---

* నిక్కమైన వస్తువు నెఱుకచేఁ గలుగు సంస్కారము, ప్రమాతృదోషము, ప్రమాణదోషము, ప్రమేయ దోషము, అధిష్ఠానముయొక్క విశేష అజ్ఞానము, సామాన్యజ్ఞానము : ఇది అధ్యాస సామగ్రి.

బ్రహ్మ మొకటియే ఉండునది. మార్పులేనిది, కావున అదియొకటియే సత్తు. కాఁగా ఈజగత్తు ఈయధ్యాస ఎటనుండి ఊడిపడెను?

జగత్తు మార్పుచెందుచుండును; కాన జగత్తు సత్తుకాదు. జగత్తుఉన్నటులుతోఁచును. కాని అసలు జగత్తు లేదు, ఈ లెక్కన జగత్తు అసత్తు.

జగత్తు ఉన్నటులు తోఁపఁజేయునది అధ్యాస లేక అవిద్య. కావున అవిద్య, అసత్తు కాదు. కాని అవిద్యయు మార్పు చెందు చుండును. విద్య ఆవిర్భవింపఁగనే అవిద్య తొలఁగును. కావున అవిద్య సత్తుకాదు: కాఁగా అవిద్య సత్తు కాదు, అసత్తు కాదు, సదసత్తు కానిది అనిర్వచనీయము. అనఁగా కలదనికాని లేదనికాని చెప్పరానిది. అని ర్వాచ్యమగు నీ యధ్యాసనే ఈ యవిద్యనే మాయ యనియు నందురు.

ఇది బ్రహ్మము యొక్కయే అంశవిశేషము. విద్యయు అవిద్యయు బ్రహ్మాంశములు. విద్యకు అవిద్యకును చీఁకటివెలుఁగులంత తేడా. చీఁకటి పోవుడు వెలుఁగు, వెలుఁగు పోవుడు చీకటియు వచ్చునటులు అవిద్య పోవుడు విద్యయు, విద్యపోవుడు 'అవిద్యయు దాఁగుడుమూఁత లాడును. విద్య ఆవిర్భవించుచో తత్త్వమును, అవిద్య ఆవరించుచో మిథ్యయగు జగత్తును కానిపించును. తత్త్వము విడివడఁగానే బ్రహ్మముకంటె వేఱేదియు ఎటుకకు గాదు. అపు డెట్టి భేదజ్ఞానమును లేదు. మిథ్యయగు జగత్తు కానిపించునపుడు ఆత్మ విషయిగా పరిణమించి విషయరూపమగు జగత్తును ఎదుట అనుభవము చేసికొనును.

'సచ్చత్యచ్చాభవత్' 'విజ్ఞానం చ అవిజ్ఞానంచ' అని ఉపనిషత్తు చేతనమును జడమును తెలిపినను కేవల చేతనపదార్థ మనియు, కేవల జడపదార్థ మనియు విడివిడిగా లేవు. ఆత్మకే జడబుద్ధియు చేతనబుద్ధియు; ఈ రెండు బుద్ధులును పారమార్థికములు కావు. ఆత్మయొక్క పారమార్థికజ్ఞానము అధ్యాసచే రెండుగా తునిసి రెండుతెఱఁగులుగా ప్రకాశమొందును. అవిద్య పోవుచో దానితోపాటు ఇదియు పోవును.

ఆత్మను అనాత్మను కలుపు నొకతీరు,ఒక ధర్మము ఎటుకకు కలదు. కాని ఆత్మకును, జడమునకును, చీఁకటి వెలుఁగుల కున్నంత తేడా. ఇంత తేడాగల ఆత్మానాత్మలకు కలయిక ఉండదనియే మొదట తోఁచును. శంకరులు 'ఆత్మానాత్మలకలయిక పారమార్థికముగాలేదు కాని వ్యావహారికముగా నిక్కము' అని అనిరి. ఆత్మకును జడమునకును వ్యావహారిక సంబంధము అనాదిసిద్ధము. అనాదిసిద్ధ మయినదానికి కడకు వ్యావహారికసత్తను ఇయ్యకొనవలయు.

ఒకదానికి పారమార్థికసత్త, మఱొక దానికి వ్యావహారికసత్త ఇయ్యకొన్నచో ఎట్టి సిద్ధాంతము తేలును?

పారమార్థికసత్త అనగాఁ నిక్కమగు ఉనికి. వ్యావహారికసత్తకు ఉనికియే లేదు. నిక్కముగా

ఏది ఉండునో దానినే సిద్ధింపఁజేయుటకు వ్యావహారికసత్త కలదు అని తెలియవలయు. ఈ వ్యావహారికసత్తకు దీనికంటె వేఱు సార్థక్యము లేదు.

ఆత్మను అవిద్య ఆశ్రయించుట జేసి * అనాత్మ పొడమె ననగాదు. అటులన్నచో ఆత్మ పరిణామి అగును. శ్రుతి ఆత్మను పరిణామి అనదు. కావున ఆత్మ అపరిణామి. అగుచో అది ఎటులు అజ్ఞానవర్తి? అపూర్ణమును అజ్ఞానమాశ్రయించును. ఆత్మ పూర్ణము. ఆత్మ దేనికిని అంశము కాదు. అది తనకొఱకు మఱొకదానిమీఁదఁ బడదు. కావున ఆత్మను అజ్ఞానము ఆశ్రయింపనేరదు.

వివరణాచార్యుఁడు లోనగువారు బ్రహ్మమును అజ్ఞానమునకు ఆశ్రయము చేసిరి. ఈ మతముచొప్పున అజ్ఞానముగాని, అవిద్య గాని జగత్ కారణమగుచో జీవుని అజ్ఞానమునకు ఆశ్రయము చేసిన భామతీకారుని మతముకూడ సంగతముగా దోఁచును. కాని జీవుఁడు అజ్ఞానమునకు ఆశ్రయమాయెనా అతనికి పారమార్థికసత్తనుగూడ కట్టిపెట్టవలయును.

శంకరులు జీవునికి పారమార్థిక సత్తను ఇయ్యకొనలేదు. మఱియు జీవుని గాని బ్రహ్మమునుగాని అజ్ఞానమునకు ఆశ్రయము చేయలేదు. వీరి మతమున బ్రహ్మము విషయము గాదు, విషయియుఁ గాదు. 'నేను' అను ఎఱుకకు గోచరమగు ఆత్మకలదు. అది విషయము. నేను అను ఎఱుకకు విషయముకదా! ఈ నేను అను ఎఱుక ఎటనుండి వచ్చెను? అవిద్యనుండి.

అనఁగా 'నేను' అను ఎఱుకకు గోచరమగు ఆత్మ బ్రహ్మమునకు విషయము కాదు. అవిద్య బ్రహ్మమును ఆశ్రయము చేసికొననేరదు. అవిద్యవలన పుట్టినది బ్రహ్మమునకు విషయ మెటులు కాఁగలదు? ఇఁక 'నేను' అను ఎఱుక బ్రహ్మమును గాదు; బ్రహ్మమునుండి పొడమినదియుఁ గాదు. అవిద్య లేక మాయ బ్రహ్మాంశ మనుట నిక్కము కాని దానిచే బ్రహ్మమునకు లేపము లేదు.

ప్రకృతినుండి అహంకారము పొడమెనని సాంఖ్యులు. అవిద్యనుండి అహంకార మని వేదాంతులు. ప్రకృతి ఒక్కటియే అహంకారమును కనలేదు. పురుషుఁడు వలయు. ఇటులే బ్రహ్మసాన్నిధ్యమున అవిద్య అహంకారమును సృజించును. బ్రహ్మమునకు దానితో ఎట్టి లేపమును లేదు. దాన బ్రహ్మస్వరూపమునకు ఎట్టిమార్పును లేదు.

తేలిన దేమన, — జీవుఁడు బ్రహ్మము కాఁడు. జీవునికి పారమార్థికముగా అస్తిత్వము లేదు. జీవుఁడు అవిద్యాసంభూతుఁడు కావున జీవత్వము మిథ్య, ఉళక్కి.† అవిద్య

---

* పారమార్థికసత్త నెఱుఁగమిని గాని, భ్రమచేఁ గాని వ్యావహారికసత్తాసృష్టి కలుగు ననుట.

† వివరణాచార్య ప్రభృతుల మతమున జీవబ్రహ్మ ప్రభేదము లేదు. బ్రహ్మమే అవిద్యాగ్రస్తమయి జీవాకారిత మగు. అవిద్య పాయుఁడు జీవత్వమును పాయును. భామతీకారుల మతమున జీవుఁడే అవిద్యకు ఆశ్రయము.

వలనఁగాని, అజ్ఞానమువలనఁగాని పుట్టునది మిథ్య. దానికి జ్ఞానము పునాది కాలేదు. బ్రహ్మము నిర్వికారము అనాసక్తము. కావున బ్రహ్మముతో జీవభావమునకు ఎట్టి సంపర్కము లేదు. జీవుఁడు బ్రహ్మమును ఎఱుఁగనూ లేఁడు, జీవునకు బ్రహ్మమునందు చారితార్థ్యము ఉండనూజాలదు అని తోఁచును.

ఇదొకరీతి శూన్యవాదము. జీవనముగాని జగత్తుగాని దుఃఖమునకే మూలమగుచో ఈ మతమునకు సార్థకత కలుగును. ఈమతమున నిర్వాణముగాని, ముక్తిగాని సాధితమాయెనేని అంతయు శూన్యమయిపోవును.

బౌద్ధదర్శనము

నేటి నైయాయికుల మతమున జ్ఞానము త్రిక్షణస్థాయి. ఒకక్షణమున పుట్టును, ఒక క్షణము ఉండును, మూడవ క్షణమున మూలఁబడును. బౌద్ధులదర్శనమున జ్ఞానము క్షణికము. దీనికి స్థితిలేదు. వెంటనే గిట్టును.

వీరు రెండుసత్యములు అంగీకరింతురు ౧. సంవృత సత్యము, ౨. పరమార్థ సత్యము. సంవృతసత్యమును తఱవఁగా తఱవఁగా దీనికి పునాది లేదనియు ఉళక్కియనియు తెలియును. ఇంకను లోఁతునకు దిగుచో ఆ ఉళక్కియు ఉళక్కియని తెలియును. ఇది మాధ్యమికుల మతము. దీనిపేరు అప్రతిష్ఠిత సర్వధర్మవాదము. ఇఁక పరమార్థసత్యమేమనఁగా ధర్మధాతువు. అది అనిర్వచనీయము. దీనికే మఱొకపేరు శూన్యము. శూన్యము అభావవాదము కాదు, భావవాదమును గాదు. ఇది అనిర్వచనీయమగు ఒకానొకటి. ఇది అచ్ఛేద్యము, అభేద్యము, అచ్ఛిద్రము, దృఢము, సారము*, అదాహి, అవినాశి. ఇట్టి శూన్యత్వము పేరే వజ్రము. ఇది భావముకాదు, అభావము కాదు, భావాభావము కాదు, అభావాభవము కాదు. కావున ఇది మనధారణ కావల. అటులని దీనిని ఇయ్యకొనకుండ వీలు లేదు.

దీనికిని శంకరదర్శనమునకును గల పోలికినిబట్టి పలువురు శంకరదర్శనమును ప్రచ్ఛన్న బౌద్ధమని అన్నారు. కాని అది నిక్కము కాదు. శంకరులు బ్రహ్మమును చాటుచేసికొని శూన్యమతమును స్థాపింపలేదు. ప్రత్యుత వారి పరమ గురువులగు శ్రీ ఉ. గౌడపాదాచార్యుల వారివలె వలసినదానిని కైకొని శూన్యసిద్ధాంతమును ధ్వంసము చేసిరి.

నవీనులు

నేను, లేక ఆత్మ, నిక్కమునకు లేనిచో నిఁకయు బ్రహ్మము ఉన్ననేమి ఊడిననేమి? నేను

---

అవిద్య మాయఁగనే జీవునికడ బ్రహ్మము స్వస్వరూపమున ప్రతీత మగును. భామతీకారులు శాంకరభాష్యమునకు టీక వ్రాసిరి. వారును అద్వైతవాదులే. కాని జీవభావము బ్రహ్మము యొక్కయే అంశవిశేషమని వారి అభిప్రాయము. ఇటులాయెనేని జీవుఁడు బ్రహ్మమునకు అనాదికాలమునుండియు అంశవిశేషముగా ఉన్నాఁడన్న మాట. ఏది అనాదికాలము నుండియు ఉండునో అది అనంతకాల వ్యాపి.

*అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవచ. గీత–౨.

ఉన్నయెడలనే జగత్తుతో గాని బ్రహ్మముతో గాని ప్రయోజనము గదా!

కావున అద్వైతమునకు భంగము రాని చందమున ఈ నేనును నిలుపవలెనని నవీనులు అందురు.

'నాకు రెండు ప్రకృతులు కలవు; ఒకటి పర, రెండవది అపర. పర-జీవప్రకృతి. అపర-మన్ను మిన్ను నిప్పు నీరు గాలి మనస్సు బుద్ధి అహంకారము.* ఈ రెంటిసంయోగమే† జగత్తు. ఈ రెండు ప్రకృతులును నావే' యని గీత యనును. మఱియు నన్ను సర్వభూతములకును బీజమునుగా నెఱుఁగుమని భగవానుఁడనును.

ఈసంయోగము అధ్యాసకంటె అనఁగా భ్రమకంటె లేక అసత్యముకంటె దృఢమయి యుండవలయును.

జీవుఁడు నాయంశమే అనుటయు, అతఁడు శరీరము గొనునుటయుఁ గలిగి ఇదంతయు పట్టి అధ్యాస యగుచో ఆమతము అధ్యాసయని నవీను లనుచున్నారు. వీరి యభీష్టము తెలుపుటకు మఱొక వ్యాసము వలయును.

---

# నిశాకాంత

## (SHELLEY'S "TO THE NIGHT")

సెట్టి లక్ష్మీనరసింహము గారు (కవితాసమితి)

౧

రాఁగదమ్మా, నిశాకాంత, వేగిరమ్మ! - పడమటి కడలి యలలపై వడిగ వడిగ
నడుగు లిడుచును నడిచిరావమ్మ, వేగ!
దట్టముగ మంచుతో నిండినట్టి తూర్పు-కొండ గుహలందు నుదయంబునుండిప్రొద్దు
గ్రుంకునంతకు నొంటిగాఁ గూరుచుండి, - ప్రీతియును భీతియును మొలపించుస్వప్న
జాలములఁ జాలనల్లుచు, సౌమ్యవును భ-యంకరవు నౌచు నుందు వీ వందువలన:
వడిగ రావమ్మ, యాగుహల్ వెడలి, దేవి!

---

* గీత.—౭-౪, ౫, ౬.

† త్రాటియందును ఆలిచిప్పయందును అధ్యస్తము చేయఁబడిన సర్పము రజతము వీని సంయోగమువలె ఈ రెంటి సంయోగముగూడ ఇతరేతర తద్ధర్మాధ్యాస లక్షణ మని శంకరులు—గీతాభాష్య-౧౩-౨౬.

## ౨

మినుకుమినుకుమటంచును మెఱయుచుక్క-లందముగఁ జెక్కి-యున్న నీలాంబరమును
గాయమంతెల్లఁ జక్కఁగాఁ గప్పుకొమ్మ!
కొమ్మ, దినసరోజాక్షియమ్ములను నీదు - కప్పుఁగొప్పుతోఁ బూత్తిగాఁగప్పి, యాపె
మూర్ఛిలఁగ ముద్దుగొమ్మ, యోముద్దుగుమ్మ! - పిదపఁ బురములందును జనపదములందు
మత్తుమందుఁజల్లుచుఁ జరింపఁగదవమ్మ! - వేచియుంటి నీకయి కనుల్ వాఁచునట్లు:
జాగుమాని, నిశాకాంత రాఁగదమ్మ!

## ౩

లేచి యరుణోదయమును నేఁజూచినపుడె, యుస్సురనుచు నీకొఱకు నిట్టూర్చినాఁడఁ!
ప్రొద్దుపై కెక్కి-, మంచెల్లఁబోయి, యెండ
మింటినడుమనుండి విరులమీఁదఁ, దరులమీఁద, రవి తనకరముల వోఁడుట్లు
తీవ్రముగఁ బడినప్పుడుఁ, దివసకాంత-యలసి, విశ్రాంతినొందఁగాఁదలఁచి, యింటి
మొగము పెట్టి కిట్టని చుట్టముగతి మసలు-చున్న యిప్పుడుఁ, నామది నిన్నె తలఁచి
యోనిశాకాంత, నేను నిట్టూర్చినాఁడ!

## ౪

పొలఁతి, వింటివా? నీదుతోఁబుట్టువైన - మృత్యుదేవత నాదుసమీపమునకు
నరుగుదెంచి, "నేవలయునా?" యనుచునడిగె;
నీకుమారి, నిద్రాదేవి, సౌకుమార్య-మొలుక, మూఁతలుపడెడు కన్నుల ననుఁగని,
"ప్రక్క-కుఁ వచ్చె,యక్కు-న్దకక్కు-ఁజేర్చు-మందువా? నేనువలయునా?"యనుచు, నెండఁ
బడిన తేంట్ల రవమువంటి నుడులనడిగె: - "నీవుఁవలదు"; "రావలదమ్మనీ", వటంచు
వారలకు మాఱుపలికినవాఁడ నేను.

## ౫

మృత్యువెట్లును దప్పక యేగుదెంచు - వేగమే: కటా! యెంత వేగముగనె:
ఆవెనుకనుండఁగాఁబోవు నీవు నాకు;
నిదురయును రాకమానదుగద? యది నను - వదలిపోవునప్పటికిఁ బోవుదువు నీవు;
మృత్యునిద్రల నేనుప్రార్థింపక యిదె - వరము నడుగుచుంటిని ప్రేమవలన నిన్ను;
ఓనిశాకాంత, యొయ్యారమైన పెండ్లి-నడకలనుమాని శీఘ్రయానంబుతోనె
వేగ రాఁగదమ్మా, రమ్మ, వేగిరమ్మ!

---

# కన్నడిగలు—తెలుగలు

విద్వాన్, కూరిగనూరు నరసింగరావు గారు, బి. ఏ., యల్. టి.

"సత్యమేవ జయతే నాఽనృతమ్"

**క**న్నడిగలును తెలుగలును చాలకాలమువఱకు కలసి మెలసి యుండిరి. సహవాసమువలనను, సమీపవాసము వలనను బుట్టినసంబంధము ఆయాజాతుల సాంఘిక, రాజకీయమత ప్రపంచములం దక్కడక్కడ కన్పట్టుచున్నది. అట్టిసంబంధ మెంతమట్టుకుండెనని దెలిసికొన



వలయున్న ఆయా జాతుల ఇతిహాస గ్రంథములను, వాఙ్మయచరిత్రములను పరీక్షింపవలయును అత్యమితజాతి భాషాభిమానమున సత్యాంశమును గప్పిపుచ్చక, విషయముల నున్నవియున్నట్లు ఐతిహాసికాధారములతోను, గ్రంథాంతరికవాఙ్మూలములతోను సమర్థించి వెలివేసి సత్యప్రియులగు వాచకమహాశయులే స్వసిద్ధాంతముల జేసికొన విడువవలయును. స్వాభిప్రాయములున్న దెలుపవచ్చును గాని అకారణముగా నితరుల నిందించు టనుచితము. ఆత్మస్తుతిని క్షమింపనగుగాని పరనిందను భరింపతరము గాదు. ఇటీవల కొందఱాంధ్రులు ఐతిహాసికప్రఖ్యాతి జెందిన పరదేశభాగములను తమదేశములోనివి యనియు, పరాక్రమవంతులైన రాజులు తమ జాతికి చేరిన రాజు లనియు, విద్యానిధులైన పరదేశకవులను తమకవులనియు సాధింపబూనిని న్తో తుకముగా కన్నడిగల నొకప్రక్కను, తమిళుల నొకప్రక్కను చులకనగా జూచి వారిని గుఱించి వ్రాయునపుడు నీచశైలిని ప్రయోగించినారు. కర్ణాటభాషయం దల్పపరిచయ మున్నంతనే వారట్లు కర్ణాటదేశజాతిజీవన వాఙ్మయచరిత్రముల రహస్యస్వారస్యము లెఱుగక అబద్ధవాక్యములను కొన్ని పేర్చి వక్రసిద్ధాంతము నొక్కదానిం గూర్చుట అన్యాయము. ఆంధ్రవాఙ్మయచరిత్రోపోద్ఘాతమును దీని కుదాహరణముగా జూపవచ్చును. ఇట్టి చేఁతలవలన సత్యభంగము చేకూఱుటయే గాక పరస్పరజాతి విద్వేషమును అనైకమత్యమును వృద్ధియగును. గనుక సత్యాన్వేషకు లగు నా మిత్రులు బ్ర. శ్రీ. సోమశేఖరశర్మగారు సంశయగ్రస్తములైన కొన్ని విషయములను గుఱించి వ్యాసము నొక్కటి వ్రాయుమని ప్రోత్సహించిరి పరస్పరజాతివిద్వేషమును పోఁగొట్టుట కట్టి లేఖనము సాహాయ్యకమగునను తలంపున పైఁ పేర్కొనిన విషయమును గుఱించి వ్రాయ సాహసించితిని.

నే నీవ్యాసమునందు కర్ణాటకదేశవ్యాప్తిని గుఱించియు, కర్ణాటజాతిజీవనమును గుఱించియు, కర్ణాటభాషా స్వరూపమును గుఱించియు, కర్ణాటసంగీత ప్రాచీనతను గుఱించియు, కర్ణాటసాహిత్యపోషణమును గుఱించియు కొంత పరిశోధించి అతిసంగ్రహముగా ముఖ్యాంశములను మాత్రమే వ్రాయుచున్నాను.

కర్నాడు—నామము సలక్షణమైనది; సార్థకమైనది. ప్రకృతి, పురుషుడు నని రెండువస్తువులు గలవు. వానిలో ప్రకృతి పాంచభౌతిక బలక్షోభములకు చిరకాలము లొంగని లక్షణములు గలది. దాని లక్షణములు ధ్రువము లనియు దృష్టిగోచరము లనియు మనము నమ్మవచ్చును. ప్రకృతిప్రదేశముబోలె, పురుషదేహ మంతగా ధ్రువమైనది గాదు. జరాభారమునకును, వ్యాధివేదనకును, మరణక్షతికిని త్వరగా మాఱిపోవు లక్షణములు గలది. ఈ కారణముబట్టియే వివిధజాతులవారు వారి వారి శాశ్వతములైన దేశనామములతోనే పిలువబడిరి. మఱియు లక్షణములు బాహ్యములు, ఆంతర్యములు నని ద్వివిధములు. బాహ్యలక్షణములు చక్షుర్గోచరములు. అంతర్లక్షణము లతిగాఢములు. గనుక జనులు బాహ్యలక్షణముల నవలోకించియే దేశనామముల నిడసాగిరి. ప్రకృతి లక్షణములలోని ఔన్నత్యము, వర్ణము ననునవి విస్పష్టములైనవి. కాబట్టి, జనులు జనాంగమును, జనస్థానమును, కనుగొనుటకు కొండలను గుఱుతులుగా నుంచికొనిరి. నేలలను

గుఱుతులుగా నుంచికొనిరి; ఏఱులను గుఱుతులుగా నుంచికొనిరి. ఈవిధానమున కర్నాడను నామకరణ మేలక్షణములనుబట్టి కలిగెనో పరీక్షింతము.

కర్నాడు=కరు + నాడు=మిట్టనేలయని యర్థము. దొడ్డబెట్ట మొదలగు పర్వతములగలిగి మైసూరు పీఠభూమితో గూడుకొన్న ప్రదేశమునకు మిట్టనేల యని పేరు బెట్టుట తప్పుగాదు. లక్షణమును బట్టి దేశములకు పేర్లుపుట్టుచున్నవనుటకు ఐరోపాఖండమందలి నెదర్ల్యాండ్సను పదమును లక్షింపుడు. నెదర్ల్యాండ్సు నిమ్నభూములు, పల్లపునేలలు. ఈ యొక్క నిదర్శనమే చాలు. కర్నాడు=కర్ + నాడు=కందు + నాడు=నల్లనేల యని యర్థము. దక్షిణహిందూస్థానమందలి పీఠభూమి యగ్నిపర్వత దహన జ్వాలల ననుభవించినది. భూగర్భితములైన లోహములెల్ల ద్రవరూపమున ఏఱులైపాఱి నేలను నల్లనేలగా జేసినవి. భూమిశాస్త్రజ్ఞు లట్టిభూమిని "అగ్నిపర్వతభూమి" ('Volcanic Soil') అందురు. ఇట్టి యగ్నిపర్వతప్రకోపము పూర్వమున కర్నాడునందు కలిగియుండవచ్చుననుటకు మద్రాసు కర్నాడులోని బళ్లారిమండలమునందు లోహమయమై సారవంతమైన రేగడనేలయు, కడపమండలమున దొరకు నల్లఱాళ్లును, బొంబాయి కర్నాడునందుదొరకు పలకఱాళ్లును మైసూరు రామగిరులందు కనబడుబంగారపు గనులును సాక్ష్యములు. ప్రధానలక్షణమున్ను, సులభముగాతమకంటబడు నేలవన్నెను బట్టియే కర్నాడని పేరిడిరి. కర్నాడునందుండు కొండలను నీలగిరులని=నల్లకొండలని పిలిచిరి. అందలి యున్నతపర్వతము కర్నాడులోనిదగుట దానికి దొడ్డబెట్టయను కన్నడ పేరుబెట్టిరి. కర్నాడునందు పారునదిని కృష్ణానది నల్లయేఱని బలికిరి. తెలుగువారు కర్నాడు మేరనుండు అడవులను నల్లమల లనిరి. ఇదియుంగాక "కన్నడముకస్తూరి" యను నొక నానుడి గలదు. ఒకవస్తువు నింకొకవస్తువునకు బోల్చునపుడు ప్రధానలక్షణసామ్య ముండవలయుంగదా! ఇందు కస్తూరినలుపును నేలనలుపునకును, కస్తూరిగంధమును మైసూరు మొదలగు ప్రదేశములనుండు చందనవృక్షగంధమునకును బోల్చిచెప్పియున్నారు. ఇట్లు వర్ణమును వాసనను బట్టి కన్నడమును కస్తూరికిబోల్చిరి. కన్నడము కస్తూరియనుటకిదియే కారణము. తెల్ల + అగు=తెలుగు అనుటకును, "తెలుగుతేట" యనుటకును కారణము లివియు, నిట్టివియు నుండు. ద్రావిడులు సమభూములందును, సముద్రతీరభూములందును వసించెడివారు. గనుకనే ఎత్తయిన కర్నాడును కరునాడని పిలచినారు. స్వదేశజనులు భూవర్ణమును బట్టియే కర్నాడని వాడినారు. కర్నాడు అనుపదమునందలి రూపము కందు + పోక్ అను సమస్త పదమున నెట్లు కర్పోక్ (అనుము) అనిమాఱినదో అట్లనే కరిదు + నాడు=కర్నాడనియైనది. 'కన్నడ' అను పదము 'కర్నాడ'ను పదమునకు రూపాంతరము. కర్నాడ=కర్నాడు + అ, 'అ' యను నది సంబంధార్థకమైన షష్ఠీవిభక్తి ప్రత్యయము. అద్దానినే ఆర్యులు తమభాషలో కర్ణాటమని మార్చుకొన్నారు. కర్నాడుపదము వాడుకలో కన్నడమైనది. పలపలిగిలకకు పూర్వాక్షరము ద్విత్వమును బొందు వ్యాకరణవిశేష మిందు అన్వయించును: ఉ. కబుర్ = కబ్బు = (చెఱుకు) ఈ 'కన్నడ' శబ్దమును కర్నాడునందలి భాషకుపయోగించుచున్నారు. తదితరసందర్భములందు విశేషణపదముగా వాడుచున్నారు. కర్నాడునం దుండువాడు కర్నాడు + ఇగ=కర్నాడిగ=కన్నడిగయయ్యె. కన్నడిగలు, తెలుగలు, తమిళ మలెయాళులు దక్షిణ హిందూస్థానమున చిరకాలమునుండి యుండినవారు. ఆంధ్రులుత్తరహిందూస్థానమునుండి వచ్చినవారు. ఈ వాదమునకు, సంస్కృతపదములను జేర్పక జాతీయపదజాలముతోనే రచించిన ఏలపాట మొదలగు పామరజనుల పాటలును, సంస్కృతవృత్తలక్షణములకు భిన్నములుగా నుండు సీసపద్యము మొదలగుజాతివృత్తములును తార్కాణములు. వేయేల? వృత్తములను సంస్కృతవృత్తములనియు, జాతివృత్తములనియు విభాగించుటయే తెలుపదా? ఏజాతి? తెలుగుజాతి. ఇది యొక్కటియే చాలు తెలుగువారార్యులు గారనుటకు. ఆంధ్రు లార్యులై యుండవచ్చును. వారిట్లు తెలుగులలో గలసి వారిని వశముచేసికొని, తమజాత్యభిమానము విడజాలక తెలుగుపద్యములకు జాతివృత్తములని పేరిడిరి. ఆంధ్రులు తెలుగలు ఒక్కటేయైన ఆర్యవర్గమునకు జేరిన యాంధ్రులు, ద్రావిడవర్గమునకు

చేరిన జాతివారి ఛందస్సును ఎరువు పుచ్చుకొందురా? స్వదేశీయుల నరగంట చూచుచు తమ అర్ధాంగీకార న్యాయమున వారి ఛందోలక్షణములను గొన్ని యట్లనే యుంచి తమఆర్యసంస్కృతవృత్తముల ననేకములను వానితో జేర్చి సంస్కృతవృత్తములు జాతివృత్తములని విషమభేదమును లోగొన్న విభాగము నొక్కటి చేసిరి. కన్నడిగలు తాము ద్రావిడసంఘమునకు జేరినవారని చెప్పికొనుట గౌరవహీనమని భావింపరు. ఆర్యులైననే స్వర్గప్రాప్తి యని వారు నమ్మరు. కన్నడిగల తెలుగల స్వజాతిఛందస్సులు అనేకసమానలక్షణముల గలిగియుండుటచే విప్పట్టున నింత వ్రాసితిని. ఆప్రసంగము నట్లుంచి యిక కర్నాడెంతవఱకు వ్యాపించియుండెనని చూతము.

తొమ్మిదవ శతమానమునుండిన రాజకవి నృపతుంగదేవుడు తన "కవిరాజమార్గ"మను లక్షణగ్రంథమున కర్ణాటదేశపు ఎల్లలనుగుఱించి యిట్లు వాక్రుచ్చినాడు:

కావేరియిందమాగో
దావరి వరమిర్ద నాడదా కన్నడదోళ్
భావిసిద జనపదం వసు
ధావళయవిలీనవిశద విషయ విశేషం.

—ప్రథమపరిచ్ఛేదము, ౩౬ పద్యము.

ఇది గ్రంథాంతరికవాఙ్మూలము, నామాటగాదు. ఈమేరలనుబట్టిచూచిన వెంగినాడును, దానియందుండిన కమ్మెనాడును ఈప్రదేశములోనివై యున్నవి. పైజెప్పినట్లు అగ్నిపర్వత శిఖలచే దగ్ధమగుటంబట్టియే వేంగినాడు=వేగినాడు=దగ్ధరాష్ట్రమని పిలువంబడె. కమ్మెనాడు పరిమళవృక్షపుష్పములకు బుట్టినిల్లగుటచేత నట్టిపేరునబరగె. వెంగీవిషయమే

"అళిగీతకుసుమపరిమళ
ఫళరసమందానిళాద్రికాననలీళా
విళసనదంభోజకుహా
తళమెనిపుధు విషయజనక వెంగీవిషయం."

(రన్నని అజితపురాణము —ప. ఆ. ౨౩ ప.)

అని రన్నమహాకవి వ్రాసినపుడు దానిలోనున్న కమ్మశబ్దమును సార్థకము చేసికొనజాలు కమ్మెనాడెంతయు పరిమళపుష్పభరితముగనే యుండెను. ఇప్పుడు వెంగిమండలమును నివాసప్రదేశముగా జెప్పికొన్న ఆదిపంపడు పొన్నడు మొదలగువారు ఆంధ్రులుగాని తెలుగలుగాని ఎట్లగుదురు? గోదావరీ కావేరీమధ్య భూమికి కర్ణాటమని ప్రమాణవచనమున్నపుడు తద్దేశాంతర్గత వెంగిమండలమును గాని, విజయనగరమును లోగొన్న దత్తమండలములను గాని తెలుగనాడని యెట్లు చెప్పనగును? మఱియు పైజెప్పిన కారణములంబట్టి బళ్లారిమండలము నల్లనేలగలది. విజయనగర మందులోనిది. ఏకారణమునను తెలుగనాడులోనిది కాజాలదు. కర్నాడులోని ఊళ్లపేరుల పరీక్షించిన కొంచెమించుమించుగా నన్నియు కన్నడమాటలే. ధారవాడను తెలుగపద మనజాలరుగదా! బాడనన గ్రామము; ధారబాడ=ధారవాడ. బెజవాడయు నట్టిదే. మధ్యనుండు నెల్లూరు ఓరుగల్లు మొదలుగునవియు కన్నడపదములే. ఊర్ అన్న నుండుచోటు. కల్ అన్న పర్వతప్రదేశము. నెల్లు=వడ్లు ఊర=గ్రామము వడ్లను అర్థమున నెల్లను పదము తెలుగున లేదుకదా! పూర్వీకులు గ్రామముల పేళ్లను ధాన్యపు పేళ్లతోను, రాళ్ల పేళ్లతోను, నీళ్ల పేరుతోను బిలుచుచుండెడివారు. ఉదాహరణము-జోళదరాసి-జొన్నరాసి, సంగనకల్లు=సంగనగట్టు కల్ బావి=రాతిబావి ఇట్లు నైసర్గికవస్తుసంబంధముతో బిలుచుటకు కారణము నేనప్పుడే పైన జెప్పియున్నాను. ఇక పంపడు తెలుగిడేమో కాలనామములను పరిశీలించి కనుగొందము. పంపకవితండ్రి జైనమతము నవలంబించెను. అతని పూర్వీకులు వైదికమతావలంబకులు. పంపనితండ్రి అభిరామదేవరాయడు. అతడు పితృపరంపరగా వచ్చిన మతమును వదలి నూతనమతమును స్వీకరింపగలయట్టి వివేక విమర్శలుగల వయస్థితియం దుండవలయును. అట్టి వయస్సు నలువదేండ్లందము. చిన్నతనముననే బుట్టియున్న యతనికొడుకునకు ఇరువదియేండ్లయిన నుండును. అప్పుడు అభిరామదేవుడు తెలుగనాడునుండి కర్ణాటమున కఱిగి తనకొడుకును కర్ణాటభాష నభ్యసింప నొజ్జలయొద్దకు బంపునా? అతడు అల్పకాలములోనే అద్వితీయపాండిత్యము కన్నడమునబడసి దేశకబ్బము వ్రాయునగునా? సాధ్యములను పర్యాలోచింపుడు. మఱి

యొకమాట. పంపనికి సాహిత్యముచేయ పాఠము జెప్పించిన గురువు లెవరు? కర్ణాటకులే యుండవలయుఁగదా? పంపయను నామము నింత విచారింపుడు. ఈ నామము పంపాక్షేత్రప్రాంతమునుండి వచ్చినది. తెలుగనాడులో పంపపదము నామకరణమునకు వాడినది విరళము. పంపడు జైనవిద్వేషముగల తెలుగనాడునుండి జైనుల కాశ్రయమగు కర్నాడునకు వచ్చెననుకొందము. అతని కొడుకునకు వైదికమతమునం దవిశ్వాస ముండిన నుండ వచ్చుగాక. తెలుగుబాసతో పగయేల? ఉభయభాష లందు పాండిత్య మున్నదని చాటుటకై పంపకవి తన ఆదిపురాణమును కర్ణాటభాషలో వ్రాయుటయే గాక దానిలో సంస్కృతమున పద్యములు వ్రాసి జొన్పినాడు. తెలుగు దెలిసియున్న తెలుగునను జేయరాదా? తెలుగుననే గ్రంథము నేదైన నేల వ్రాయలేదు? నిరర్థకమనియు, తనరాజున కప్రియమనియు వదలెనన్నను కన్నడమును ప్రశంసజేసి యతనిమెప్పు బడయవచ్చునుగాని పంపకవి తెలుగవాడేయైన జాత్యభిమానమును జారవిడిచి, తెలుగును తెలుగులను పొగడకున్నను సందర్భ మొకటి కల్పించుకొని ఆంధ్రులను గూర్చి తనయాదిపురాణమున

క. "కేరళవిక్షీకటీసూ
త్రారుణ నీమలయయువతి దర్పణనాంధ్రీ
నీరంధ్రబంధుర స్తన
హారనుదారం సరస్వతీమణిహారం"—ప్ర. ౩౨.

అని వ్రాయునా? వేంగిమండలము కర్ణాటములోనిది. పంపడు శుద్ధకర్ణాటకుడు. అట్లగుటంబట్టియే కర్ణాటయువతుల సోదరీభావమునగని గౌరవబుద్ధిని వారి నిందు చేర్చడయ్యె. పంపడు తెలుగుజైనభారతమును జూచి కన్నడమున పరివర్తనము జేయుటంజేసియే నద్దాని నల్పకాలములోనే ముగించెనను ఆంధ్రవాఙ్మయచరిత్రమునందలి వాక్యము నిరాధార మైనది. ఇక పొన్నరన్న, నాగవర్మాదికవులును కర్ణాటకులని తేలుచున్నది. కర్ణాటదేశమున జినసమయ ప్రదీపకుడై రత్నత్రయమున నొకడైన పంపకవి కర్ణాటదేశీయుడనియు కర్ణాటకవిపుంగవుడనియు కొంత వఱకు బర్యాలోచించితిమి. ఇకనుభయకవి చక్రవర్తి బిరుదులనుబడసిన పొన్నరన్న జన్నలనుగూర్చి కొంత విమర్శింతము. జన్నడు తనయశోధరచరిత్రమునం దిట్లు వ్రాసియున్నాడు:—

క. "కన్నరనాదరదింకుడె
పొన్నం మనమొసెదుతైలపంకుడెరన్నం
మన్నిసి బల్లాళంకుడె
జన్నం కవిచక్రవర్తి వెసరంతళెదం."

ఈపద్యమున పేర్కొన్న రాజులందఱును గర్ణాటదేశమున రాజ్యముల నేలి కవిరాజు లను కవిచక్రవర్తులుగా జేసిన కర్ణాటకులు. పొన్నడు మల్లపయ పున్నిమయ్యల ప్రార్థనానుసారముగ పురాణచూడామణి యని పేరుగన్న శాంతిపురాణమును వ్రాసెను. మల్లపశబ్దమందలి 'అప్ప' శబ్దము కర్ణాటకపదము. 'అప్ప' శబ్దము తెలుగునందు అక్కయను యర్థముగల స్త్రీవాచకశబ్దముగా వాడబడుచున్నది. కన్నడమునం దయ్యది పుల్లింగశబ్దము. మఱియు మల్లపకు అమ్మనభక్తుడను ప్రఖ్యాతిగలదు. అమ్మ యన్న కర్ణాటభాషయందు తండ్రియని యర్థము. అప్ప యనుపదమునకు పర్యాయపదముగా వాడబడుచున్నది. అమ్మనభక్తుడై శాంతిపురాణమును కర్ణాటభాషను వ్రాయించిన మల్లప్ప కర్ణాటకుడు. అతడు గోదావరినుండి కావేరివఱకు వ్యాపించియుండిన కర్ణాటదేశములోని కమ్మనాడునందలి పుంగనూరు నివాసి. శాంతిపురాణమును వ్రాసిన పొన్నకవి నామము సహితము కర్ణాటశబ్దమే. నాడునుబట్టి చూచినను, నామమునుబట్టి చూచినను పొన్నకవి తెలుగువాడుకాడు. శుద్ధకర్ణాటకుడే. రన్నని పోషకుడును రన్నడును పై జెప్పినట్టి కారణములచే కర్ణాటకులే జన్నడు నట్టి కన్నడిగడే. ఇక కర్ణాటకఛందస్సును కర్ణాటక కాదంబరిని వ్రాసిన నాగవర్మ నింతకనుగొందము. అతడు తన ఛందోంబుధిని వ్రాసికొన్న దేశవర్ణనమును, తెలుగువారు ఎల్లవేళలందెల్లెడలను చదివి, నాగవర్మ తెలుగడని చాటుచున్నారు. అతడు తెలుగడు కాడనుటకు నతని కర్ణాట గ్రంథములే ప్రబలతార్కాణములై యుండుటయేకాక

అతడు చెప్పిన వెంగిమండలమును వెంగిపళువు గ్రామమును నృపతుంగని వాక్యానుసారముగా కర్ణాటకదేశములోనివి యగుచున్నవి. బొంబాయిరాష్ట్రములోని కర్ణాటప్రదేశమునందు వెంగిపళుచనునది యొకటి యున్నదని కర్ణాటకపరిశోధకులొకరు అనేకసంవత్సరములకు వెనుకనే కర్ణాటపరిషత్పత్రికయందు సూచించిరి. అది యటుండనిండు. వెంగిపళువను శబ్దములోని ళకారము కర్ణాటవర్ణమాలలోనందు దేశీయాక్షరము లైదింటిలో నొకటియగు ళకారము. ఈ ళకారము కర్ణాటకమునందు, ద్రావిడమునందుమాత్రమే గల వర్ణము. తెలుగునం దీవర్ణము లేదు. అట్టి ళవర్ణముగలమాటను గ్రామమునకిడ నెట్లు పొసగును? కన్నడిగలు కన్నడమాటతో నాయూరికి 'వెంగిపళు' నని పేరిడినారు. పళువన్న నడవి యని యర్థము. పూర్వమున నగ్నిపర్వతప్రకోపోద్భూతలోహరసమున నెంతవేగినను దండకారణ్యభాగమై యుండిన వెంగివిషయమున వృక్షసంపత్తి లేకుండునా? కొండగులుతు, కోనగులుతు, అడవిగులుతు, మడుపుగులుతుబట్టి పేరులు పెట్టుచుండిన దేశీయులు తమ పూర్వపద్ధతి ననుసరించి వృక్షసంపత్తియే ప్రధానలక్షణముగా గలిగిన యచ్చోటికి వెంగిపళువను పేరుపెట్టిరి. తరుమండములతో నిండిన ఈప్రదేశమును బ్రాహ్మణులు తమనివాసయోగ్యముగు అగ్రహారముగా జేసికొనుటకు నిదియే ప్రబలకారణము. పళువునంతతో పడలి నాగవర్మకవి తండ్రిపేరు నింతపరీక్షింతము. నాగవర్మ తండ్రిపేరు వెణ్ణమయ్య. అమ్మశబ్దమునకు అయ్యశబ్దము పునరుక్తి యగు. అమ్మయనుమాట, పుల్లింగమున కర్ణాటభాషయందు మాత్రమే, కర్ణాటనామములందుమాత్రమే ప్రయోగింపబడుచున్నదని నే నప్పుడే చెప్పియున్నాడను. పొన్నరన్న నాగచంద్ర మొదలగు కవులు తమ గ్రంథములం దీపదమును వాడియున్నారు.

మల్లికామాలె.

మల్లపయ్యన తమ్మనమ్మనభక్త నామముదాత్తనీ
మల్లపయ్యనొళొప్పుగుం పితృభక్తియుం వినయోక్తి
—పొన్నిశాంతి పురాణము ప్ర. ఆ. ౪౦. ప. [యుం

చంపకమాలె.

[పినాకవెత్తవో
దుదొళరవెత్తవోదుదొలలాటది నింగళగణ్ణదెత్తవో
దుదొగురునూనుతానుమణమమ్మన లంపుమదెత్తవో
[దుదో.

—రన్నని గదాయుద్ధము తృ. ఆ. ౫౦. ప.

నొసలొళ్ కణ్ణడ మెందునచ్చి పొరెదెంతొనక్కె
[తమ్మణ్ణమ్మన
క్కె సలంబం తిరువాగ్గెతందరిపరే——.

—రన్నని గదాయుద్ధము.

చంపకమాలె.

ధినువెనరాతిమండలము నెన్ననుజంగెనగమ్మనిత్తుసా
[దం
వసుధెయనీవెనెందుమనదొళ్ తతెసందనుదాత్త
[రాఘవం.

—నాగచంద్రుని పంపరామాయణము ప. ఆ. ౧౧౭. ప.

నాగవర్మయు నతనిపితృపరంపరయు కర్ణాటవాస్తవ్యులగు కన్నడిగలగుటచే వారి నామధేయములం దీశుద్ధకర్ణాటశబ్దము కావంబడుచున్నది. ఎచ్చమనాయక, కృష్ణమ్మ కృష్ణమాచార్యులు అనుపేళులుగలవారుతోలికన్నడిగలే. కర్ణాటభాషలో జైమినిభారతమును వ్రాసిన లక్ష్మీశుడను కవి తాను 'అణ్ణమాంకనసుతం' అని చెప్పికొన్నాడు. ఇందలి అణ్ణమ యనుపదము తత్పదధారి కన్నడిగడని చాటుచున్నది. మఱియు నాగవర్మతల్లి పేరు తుద 'అబ్బె' శబ్దమున్నది. అయ్యది అంబాశబ్దోద్భవము. దానికి తత్సమము అంబె. తెలుగున 'అంబా' శబ్దమునకు తత్సమము 'అంబ'; తద్భవము అమ్మ. ఇదియు నాగవర్మ పూర్వికుల కర్ణాటకత్వమును సూచించుచున్నది. . గనుక, చిలుకూరి నారాయణరావుగారును, వంగూరి సుబ్బారావుగారును వ్రాసి వాదించినట్లు పంపకవి మొదలగువారు ఆంధ్రులుగాని, తెలుగులుగాని కారు. శుద్ధకర్ణాటకులే యగుదురు. వారు ఆంధ్రులునుగారు, ఆంధ్రదేశమునుండియు వెడలిరాలేదు. ఆంధ్రగ్రంథముల నెవ్వియును వ్రాయలేదు. అత్యమితజాత్యభిమానసంచోదితమైన వారివాదము సత్యవిరుద్ధ

మును, అబద్ధమునై యున్నది. ఆంధ్రులనిగాని తెలుగలనిగాని చెప్పికొనని పంపకవి మొదలగువారిని వారు లేని వాదము నొక్కటి లేవదీసి ఆంధ్రులనిరిగాని, నిక్కముగా కర్ణాటకవులనిపించుకొనజాలు నారాయణభట్టు, నన్నయభట్టు, పాల్కురికి సోమనాథ, శ్రీనాథ, కృష్ణదేవరాయ మున్నగువారిని లెక్కకు గొనరైరి. నే నిటు చెప్పుటవాదమునకు ప్రతివాదము చేయునభిలాషంగాదు. నందంపూడి శాసనమున—

"యస్సంస్కృతకర్ణాట
ప్రాకృతపైశాచికాంధ్రభాషా సుకవిరాజశేఖర..."

యని నారాయణభట్టును నన్నయ తాను రాజవాక్యములతో శాశ్వతముగా ప్రశంసించియున్నాడు. సమాస పదమును గూర్చుటయందు అల్పాక్షగశబ్దములను అబలా శబ్దములను మొదట నుంచుట వ్యాకరణవిధిగా నున్నది. విపులశబ్దానుశాసనుడును, సంస్కృతవ్యాసభారత పరివర్తకుడును నగు నన్నపార్యుడు శాసనమునందు సమాస వాక్యమును గూర్చుటయందు తప్పుచేయడుగదా? అయిన నాంధ్రశబ్దమును గొననుంచి సంస్కృతమునకు తరువాత ద్వితీయస్థానమును కర్ణాటమున కొసగియున్నాడు. ఇది యంతయు హృదయంగమముగా నున్నది. దీనికి కారణ ముండవలయునుగదా? మఱియు శాసనకర్త, నారాయణ భట్టును కవియనక సుకవియనియు నందునను సుకవిరాజశేఖరుడనియు, కవీభవజ్రాంకుశుడనియు సంబోధించి యున్నాడు. కాలజాతిబలగౌరవములను బట్టి సమాస వాక్యములందు పదములకు తత్తదుచితస్థానము లొసంగుటకు కవిప్రయోగములు గలవు. కాలక్రమమునుబట్టి గూర్చిన మీన, కూర్మ, వరాహ, నారసింహ, వామన, పరశురామ, రఘురామ, కృష్ణ, బుద్ధ, కల్క్యవతారములను వాక్యమును, జాతిక్రమమును బట్టి గూర్చిన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను వాక్యమును, బలగౌరవములనుబట్టి గూర్చిన రామలక్ష్మణభరతశత్రుఘ్నులను వాక్యమును ఉదాహరణములుగా గొనవచ్చును. ఇంతే నారాయణభట్టు పాండిత్యమునకు మాత్రమే పొగడబడలేదు. ముఖ్యముగా వివిధభాషలందు కవిత్వము జేయజాలు బలగౌరవములకు శ్లాఘింపబడినాడు. ఆంధ్ర పైశాచికప్రాకృతభాషలందు కవిత్వము జేయుట కంటె కర్ణాటభాషయందు కవిత్వముచేయు శక్తియు, నద్దానియందుకంటె సంస్కృతమున కవిత్వముచేయజాలు శక్తియు నెక్కువగనుండి యుండవలయు. కావున కర్ణాటపదము సంస్కృతపదము వెంటనే గౌరవపదవి నలంకరించినది. నారాయణభట్టు కర్ణాటకుడుగాకున్న ఆంధ్ర భాషయందుకంటె సులభముగా సరసముగా కర్ణాటమున కవనము చేయగలుగునా? యననది యిందు ముఖ్యాంశము. పూర్వచాళుక్యులు పశ్చిమచాళుక్యుల వంశశాఖవారు గదా? పూర్వ సముద్రతీరమున నున్న తెలుగుల గెలిచి వారిని చెంతనున్న కన్నడిగలతో జేర్చి, పూర్వచాళుక్యులు వెంగిమండలమున రాజ్యభారము చేసిరి. ఇక్కాలమున జైనమతప్రాబల్యమున కునికిపట్టగు పశ్చిమకర్ణాటమును వదలి, వైదికమతసానుభూతిగల చాళుక్యరాజశాఖ వెంబడి వైదికమతవిద్వేషులగు జైనులతో నరనారాయణులబోలె మతయుద్ధము జేయబూనిన నారాయణ భట్టును నన్నయభట్టును వచ్చియుండవలయు.

ఉ. పాయక పాకశాసనికి
భారతఘోరరణంబునందు నా
రాయణునట్టు తాను
ధరామరవంశ విభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయ ధు
రంధురుడుఁ దనకిష్టుడుఁ సహో
ధ్యాయుడునైన వాఁ డభిమ
తంబుగఁ దోడయి నిర్వహింపగన్.

వారు సహాధ్యాయులే గాక స్వవంశజులై యుందురని నా యభిప్రాయము. ఈయభిప్రాయమున కాధారము నందంపూడి శాసనమునందు 'నన్ని నారాయణ' యనుచోట నారాయణనామమునకు ముందు నన్ని యను పదము ప్రయోగింపబడియున్నది. నన్ని యన్న కన్నడమున సత్యమని యర్థము.

ఆ. 'నిత్యసత్యవచను మత్యనురాధిపా
చార్యుసుజను నన్నపార్యుఁ జూచి

పరమధర్మవిదుడు పరచళుక్యాన్వయ
భరణు డిట్టులనియె కరుణతోడ.'

అని యున్నది.

"కావ్యానాంకర్త నన్నియభట్టో లేఖకో గండాచార్యః" అని నందంపూడి శాసనములో క్రింద నున్నది. సత్యవచను డైన నన్నపార్యుడు - నన్నియభట్టు = సత్యముయొక్క భట్టే యగుచున్నాడు. 'అ' యను షష్ఠీవిభక్తి ప్రత్యయాంశముతో గూడిన 'నన్నయ' యను విశేషణపదము కర్ణాటభాషకు జేరినది. నన్నపార్య యను నామములోని అప్పశబ్దమును కర్ణాటభాషకుజేరినది. నన్నప్పయను నామకరణమునకు ప్రయోజనము నన్నప్ప=నాతండ్రియనిగాని, నారాయణప్పయను పదమునకు క్షేమవాచకము గాని యుండవలయు. ఇవియన్నియు సమన్వయించి సిద్ధాంతముచేసిన నన్ని నారాయణభట్టును నన్నినన్నపార్యభట్టును పశ్చిమ కర్ణాటదేశము నుండి,పూర్వకర్ణాట దేశమునకు చళుక్యవంశముతో గూడి వచ్చి, వైదికమతాభిమానముల్లను, జైనమత విద్వేషము వల్లను భారతాదివైదిక గ్రంథములనువ్రాసి, వైదిక ధర్మసంరక్షణమును జేసికొనుచు ధనయశోధనములను బడసిరని తేలుచున్నది. నారాయణభట్టును నన్నియభట్టును సహాధ్యాయులుగా నుండుటయు, జైనభారత పురాణములు వ్రాసిన కర్ణాటకవులతో ప్రతిభటించి కర్ణాట కవనమునుచేయజాలు నారాయణభట్టునకు మత కవితా యుద్ధమున నన్నియభట్టు నారాయణ పదవి నొసంగుటయు, తాను నరస్థానమును స్వీకరించుటయు, తాను విపులశబ్దాను శాసనుడగుటకు తోడ్పడిన వివిధభాషాభిజ్ఞుడగు నారాయణభట్టునెడ తనకృతజ్ఞతను గనబఱచుటకై 'పాయకపాకశాసనికి'యనుపద్యమున సహాధ్యాయి యనుపదము నుపయోగించి రాజరాజునుండి నన్నియభట్టు నందంపూడి గ్రామము నతని కగ్రహారముగా నిప్పించుటయు, శాసనగ్రంథాంతర్గతిహాసికాధారములై పై సిద్ధాంతమును సమర్థించుచున్నవి. ఇట్లు కర్ణాటకులే తెలుగుభాషను సంస్కరించి, లక్షణసమేతముగాజేసి, భారతాది ఘనలక్ష్యగ్రంథములను వ్రాసియుండిరనుటకు చోటున్నది. గాని, ఆంధ్రవాఙ్మయచరిత్రమున లిఖించినట్లు ఆంధ్రులే కర్ణాటలక్ష్యలక్షణగ్రంథములను వ్రాసిరనుట యబద్ధము. ఆదిపంపనికి ముందే నృపతుంగుడు కవిరాజమార్గమను లక్షణగ్రంథమును వ్రాసి లక్ష్యముల నిచ్చియున్నాడు. అతడు విమలోదయనాగార్జునాది కర్ణాట పద్యగద్య మహాకవుల లక్ష్యలక్షణగ్రంథముల ననుసరించి తనగ్రంథమును వ్రాసినట్లు చెప్పికొన్నాడు. మఱియు నన్నయ తనభారతకథను వ్రాయకముందు పంపని కావ్యములను రన్ననికావ్యములను అవలోకించి యుండవలెను. రాజనరేంద్రుడు బహుభాషల బహువిధముల భారతముల తనయాస్థానమున విన్నట్లు నన్నపార్యుని మహాభారతమువలన తెలియవచ్చుచున్నది. ఆ భారతములలో కర్ణాటజైనభారత మొక్కటియై యుండవచ్చునని వంగూరి సుబ్బరావుగారును ఒప్పికొని యున్నారు. వినుట యంతవిశేషము గాదు. నన్నపార్యుడు పంపభారతమును రన్ననిగదాయుద్ధము నొండు రెండెడల ననువర్తించుట ఆశ్చర్యకరముగానున్నది. పంపభారతము 'విక్రమార్జునవిజయ' మను నామాంతరము గలది. రన్నని గదాయుద్ధము వస్తుదృష్టి నట్లు పేరిడబడి నాయకదృష్టిని 'సాహసభీమవిజయ' మని నామాంతర మొసగబడెను. అందలి అనువర్తనస్థానముల నింక బొందుపరచెదను.

చ. సకలత్మోన్నర ఖేచరాంచితమహా
మాణిక్యగాణిక్య హా
స్తికరతోర్జితచక్రవర్తి విభవం
మున్నంబలికైన్ద్రయై
హికపారత్రిక భోగమంకుడునినం
మాణిక్యభట్టారకాం
తికమంసార వినేయరాజిగజయం
భద్రాం శుభం మంగళం.

—పంపని ఆదిపురాణము, ౧౬ ఆశ్వా. ౮ ప.

చ. మనమాతంగతురంగ కాంచనల
సన్మాణిక్యగాణిక్య సం
పదలోలిం గొనితెచ్చియిచ్చి ముదమొ
ప్పగ గాంచి సేవించిర
య్యనయాస్థాచాల సేతుశీతనగమ
ధ్యోర్వీపతుల్సంతతా

పుష్పిక పుష్పిక

తలనూనెలో రాణివంటిది

# పుష్పిక

పుష్పికవలన కలుగు మనోహరమైన సువాసనవలన మీరు నూతనవికాసమును బొంది సువాసనలతో గూడిన వుద్యానవనమునందు విహరించుచున్నట్టుల తలంచగలరు.

పుష్పిక మెదడుకు చల్లదనమునిచ్చి జ్ఞాపకశక్తిని వృద్ధిపరచి, వెండ్రుకలు నెరయుటను మాన్పి, పొడు గెదుగునట్లుల చేయును. ఒకపర్యాయము వాడిన మీకే తెలియగలదు.

వెల సీసా 1-కి 0-12-0 అణాలు.

పోస్టేజి ప్యాకింగ్ ప్రత్యేకము.

నూతన, స్వచ్ఛమైన వనమూలికలు, పేటెంట్ యౌషధములు, అన్ని విధములైన వైద్యపరికరములు సర్వకాలములందును దొరుకును. వైద్యశాలలకు, వైద్యులకు ఆసుపత్రులకు ప్రత్యేక తగ్గింపుధరల కివ్వబడును.

ఫోటో కెమెరాయున్న దానికి వలయు సామగ్రిన్ని మావద్ద దొరుకును.

**SHIVA SHANKAR & Co.,**

161/1, Harrison Road, Calcutta.




---

# 11 దినములలో పునర్జన్మము

## హిందూదేశమందంతటను ప్రఖ్యాతి గాంచిన (పుంసత్త్వపు ఖర్జూరకాయలు)

నపుంసకత్వముచే ప్రాణహత్యకు పూనిన అనేకులు ఈకాయలవలన పునర్జన్మము పొంది తనివిదీర సంసార సౌఖ్యము ననుభవించుచున్నారు. చెడిన వీర్యమును శుద్ధపరచి, గట్టిపరచి సరి అయిన స్ఖలనమును కలిగించి యెండిపోయిన పచ్చికపై వర్షముపడిన యేవిధముగా మొలచునో అదే విధముగ నూతనముగ వీర్యవృద్ధి, ధాతువృద్ధి, రక్తవృద్ధి కలిగించు బలవర్ధక ఔషధము. నిష్ప్రయోజనమైన అన్ని మందులున్నూ వాడి, వారి కోరికలు తీరకయుండువారలు యీకాయలను తిని మాకు యినాములు యిచ్చియున్నారు. కాయలు 22 కి 11 దినములకు రుప్య 5.

యినాందార్ యూనాని మెడికల్ ఫార్మసి, కార్వేటినగరం (చిత్తూర్ జిల్లా.)

భ్యుదయుఁ ధర్మజు తత్ప్రభాసితు జగ
త్పూర్ణ ప్రతాపోదయుఁ.

చ. అలర్దదిమఁ త్తె పూత పోస
మల్లిగెకంపనవుంకుతిర్పతం
బెలరువివంగెలల్బగెవ తుం
బిగళ ధ్వనియుఁ కుకిల్వకో
గిలెననెవోఅినుణ్పెసెవమా
మరనోర్మ్గదలల్ల దుణ్మవు
య్యొలపోసగావరంపుగిలా
శీనె సెదత్తొబసంతమాసదొళ్.

—పంపభారతము ద్వి. ఆ. ౧౨ ప.

లయగ్రాహి—

కమ్మనిలతాంతముల కుమ్మొనసిచ్చు మధు
పమ్ముల నుగీతనినమ్ము లెసగంజూ
తమ్ములలసత్కిసలయమ్ముల సుగంధిముకు
ళమ్ములను నానుచు మదమ్మెసరవాచా
లమ్ములగు కోకిలకులమ్ములరవమ్ము మధు
రమ్ముగుచు వీచెననిశమ్ము సుమనోభా
రమ్మునశోకనికరమ్ములను జంపక
చయమ్ములును గింశుకవనమ్ములునునొప్పెన్.

—ఆరణ్యపర్వము.

మొదటిపద్యమునందు వృత్తముసహితమొక్కటియే.

పంపకవి తన ఆదిపురాణమునినిట్లు చెప్పికొన్నాడు.

క. ఇదు విసుకవిప్రమోద
ప్రదమిదువె సమస్తభవ్యలోకప్రముద
ప్రదమెనెసెగల్దాదిపురా
ణదొళ్ జీవుదు కావ్యధర్మముం ధర్మముమం.

అట్టి కావ్యధర్మములనెల్ల గలిగిన ఆదిపురాణమును మించ వలయునను బుద్ధితోనైన నన్నయ గాంచియుండడా? పైజెప్పిన పద్యముల రెండింటియందును భావములు పదములు చక్కగా పరివర్తింపబడినవి. అది పంపనిభావమునుగాని, పదమును గాని సంగ్రహశక్తినిగాని శైలినిగాని మించలేదు కాని ఇముడించలేక కొంచము విస్తరించి వ్రాసినాడు.

మ. మొదలొళ్పంతనసూనుపత్తు దివసం
చాపాగమాచార్యన
ద్దయుదినంభాస్కరనందనం దినయుగం
శల్యంభకంగెద్దొడా
దదినార్ధం దిందర్ధదిందినగదా
యుద్ధంపరిచ్ఛిన్నమిం
తుదినంగళ్ పదినెంటరింసమెదు
దారుద్రాహవం భారతం.

— రన్నగదాయుద్ధము, ౯ ఆశ్వా. ౩౬ ప.

పంచచామరము:

పదిదినంబులు భీష్ముడాహవ భారకుండు గురుండుపం
చదివసంబులు కర్ణుడున్ దివసద్వయంబు దినార్థమం
దుదిత తేజుడు శల్యు డత్యధికోగ్ర వీరగదారణం
బదిదినార్థము గాగనిట్లు భయంకరంబగు వృత్తితోన్.

—ఆదిపర్వము.

ఇందు మఱియొకవిశేషము. నన్నయ పైపద్యముయొక్క భావపదపఙ్క్తిని గైకొనియుండుటయేగాక దాని ద యను ప్రాసాక్షరంబును సహితము అనువర్తించినాడు. ఇవి యన్నియు నన్నయ కర్ణాటజైనకవుల భావపదజాలశైలుల ననుకరించినాడని స్థాపించుచున్నవి. ఏ యుద్ధమునందేగాని పరపదార్థగ్రహణము శుంఠత్వమందురు గదా? నూతనవిషయములను తన తెలుగుభారతమున దూర్చుటయందును, మూలమున నున్న వర్ణనను మార్చుటయందును నన్నయ వెనుకదీయువాడుకాడు. గోదావరివర్ణనమును దూర్చినాడు. కుమారాస్త్రవిద్యాసందర్శన సందర్భమునందలి వర్ణనను మార్చినాడు. ఈమార్పును రాఘవరావుగారు తమ ఆంధ్రగద్యవాఙ్మయచరిత్రమున ప్రశంసించిరి. వారు వంగూరి సుబ్బారావుగారివలె పరనిందజేయనందులకై పూజ్యులు. అయిన, వేదవ్యాసునికంటెను నన్నపార్యుడు రమ్యతరముగ వ్రాయువాడని అత్యమితస్తుతిజేసినందులకు వారపరాధులే. అందలి గద్యము నించుక తీసి విమర్శింతము.

"అట్టియవసరంబున నాచార్యుండు శుక్లాంబరాభరణ... శోభితుండు రంగమధ్యంబుననశ్వత్థామసహితుం

దైవిముక్తజలధరవియన్మధ్యంబున నంగారకసహితుండైన యాదిత్యుండునుంబోలె నున్న మూలమున వ్యాసమహర్షులు ద్రోణుని చంద్రునికి పోల్చి వ్రాసియున్నారు. జ్యోతిషము నందల్పజ్ఞానముండినను" చాలును పైయుపమానము నానందించుటకు తెల్లగుడ్డల తొడిగియున్న ద్రోణాచార్యుని ఎఱ్ఱగుడ్డలతోనుండు అశ్వత్థామని చంద్రమంగళులకు క్రమముగా పోల్చనయ్యె. వర్ణమునుబట్టి చూచిన చంద్రగ్రహము తెలుపువన్నె గలదియు మంగళగ్రహ మెఱుపు వన్నెగలదియు నగుచున్నవి. ఇక స్వభావమునందో చంద్రగ్రహము సౌమ్యస్వభావము గలది. పేరున మంగళగ్రహముగాని మంగళగ్రహము క్రూరస్వభావము గలది; మారకగ్రహము. గురువు దేవగుర్వంశమువాడు అశ్వత్థామ యన్నచో రుద్రాంశమువాడు. చంద్రుడు చల్లనివాడు. అశ్వత్థామ తీక్ష్ణదృష్టిగలవాడు. ఇదియెంతయు నొప్పుచున్నది. జ్యోతిషశాస్త్రమునరయక కవిసమయభ్రాంతిని ద్రోణాచార్యులను సూర్యునకు బోల్చుట కతడు భారతయుద్ధరంగమున నిలిచిన సేనాధిపతియైన వీరద్రోణుడు కాడు. గురువై తనశిష్యుల అస్త్రవిద్యాబలమును చూడ నుత్సాహముతోనుండు ఆచార్యుడు. చంద్రుని చెంతనుండు మంగళునివన్నెను కనుగొన నగును గాని సూర్యతేజమునకు లోబడిన భూమిజునివన్నె కంటబడునెట్లు? ఇక గ్రహముల వయస్సును వానినిబట్టి వ్రాయవలసియుండిన, అశ్వత్థామని, గ్రహవర్గములో చిన్నవాడగు మంగళునికేల పోల్చవలయు? అంతకంటె ఔచిత్యముగల చంద్రపుత్రుడగు బుధునికి పోల్చరాదా? అటుపొసగదు. ధౌతాంబరమునకును సౌమ్యస్వభావ దృష్టులకును భంగము వచ్చును. బుధుడు సౌమ్యగ్రహముతోనున్న సౌమ్యుడుగానుండు, క్రూరగ్రహముతోనున్న క్రూరుడుగానుండు. అంగారకుడన్న నెల్లప్పుడును క్రూరుడే. ధౌతాంబరమనుచోట తెల్లనియాకాశమను శ్లేషోక్తిగలదు. అన్నిటికంటెను ముందు రాబోవు పరిణామములను సూచించునదిగానున్నదీ సందర్భము. ఈప్రదర్శనమునందే పాండవకౌరవులకు కలహము గలిగినది. పాండవ పక్షపాతముగల ద్రోణుడు వారి విజయమునందు పొంగుటయు, అశ్వత్థాముడు పాండవులకు భారతయుద్ధంబునందు మారకుడగుటయు, చంద్రయోగమున కుజదృష్టి ఉపపాండవుల వధతోనే యుపశాంతినొందుటను సూచించుచున్నది. జ్యోతిషశాస్త్రమును నెఱుగని నాకే ఇన్నిరమణీయతలు మీదికి దోచినవి. జ్యోతిషశాస్త్రవేత్తలగు పండితుల కింక నెంత సుఖప్రదమో చెప్ప నలవిగాదు. సమస్త వేదశాస్త్రపురాణజ్ఞుడును విష్ణునిఏకవింశత్యవతారములలో నొకడును నగు శ్రీ వేదవ్యాసమహర్షి యెక్కడ కేవలమానవుడైన నన్నపార్యుడెక్కడ? అట్లు ఆతురమున నెద్దియును పరిశీలింపక చెప్పరాదు. నన్నయయే భారతమును కావ్యమని కవివృషభులును, పురాణమని పుణ్యపురుషులును ఇంక ననేకములుగా ననేకులు దెలియుచున్నారని దాని బహుముఖత్వమును, ప్రగాఢత్వమును గూర్చి గ్రంథారంభమున లిఖించెనుగదా? దేవరహస్యోక్తులను దెలిసికోనవలయు. పాత్రాపాత్రతను జూడవలదే. ఇట్లనే మఱికొందఱు ఇతిహాసకర్తయు, పరమజ్ఞానియు నగు బాదరాయణమహర్షిని ప్రతిభకల కవులలో నొక్కడైన కాళిదాసునితో బోల్చి మహర్షిని ఈ మానిసితో సరికాజాలడని యందురు. అయ్యది అజ్ఞాన సంజాత వాక్యము. ఇతిహాసమున దుష్యంతకథ నున్నట్లున్నదిగా చెప్పవలయును నాటకమున వస్తువును మార్పవచ్చును. ప్లూటార్కు వ్రాతలో నుండు జూలియసు సీజరును తదితర పాత్రలును ప్రతిభాకల్పిత షేక్స్పియర్ జూలియస్ సీజరు ఆంటోనీ మొదలగువారితో సరిరావన్నట్లున్నది. ఐతిహాసికుని కర్తవ్యమే వేఱు. నాటకకర్త కర్తవ్యమే వేఱు. వ్యాసమహర్షి మూలగ్రంథమున తిద్దుపాటు జేసిన నన్నయనుగూర్చి ఇంత వ్రాయవలసె. ఇప్పుడు నన్నయభట్టు కర్ణాటకుడగుటచే పొరపాటున జేసిన స్వజనదోషము సహింపతగినది. అయిన సత్యాంశమును వెలిబుచ్చవలసినదగుట నింత చర్చించితిని. ఇక పాల్కురికి సోమనాథుడు కన్నడగ్రంథముల వ్రాసి, కర్ణాటదేశమునకేబోయి యక్కడ సమాధి యగుటం దెలిసినవారతడు కర్ణాటదేశమువాడని నమ్మక యుండరు. తెలుగుదేశమున నుండి నన్నియవలె తెలుగుగ్రంథముల వ్రాసినాడు: ఒప్పికొందుము, ఈవృత్త

యుద్ధమున నన్నయ సోమనాథాది ప్రభృతులు వ్రాసిన పురాణములు జైనపురాణములఫక్కి నున్నవి. ఆదిపంపని జైనభారతమునకు ప్రతిగా నన్నియ బ్రాహ్మణ భారతమును వ్రాసెను. పంపకవి తా నుభయభాషలందు ప్రవీణు డనిపించుకొనుటకై తనయాదిపురాణమున కర్ణాటకభాషయందు మాత్రమే పద్యములను వ్రాయుట గాక సంస్కృతమున సహితము గొన్నివృత్తముల వ్రాసినాడు. దానింజూచి నన్నియభట్టు భారతేతిహాసప్రారంభమున మంగళశ్లోకమును సంస్కృతమున వ్రాసి పిదప తెలుగుగ్రంథమును వ్రాసినాడు. అందలి సంస్కృతపద్యములు జిన స్తవములు. ఇందలి సంస్కృతవృత్తమును త్రిమూర్తుల స్తవమై యున్నది. కావ్యముల కుండవలయు శబ్దాలంకారాది కావ్యశృంగారమును నన్నయ రన్నని గ్రంథములనుండి చూచి వ్రాసినాడని తోచుచున్నది. రఘువరావుగారు నన్నయప్రతిభను దెలుపుటకు తార్కాణములుగా నొసగిన రీతులన్నియు రన్న గ్రంథోక్తి ప్రతిబింబితములు. కొన్నిటి నిందు మచ్చున కెత్తి వ్రాసెదను.

క. 'తవ్నష్టంయ
న్నదీయతే' ఎనిపుదత్తి మచ్చెయదానం.
—అజితపురాణము.

ఇది వ్యాకపరివేష్టనము
ఇట్టి వెన్నియో గలవు.

క. ఎనితం కుళ్కళకుదిదప
యెనితం కళ్కెకళల్దపయ్ జీవనెనీ
నెనితం మల్మలమఱుగువ
యెనితం సంసారదొళగె తిఱ్ఱనె తిరివయ్.
—అజితపురాణము.

ఇయ్యవి జాతీయపదములు

క. పొల్లమె పరమతదొళ్ ఫల
విల్లవఱొళ్ తొడదుఱ కిడదిరెలెజీవనెనీ
నల్లియె తొడవఱయ్ తింబర
నల్లదె కుఱిమెచ్చదెంబ నుడితప్పుగుమే.
అజిత. పు.

ఇది నానుడి

వ. ఆతనేకాంగ వీరనుం, ఉభయ కులశుద్ధనుం, త్యాగాదిమహాగుణత్రయ పవిత్రనుం, చతుర్వర్గఫలోపభోగియుం, పంచాంగమంత్ర నిరతనుం, షాడ్గుణ్యోపయోగ కృతనుం, సప్తాంగ రాజ్యసంపన్ననుం, అష్టదిక్చక్ర విజయియుం, నవనిధిపరిపూర్ణనుం, దశకులధర్మనిర్మలనుం, ఏకాదశోపవాసకాస్థానవేదియుం, ద్వాదశ జమండలనియోజిత ప్రధానవిజిగీషువృత్తనుం, త్రయోదశ మదోపచారపరిణతప్రకటిత తుంగగజాగమ పరిజ్ఞాననుం, చతుర్దశమనుమునిచరితనుం, పంచదశకర్మభూమిస్థిత విభాగ ప్రగల్భమతియుం, షోడశతీర్థక భావనోపచిత జన్మనామోత్పత్తి హేతుభూతనుం, ఆగిసత్సుఖదినిరల్.—
—అజిత పురాణము.

రన్ననికందములు జగద్విఖ్యాతములుగదా! ఇక పంపని ఆదిపురాణమురీతిని పొన్నని పురాణరచనా విధానమును జూచి పాల్కురికి సోముడు తాను ప్రతిఘటించి వీరశైవబసవపురాణమును వ్రాయుటలో చూపినాడు. పొన్నడు అక్షరాను క్రమముగా జినాక్షరమాలయందు శ్లోకములు వ్రాసియుండ తాను నట్లేజేసినాడు. ఇంక ననేకపోలికలున్నవి. ఇందు యెడములేమి వ్రాయవలసినాడను. శ్రీనాథునింతచూతము. వెంగిమండలమువాడని చెప్పికొన్న పంపమొదలగువారినే ఆంధ్రులని ఆంధ్రులు వాదించుచున్నారుకాని,

ప్రౌఢిపరికింప సంస్కృత భాషయంద్రు
పలుకునుడికారమున నాంధ్రభాషయంద్రు
ఎవ్వరేమన్న నంద్రు నాకేమికొరత
నాకవిత్వంబునిజము కర్ణాటభాష.
—భీమేశ్వర పురాణము.

అని నిర్భీతినిఘంటాఘోషముగా బలుకుచున్నమాటను ఆచంద్రతారార్కముగా తనయుద్గ్రంథమునందు పద్యరూపమున నెక్కించిన శ్రీనాథుని కర్ణాట[illegible] యొప్పికొనుటకు వెనుదీసి లేని పోనివాదములు లేవదీయుచున్నారు. జైనకవులగ్రంథములందు తెలుగుకాని

విలక్షణములుగాను, విశేషలక్షణములుగాను కన్పట్టు ప్రౌఢప్రయోగము లన్నియు కర్ణాటభాషాదృష్టిని పరికించిన నిర్దుష్టములు, సాధువులు నగుచున్నవి. దానిని ప్రత్యేకముగా నిరూపించవలెను. ఆముక్తమాల్యదయందలి ప్రయోగములు నట్టివియు. ఏల? కృష్ణరాయడు తుళుకర్ణాటకుడు. కృష్ణరాయని విషయమై యొకమాట. అతడు కేవలము కర్ణాటదేశమునకు జేరినవాడు. తండ్రి తుళునరసింగరాయడు. తుళుజనులు దక్షిణకన్నడమువారు. కృష్ణదేవరాయలు నరసింగనికి భోగినీపుత్రుడు. వీరనరసింహరాజు పట్టమహిషియందు బుట్టినవాడు. అతని రాజ్యపరిపాలనానంతరము కృష్ణదేవరాయలు పట్టమునకు వచ్చెను. కృష్ణదేవరాయలకు తిమ్మణ్ణ కవీంద్రుడు వ్రాసిన కర్ణాటభారతభాగము అంకితము చేయబడినది. కృష్ణదేవరాయలు కర్ణాటకుడైన వ్యాసయోగిశిష్యుడు. ఈవిషయమున నెంతయో సత్యమును తెలివేయు సోమనాథకవికృత "వ్యాసయోగిచరిత్రము" అను గ్రంథ మొక్కటి కలదు * విజయనగరేతిహాస ప్రదీపకములైన విషయములు ౪, ౫, ౬ ఉల్లాసములందున్నవి. నరసరాయకృష్ణరాయల గురించిన విషయములు ౫ ౬ ఉల్లాసములందున్నవి. గ్రంథసంపాదకులు ఈవిషయములనుగూర్చి ఆంగ్లపీఠికయందు వ్రాసినవాక్యములను ఇట తెలుగుల వ్రాసెదను.

"నరసరాయని మంత్రులు తిరుపతినుండి వ్యాసరాయలను విజయనగరమునకు రావేడుట, విజయనగరవర్ణనము, విజయనగరమున వ్యాసరాయలకు స్వాగతమిచ్చుట. వారి కులగురువుగా పట్టముగట్టుట. ఇతరపండితులు వారి నెదుర్చుట. వ్యాసరాయలు పండితపరిషత్తునందు విజయము నొందుట. నరసరాయడు వ్యాసరాయలను గౌరవించుట. అతనితరువాత వీరనరసింహరాయడును, కృష్ణదేవరాయడును వారిని పూజించుట. శ్రీ వ్యాసరాయల పూజించుటకే తనసర్వస్వము నొసగెదనని కృష్ణదేవరాయలు ప్రతిజ్ఞ సేయుట.—౫ వ ఉల్లాసము.

"కృష్ణదేవరాయలు తనరాజభవనమున వ్యాసరాయలకు కనకాభిషేకము సేయుట, వ్యాసరాయ లటుతరువాత వ్యాససముద్రమును కట్టించుట, వ్యాససముద్రవర్ణనము. కృష్ణదేవరాయలు వ్యాసానుజ్ఞనుగొని పరమపదమున కరుగుట. అచ్యుతరాయలవర్ణనము. నారాయణయతి సోమనాథుని వ్యాసరాయల సభకుబిలుచుట. సోమనాథుడు పోయి వ్యాసయోగిచరిత్రము వ్రాయుట; అయ్యది శ్లాఘింపబడుట. సోమనాథుని వంశవర్ణనము. ౬ వ ఉల్లాసము.

అద్వైతమతావలంబకునివలె కన్పట్టుసోమనాథకవి నిష్పక్షపాతబుద్ధిని ద్వైతమత మఠాధిపుడును విజయనగరవిద్యాపీఠాధిపతియు నగు వ్యాసరాయల చరిత్రము నున్నట్లున్నదిగా వ్రాయుట యతని సత్యప్రియత్వమును అనసూయాగుణమును సాధుత్వమును పాండిత్య సంపత్తిని వేనోళ్ల చాటుచున్నది. కర్ణాటకులగు తుళువ నరసింగరాయడు, వీరసింహరాయడు, కృష్ణదేవరాయడు, కర్ణాటకుడైన వ్యాసయోగిని కులగురువుగా నెన్నుకొన్న విషయము నొక్కటి జ్ఞాపకమునందుంచుకొని కృష్ణదేవరాయని గ్రంథముల నింత పరీక్షింతము. కృష్ణదేవరాయ లనేక సంస్కృతగ్రంథములను వ్యాసయోగిప్రభృతులనుండి సంపాదించిన సంస్కృత పాండిత్యగరిమ వ్రాసియుండు టంతగా విశేషాంశము గాదు. అతడు తెలుగు కబ్బమునొక్కటి వ్రాసినాడు. దాని పేరు "ఆముక్తమాల్యద లేక విష్ణుచిత్తీయము." ఇది వైష్ణవగ్రంథము. గ్రంథప్రారంభమున కృష్ణదేవరాయలే తెలుగున కబ్బమొనర్చెననుటకు కారణము నియ్యబడినవి. "మున్నొకకళింగదేశ విజిగీషామనీషన్ దండెత్తి పోయి విజయవాటిం గొన్నివాసరంబులుండి శ్రీకాకు

* ఈగ్రంథమును ఉత్తమరీతిని సంపాదించి యైతిహాసికకాలపాత్రనిర్ణయచర్చలతో ప్రపంచమున వెల్లడిచేసి మైసూరు సివిల్ సర్వీసునం దుండిన బి. వెంకోబరాయలు అందఱికి వందనీయులు. వారు ముద్రించిన సంస్కృత పుస్తకము సూక్ష్మములైన ఆంగ్లేయవ్యాఖ్యానములతోగూడి వెలయుచున్నది. కర్ణాటభాష నెఱుగని సంస్కృత పండితులును ఆంగ్లేయభాష నెఱిగిన ఆంధ్రపండితులును చదువవచ్చును.

శనికేతనుండగు నాంధ్రమధుమథను సేవింపన్ పోయి హరివాసరోపవాసంబచ్చట గావింపనప్పుణ్యరాత్రిచతుర్థయామంబున".....దేవుడుకలయందువచ్చి యిట్లు జెప్పె నట. దేవభాషయగు సంస్కృతముగాదు మాతృభాష యగు కర్ణాటకము గాదు.

"తెలుఁగదేలనన్న దేశంబు తెలుఁగేను
తెలుఁగువల్లభుండఁ దెలుఁగొకండ
యెల్లనృపులుగొలువ నెఱుఁగవే బాసాడి
దేశభాషలందుఁ దెలుఁగు లెస్స."

తుదనుండు వాక్యము తెలుఁగువల్లభునిది. కృష్ణదేవరాయలది కాదు. 'ఒరియు రసమంజరీ ముఖ్యమధుర కావ్య రచన మెప్పించుకొంటి గీర్వాణభాష నాంధ్రభాష యసాధ్యంబె యందు నొకకృతి వినిర్మింపుమికమాకు బ్రియముగాగ.' "అతం డశేషనృపసేవ దత్తద్భాష లెఱుంగవే" యనుట ఈవాక్యము లన్నియు రాజనీతివిశారదుడైన విజయనగర సామ్రాజ్యాధిపతియగు కృష్ణదేవ రాయల కలలోని మాటలు. కలయంతయు కల్లగాదు గదా? కావున ఆముక్తమాల్యదను కృష్ణదేవరాయలు తెలుగువారియొక్క, విశిష్టాద్వైతులయొక్క రాజ భక్తిని కాపాడికొనుటకై వ్రాసిన గ్రంథము. అందలి విచిత్రపదము లన్నియు తుళుకర్ణాట భాషలోనివి. స్వకార్యసిద్ధికిని, స్వామికార్యసిద్ధికిని కృష్ణదేవ రాయలు ఐహికాముష్మిక సుఖప్రదం బగు "ఆముక్త మాల్యద" యను గ్రంథమును వ్రాయవలసివచ్చె. కృష్ణ దేవరాయ లనుపేరు నతనితండ్రియొక్క ఉడుపి శ్రీకృష్ణ దేవభక్తి పంసూచకముగా నిడినది. ఉడుపియందలి శ్రీ కృష్ణమూర్తి కర్ణాటకుడైన శ్రీమధ్వాచార్యప్రతిష్ఠితము. కృష్ణరాయలతండ్రిపేరు నరసింగరాయలు. ఇదియు కర్ణాట సంప్రదాయమును బట్టియే యున్నది. ఆంధ్రులు సింగ శబ్దమును తమనామధేయము లందుంచికొనరు. నరసింహ రావందురుగాని నరసింగరావనరు. మూరురాయరగండ, అళియ రామరాయపదములను కర్ణాటశబ్దములే. ఆముక్త మాల్యద ఆశ్వాసాంతపద్యము లన్నియు రాయలసీమ కర్ణాటక మనియు నతడు కర్ణాటకుడనియు చాటుచున్న

వి. కణ్కి-సరు, మీన్, డింగరీలు మొదలగు పదములు కర్ణాటపదములు. "ఇది యాంధ్రోక్తి యథార్థనామ యవనాసృక్పూర్ణ కెంబావి" ఇందు కెంబావికన్నడపదము ఆంధ్రోక్తియని రాయలేల జెప్పిరో? వారి తలపున కన్నడము కెన్నీరను పదము దోచియుండె కాబోలు. కన్నడమున కెన్నీరన్న రక్తమని యర్థము. 'యవనాసృక్పూర్ణకెంబావి' యనుచోటియవనులరక్తముతో నిండిన దగుటం కెంబావి=ఎఱ్ఱనీళ్లతో నిండినబావియని యుత్ప్రేక్షించుటయొప్పు. కెంబావి యనుపదముముందు అసృక్పూర్ణ మని విశదముగా వ్రాయబడినది. కెన్నీరన్న నెత్తురని తెలుగునవాడుక కారాదు. కెందామర, కెంగేలు-అను సమాసపదములున్నవి. అయినవవి ఎఱుపుతోమాత్రము సంబంధించినవి. ఇందు ఎఱుపునీళ్లు=నెత్తురను భావమునకు సంబంధించినవిగావు-కెంబావి యనునది కర్ణాటోక్తి. ఏల ననదానిచెంత చిక్కనూగూరు, దొడ్డనూగూరు అనుకన్నడపదములు గలిగిన మఱిరెండు గ్రామములున్నవి. ఇయ్యెడనే రాయమారు ఘోరయుద్ధమాయెను.

మఱియొక విశేషము. హరివాసరోపవాసము ద్వైతులకు అత్యకర్తవ్యమైనవిధిగా నున్నది. ఆనాడు భోజనము నిషిద్ధము. రాయలు కర్ణాటవైష్ణవరీతి హరివాసరముచేసిరి కర్ణాటక సింహాసన సంస్థాపనాచార్యులగు మాధవవిద్యారణ్యులు కర్ణాటకులు. అయిన వార ద్వైతులు. శివార్చకులు. హిందూధర్మసంరక్షణార్థమై విజయనగర సింహాసనమును కర్ణాటకులగు హరిహర బుక్కణ్ణలతో స్థాపించి, వారినందుంచి వారికిపంపా క్షేత్రవాసియగు శ్రీవిరూపాక్షుని రాజ్యదైవముగా నిర్ణయించిరి. హరిహరబుక్కణ్ణలు కర్ణాటకులని నంజుండ కవి "కుమారరామచరిత్ర" అను గ్రంథములోని యీ వాక్యమునుండి దెలియుచున్నది.

"పరిపరియాభరణంగళ రత్నదహారవధ్యదొళు కణ్ణెసెవ సిరియుళ్ళనారివనీగ భీండారద హరిహర హరి ణాయతాక్షి"

హరియణ్ణకుమారర ముని తండ్రికంపలిరాజ్యమున కోశాధ్యక్షుడుగానుండెను. శస్త్రపూజా వర్ణనసందర్భ

మునవచ్చిన ప్రభువులను, అధికారులను వర్ణించునపుడు కవిహరిహరణ్ణను పేర్కొన్నాడు. వీరు శైవమతసానుభూతిగలవారై యుండిరి. తరువాత వచ్చినవారు కొందఱు చంద్రగిరినుండి తిరుపతి వేంకటేశ్వరస్వామిని ఇష్టదైవముగా గొని వైష్ణవులై వైష్ణవమత మమతను జూపిరి. తిరుపతి వేంకటేశుని శ్రీవైష్ణవార్చకులు తగనికార్యములు చేసినందున వారు శిక్షింపబడిరి. వ్యాసరాయలు పండ్రెండు సంవత్సరములు శ్రీనివాసుని పూజచేసిరి. అందుండి నరస రాయ వీరనరసరాయ కృష్ణరాయ అచ్యుతరాయలకాలమందు ద్వైతమతసానుభూతి హెచ్చినది. ఆనెగొంది దగ్గరనున్న ద్వైతయతీంద్రుల నవ బృందావనములే దీనికి ప్రబల సాక్ష్యములు. మాధ్వమతానుసారముగ ద్వైతులకు శివద్వేషము లేదు. విష్ణుని సర్వోత్తము డన్నను శివుని పూజింతురు. ఇయ్యది సమరసభావమును లోగొన్నది. విజయనగర ప్రజలు రాజ్యదేవతయగు శ్రీవిరూపాక్షుని అరగంటగొనుట వినాశకరమని భావించుచుండిరి. రాజుల కిష్టదైవమగు శ్రీనివాసుని విడనాడి రాజద్రోహులగుటకు వెఱచుచుండిరి. హరిహరపూజ కియ్యకొను ద్వైతమతానుసారముగ రెంటికిని భంగము లేకుండు. హరిహరులను పూజింపవచ్చును. విఠప్పయ్యగోపురమున నిప్పుడు విఠలవిగ్రహము లేకున్నను పూర్వమున పండరీపురమునుండి విగ్రహమును మహమ్మదీయుల దాడికి తాళజాలక తెచ్చి యుంచియుండిరి. తురుష్కుల దాడితగ్గినంతనే యయ్యది స్వస్థానమునకు పంపబడెను. ద్వైత వ్యాసకూటమువారికిని, హరిదాసకూటము వారికిని ఇష్టదైవముగు పాండురంగవిఠలుని కృష్ణరాయలు ధ్యానించుచుండిరని కుమారధూర్జటిగ్రంథమునందలి ఈ పద్యము దెలుపుచున్నది.

శా. ఆక్షోణీ రమణాగ్రగణ్యుడు
విరూపాక్షేశ్వరస్వామికిన్
రక్షాశిక్షకుడైన విఠ్ఠలునకున్
రంజిల్లునిత్యోత్సవం
బక్షయ్యంబుగ మించునంచు
నిజభృత్యశ్రేణి దెల్పన్ నితాం
తక్షేమంకరుడై పురీ జనులు నానం
దంబునం జెందగన్॥

కృష్ణరాయవిజయము, ద్వి. ఆ. ౧౧౯.

ఇట్లు ఆముక్తమాల్యద కర్తయగు కృష్ణదేవరాయలు కర్ణాటకుడు. పితృపరంపరనుండి కర్ణాటకుడు. దీనిని మేడేపల్లి వెంకటరమణాచార్యులు ఆముక్తమాల్యద యుపోద్ఘాతమున నొప్పికొని యున్నారు. అది యెంతయు నొప్పుచున్నది. కృష్ణదేవరాయ లంతియెగాక కర్ణాటద్వైతమతాధిపతియగు వ్యాసయోగి ప్రియశిష్యుడు. కావున తెలుగున గ్రంథము వ్రాసిన రాయలు శుద్ధకర్ణాటకులు. రాయలసీమ శుద్ధకర్ణాటకము. "ఇది కర్ణాటధరాధృతి స్థిరభుజాహేవాక లబ్ధేభరాట్" ఇది కృష్ణదేవరాయల వాక్యము.

శ్రీమంతంబై గోదావరినుండి కావేరివఱకును వ్యాపించి యఖండంబుగా వెలసిన విశాలకర్ణాటదేశము కాలవశమున ఆంగ్లేయవినిర్మిత రాజకీయవివిధరాష్ట్రములలో ఖండరూపముదాల్చి సమయుచున్నది. ఇరుగు పొరుగున నుండు హితశత్రుజనాంగములు దానిని తమ దేశాంగమున జేర్చు లోభబుద్ధిని బుద్ధిపూర్వకముగా లోగొన విశ్వప్రయత్నములు చేయుచున్నారు. ఆంగ్లేయప్రభువులు భాషారాష్ట్రములను జనాంగసంరక్షణార్థమై జేయుట త్యావశ్యకముగా నున్నది. రామకృష్ణాద్యవతారకాలములనుండియు ప్రఖ్యాతిగని విరోపాఖండమందలి స్విట్జర్లెండువలె దీనులకు శరణాలయమైయుండిన ఈకర్ణాట స్వాతంత్ర్యదేశము దీనదశలో నున్నది. దాని వైశాల్యమును వైభవమును పరులు గానజాలకున్నారు. దయామయుడైన దేవుడు మరల నీదేశమును స్వస్థితికి దెచ్చుగాత!

# . నగబోధ

ఆర్. వి. 'భరద్వాజ'

## (SERMON IN THE MOUNT)

కవివాక్యము

ఏచలువనీటి చిఱుసెలయేటిగములు
జుంటితేనెలఁ గురియు ప్రసూనతతులు
నమృతరసమొల్కు ఫలసమూహములతరులు
జిలుగుటందాల లేఁత పచ్చికబయళ్లు
వెలయు నీనేల విచ్చేయిడిఁ జరింప
ధనము కేవలదుఃఖభాజనము సుమ్ము.

ప్రభువాక్యము

ఎవఁడు ధనకాంక్షఁబోక సంతృప్తుఁ డగుచుఁ
బేదయై స్వచ్ఛజీవనవిధ మెఱింగి
మనగలం డతఁడే ధన్యుఁ డనఁబరంగు
వానిదే స్వర్గరాజ్యసౌభాగ్యమెల్ల. ౧

కవివాక్యము

పట్టుఁగోల్పోయి మధుకణ భాగ్యమునకు
బిట్టువిలపించు నీతేఁటి పిల్లఁజూచి
కొల్లగా విడ్డమధుమాసకుసుమతతులు
మూఁగమొగమునఁ గన్నీటిబొట్లు రాల్చె
మధురఫలభోగభాగ్యసంపదలనందు!

ప్రభువాక్యము

జ్ఞానలేశమ్ముఁ గోల్పోయి సౌఖ్యమునకు
బిట్టుకొట్లాడున య్యవివేకిఁజూచి
యెవఁడు గాఢానుతాపాన నవయు నతఁడె
చాల పెంపొందు దివ్యోపలాలనమున. ౨

కవివాక్యము

మృదులతమమైన హృదయమ్ము బెదరుకనులు
మంచినడవడి దనర నమాయికమున
బోవు నీమేఁకపిల్లకై పుడమిసతము
మొలకలరచించు, దీవల మొనలు దీర్చు,
బసకఁజివురించుఁ దరులసంపదలఁ బెంచు.

ప్రభువాక్యము

పరమసాత్త్వికుఁడై స్వార్థపరతఁబోక
విమలవర్తనమున జీవనమును గడపు
నాతఁడే ధన్యతముఁ డీయనంతసృష్టి
రాజ్య మాతని కాణాచిరాజధాని. 3

కవివాక్యము

చలువనీడలకొమ్మల చక్కఁదనము
వలచు చెంగావిచివురుజొంపముల మురువు
తేనియల పూలగుత్తుల దిద్దుబాటు
నమృతరసమొల్కు పండ్లసోయగము నింపు
మేలిగొనముల తీయమామిడికిఁ గాక
గలుగునే బొమ్మజెముడు డొంకలకు నెందు?

ప్రభువాక్యము

కోరి యెవ్వాఁడు లోకోపకారతృష్ణఁ
దహతహం జెందు నాతఁడే ధన్యతముఁడు
వానిముంగిటఁ బ్రేమస్రవంతి వాఱు
వెలయు దివ్యామృతము వానిపెరటఁ గురియు. ౪

కవివాక్యము

పాపసంకులమై ద్వేషబద్ధమైన
సృష్టిఁగనికరమున భరియించుకతన
బెండువలె నంచయెఱకల చెండువోలె
నేల సవిలాసముగ గాలిఁ దేలుఁగాదె?

ప్రభువాక్యము

ఎవఁడు కరుణార్ద్రహృదయుఁడై కృపఁ దలంచి
యితరులను సర్వదా క్షమియింపఁ జూచు
నాతఁడే ధన్యుఁడనఁదగు—భూతలమున
నాతఁడే దివ్యకరుణార్హుఁడై చెలంగు. ౫

కవివాక్యము

క్షారజల మంటనీక విశాల జలధిఁ
దరళహృదయాన మసలు ముత్యంపుఁజిప్ప

యోణిముత్యమ్ములను గడుపారఁ గాంచు
బురదఁ బొరలాడు నత్తలో ముత్తెమున్నె?
ప్రభువాక్యము
ధగధగలపోవు మించు టద్దమ్ముపోలు
విమలహృదయాన నెవఁడు జీవితముగడపు
నతఁడు ధన్యుఁడు వాని హృదంతరమున
సతము దివ్యాకృతి తనంతఁ బ్రతిఫలించు. ౬

కవివాక్యము
కాకి గూటనుజిక్కి యిక్కట్టుఁ జెందు
కోకిలమునకు మంచిచిగుళ్లు మేపి
వాయసమునకుఁ గడుపారఁ బండ్లనొసఁగు
నీరసాలము సురసాలమై రహించు.
ప్రభువాక్యము
పగలనడఁగించి శాంతిసంపదల నించి
యెవఁడు సౌభ్రాత్రమును వెలయించు, నతఁడె
ధన్యతముఁ డాతఁ డొక్కఁడే దైవమునకు
గోముమై పెంచికొన్న గారాముపట్టి. ౭

కవివాక్యము
సకలరాజన్యమకుటభూషణము గాఁగ
వెలిఁగి నానాటరత్నమై వెలయఁ గోరు
మానికమునకుఁ గలిగె నీసాన రాపు
గులకఱాలకు రాపుల గోడు గలదె?
ప్రభువాక్యము
కరఁగుహృదయాన లోకోపకారపరత
నెవఁడు రాపులఁబడి బాధ నవయు నతఁడె
దనరు నీలోకమున ధన్యతముఁ డనంగ
వానిదే స్వర్గరాజ్యసౌభాగ్యమెల్ల. ౮

ప్రభుకుమారునిపేర నెవ్వఁడు జగాన
నొక్కలంబడి నిందల నొగిలి నవయు
నెవఁడు బాధలఁబడుఁ జిక్కులెవఁడుపొందు
నతఁడె పెంపొందఁజాలు ధన్యాత్ముఁ డనఁగ.

పూతవర్తనుఁ డానందపూర్ణుఁ డగుచుఁ
జెలిపి దూఱులలవములక్షింపఁబోక
దివ్యసన్మానమును బొంది తేజరిల్లు
తొంటి మతకర్త లీకొంటె కంటకముల
పాలఁబడి నిర్మలానందపదవిఁ జనరె?

పొలుపుగావిడ్డ మధుమాస పుష్పమట్లు
సంతతవికాసవంతమై జాలువారు
సృష్టిహృదయానఁ దేనియ చినుకుపోలెఁ
బరగు సద్వర్తనుండైన నరుఁడొకండు.

పలుచబడి తేనెతీపిఁ గోల్పడియె నేని
నీరమై పూవురేకుల జారిజారి
కణకణమ్ముల మంటిలోఁ గలియుఁగాక
నీరమునకబ్బు నెట్లు తేనియల రుచులు?

సృష్టిసన్మార్గముల చేర్పరింపలేక
తివిరి యజ్ఞానతిమిరాన దేవులాడు
విపులలోకాన నిద్ధదీపిక యనంగఁ
బరఁగు సద్వర్తనుండైన నరుఁ డొకండు.

విమలహృదయాన శివుల పవిత్రుఁడైన
మానవుని జ్ఞానతేజమ్ము మాటువడునె?
కరము పెంపొందు పర్వతాగ్రమున వెలయు
పట్టణము డాఁపఁగల కొండపటము గలదె?

జ్ఞానియై దివ్యమార్గసంసక్తిఁ బోవు
ధన్యుఁడా జ్ఞానసంపద దాఁచికొనక
దివ్యమహిమోన్నతిని జాటి తేజరిల్లు
వెలుఁగనెత్తిన యొంటిదీపిక నెవండు
బుట్టలో డాఁచి చీఁకటిఁ బొరయఁజూచు.

# శాతవాహన వంశీయుల శాసనములు*

భావరాజు వేంకటకృష్ణరావుగారు

శాత లేక సాతవాహనుల శాసనములలో చాలాభాగము, బొంబాయిరాజధానియం దున్న కార్లీ, నాసిక గుహాలందు గాన్పించెను. మిగిలినవి కొన్ని ఆంధ్రదేశమున అమరావతి, కొడవోలు మున్నగు తావులందును లభించెను. వీటి నన్నిటిని ఆంధ్రులచరిత్ర సమూలముగా చదువదలచుకొన్న విద్యార్థులకు ఆంధ్రభాషలో చేతికందివచ్చుటకై యొక్కచోట సంపాదించి ప్రకటింపదలచితిని. ఈ శాసనముల పఠనమువలన ఆ వంశీయుల చారిత్రమే గాక, వారి కాలపునాటి ఆర్థిక, రాజకీయ, సాంఘిక ధర్మపరిస్థితులు మున్నగునవికూడ యెఱుకపడ గలవు. ఆంధ్రులచరిత్ర మనకు మొదట ఆంధ్రజాతీయు లగు శాతవాహనుల చరిత్రతో ప్రారంభ మగుచున్నది. శాతవాహను లాంధ్రజాతివారా యను సంశయము నివర్తితము గాని యీ దినములలో—"శాలివాహన-శక-వర్షము"న కాదిపురుషు డెవ్వడో నిశ్చితముగాని యీదినములలో - చరిత్రాన్వేషణమందు పూర్ణోత్సాహము గల ప్రతివ్యక్తియు చరిత్రాధారములగు నీశాసనములను చక్కగా పరిశీలించి సందేహములను బాపుకొనవచ్చును.

ఇంతవరకు ఆంధ్రదేశములో శాతవాహనుల శాసనములు విరివిగా లభించలేదు. ఈ వంశీయులలో మొదటివారి శాసనములు ఇంచుమించుగా అన్నియు పశ్చిమదేశములందే లభించియుండెను. అందువలన శాతవాహను లాంధ్రులు కారని వాదము చెలరేగెను. కాని యీవాదము సిద్ధాంతము కాలేదు. మన దేశమందు ఇంకను శాలివాహనుల శాసనములు దొరకగల వనునాశ కలదు. చరిత్రపరిశోధనకై సాయపడుచున్న ప్రభుత్వపువారి ఆర్కియోలాజికలు డిపార్టుమెంటువారు దేశమంతటను చుట్టుపెట్టి తిరిగినచో శాతవాహనుల శాసనములు విరివిగా లభించగలవని నా దృఢవిశ్వాసము. ఇంతకు ఆంధ్రదేశమును వారు శ్రద్ధగా పరీక్షించియుండనేలేదు. ఈయుపేక్షకు తోడు కృష్ణాజిల్లాయందలి భట్టిప్రోలు,బుద్ధవని స్తూపములను నిర్మూలములు గావించి యింజనీరింగు శాఖవారు ఆనకట్టలు-లాకులు కళంగులు కట్టుటకు నచ్చటి స్తూపములందలి, కట్టడములందలి చలువరాళ్ల నన్నింటిని పెల్లగించి సున్నము చేసుకొనుటకు కాల్చివేసిరి. ఆరాళ్ల మీద నేవైన యక్షరము లుండెనేమో యీ మహాత్ములు చూచి జాగ్రత్తపెట్టియుండలేదు. మన దురదృష్టవశమున పూర్వము మహాపట్టణములు నగరములుగా నుండిన స్థలము లన్నియు నేడు పాడువారి దిబ్బలతో నిండియున్నవి,

* 'జయంతి' రెండవసంచికనుండి. కైకొనబడినది. నాసికగుహాలందలి యీశాసనములలో నైదు జయంతి రెండు, ఆఱు సంచికలయందు ప్రకటితములు.

దేశమం దెక్కడెక్కడ చూచినను బౌద్ధ కాలము నాటి-అనగా శాతవాహనుల రాజ్య కాలము నాటి-స్తూపములను సూచించు "లంజ దిబ్బలు" అని పిలువబడుచున్న పెద్ద మట్టి దిబ్బలు గానవచ్చుచున్నవి. ఈ దిబ్బల నన్నింటిని ఆర్కియోలాజికలు శాఖవారు దేశ మంతా తిరిగి అన్వేషించి త్రవ్వించినచో నూతనశాసనము లెన్నెని వెలికి రాగలవు.

ఇంతవరకు లభించిన శాసనములను తెలుగున ప్రకటింపవలసినదని, నా మిత్రులు శ్రీయుత కోలవెన్ను రామకోటీశ్వరరావు గారు నన్ను పురికొల్పిరి. వారి యాదేశాను సారము ఈ ప్రయత్నమును సంకల్పించితిని. ప్రాకృతమందున్న శాతవాహనుల శాసన ముల నాంధ్రమునందు ప్రకటించుట కిదియే ప్రథమ ప్రయత్నము. ఈ శాసనములలో నొక్క శాతవాహనులవే గాక వారి సమ కాలీనరాజుల శాసనములుకూడ చేర్పదలచి తిని. వాటి పఠనము ఆంధ్రదేశ చరిత్రమున కావశ్యకమని నా నమ్మకము.

ప్రస్తుతము ప్రకటింప బూనుకొన్నవి నాసిక, కార్లీగుహలలో చెక్కబడినవి. వీటి వెనుక అమరావతి మొదలయిన ఆంధ్రదేశ స్థములయిన తావులందు లభించినవాటిని ప్రచు రింతును. ముందు నాసిక గుహలందలి శాసన ముల నెత్తుకొందును. నాసిక కార్లీగుహల వర్ణ నలకై చదువరి యింగ్లీషుభాషలో బర్గెసు ఫెర్గుసను పండితులు రచించిన "రాక్‌కట్ టెం పిల్సు ఆఫ్ ఇండియా" అను గ్రంథమును, బొంబాయి రాజధానియం దున్న వెస్టర్న్ ఇండియా ఆర్కియోలాజికల్ శాఖవారి రిపో ర్టులలో నాల్గవ సంపుటమును చూచుకొన వచ్చును. మొదట నీశాసనముల నన్నింటిని రాయల్ ఏషియాటిక్కుసొసైటీవారు — బొం బాయిబ్రాంచివారు_తమపత్రికలో (జర్నలు) ఏడవసంపుటమునందు ప్రకటించియుండిరి. ఈ శాసనముల కర్థములుచెప్పి వ్యాఖ్యలు రచించి అందలి చరిత్రాంశములను లోకమునకు స్వీ యులయిన డాక్టరు రామకృష్ణగోపాల భండా ర్కరుగారు ౧౮౭౪ వ సంవత్సరమున "ట్రాన్‌సాక్షన్సు ఆఫ్ ది లండన్ కాం గ్రెసు"నందు వెల్లడించిరి. మరల వీటి నన్ని టిని పరిశీలించి, బూలర్ పండితుని ఆంగ్ల భాషాంతరీకరణములతో సంప్రతించి, పఠించి, దోషములను తన యోపినకొలది సంస్కరించి, డాక్టరు భగవాన్‌లాల్ ఇంద్రాజిగారు చరిత్రాత్మకమైన వ్యాఖ్యను రచించి, 'బొం బాయి గెజటీర్' నాలవ సంపుటమున నాసిక జిల్లా చరిత్రతో చేర్చి వ్రాసియుండిరి. ఈ మూడింటిని పురస్కరించుకొని ఫ్రాంసుదేశీ యుడును, ప్రాకృత సంస్కృతభాషా కోవిదు డును, మహాపండితుడు నగు సేనార్టుమనీషి తిరిగి చక్కగా పరిష్కరించి కీ. శే. లయిన డాక్టరు హుల్షుగారి కోరికపయిన 'ఎపిగ్రాఫి యా ఇండికా' ఎనిమిదవ సంపుటమున ప్రచు రించెను. ఇట్లు ముమ్మారు సంస్కరింపబడిన మూలములబట్టి నేను వాటి నిక్కడ సంపా దించితిని.

ఈశాసనముల నిపుడు ప్రకటించుటలో నాయుద్దేశము ననుసరించి ప్రాకృత భాషా మూలమును, అందులకు గల సంస్కృత ఛాయను, సులభమైన ఆంధ్రీకరణమును ఇచ్చె దను. సంశయాస్పదములును, చర్చనీయము లును అగు విషయములను, పదములను, పేళ్లను వీలయినంతవరకు చర్చించి మతభేద ములను వివరించి, నాయభిప్రాయము నిత్తును. పాఠకులు నామతము ఏమాత్రము యథార్థ మనిగాని, దోషరహితమనిగాని, యూహింప కుందురుగాక. ఆంగ్లభాష రానివారికి సయి తము వీలయినంతవరకు దోడ్పడుట కీప్రయ త్నము తలపెట్టితిని కావున నిది యెంతవరకు సఫలీకృతమైనదో పాఠకులే నిర్ణయింపనర్హులు.

## ౬

(ఇది ఆరవగుహ వసారాకు వెనుకతట్టు గోడపై నున్నది.)

### మూలము: ప్రాకృతము

౧ సిద్ధం విర గహపతిస న్యేగమంస[౧] లెణం[౨]

౨ దెయ ధమ కుటుంబిణియ[౩] చ స నందసిరియ[౪] ఒవరకొ దుహుతు-

౩ య చ స పురిసదతావ ఒవరకొ ఎవ లెణం చతుగభం

౪ ణియుత[౫] భిఖుసంఘస చాతుదిసస నియాచితం.

### సంస్కృతము (ఛాయ)

౧ సిద్ధమ్! వీరగృహపతేః నిగమస్య లేణం

౨ ధేయ ధర్మ్మణం కుటుంబిన్యాః నందశ్రియః అపవరకః దుహిత్రా

౩ చ స పురుషదత్తః అపవరకః ఏవ లేణం చతుర్గర్భం

౪ నియుక్తం భిక్షుసంఘస్య చాతుర్దివసస్య నియాచితమ్.

### ఆంధ్రీకరణము

సిద్ధం. (విజయ సూచకము) ఈగుహ, గృహపతియును నైగముడును (వర్తకశ్రేణి లేక వర్తకనికాయము నకు చెందిన కులజుడు) అగు వీరునియొక్కయు, నిందొక అంతర్భాగము ఆతని భార్య యగు నందశ్రీయొక్కయు, నింకొక అంతర్గుహ కూఁతు రగు పురుషదత్తునియొక్కయు ధర్మములు. చతుర్భాగములుగా నిర్మింపబడిన యీ గుహ మార్గస్థులుగా వచ్చి నాలుగుదినము లుండిపోవు భిక్షుసంఘమునకు సమర్పింపబడినది.

---

౧. గమస. ఇచ్చట అనుస్వారం ఉండకూడనప్పటికిని పూర్ణబిందువును సూచించు నెత్తిపై చుక్క స్పష్ట ముగ గన్పట్టుచున్నది. ౨. లెణ. ౩. కుటుంబినియ. ౪. నందసరాయ అని యొకపాఠ మున్నదిగాని 'నందసిరియ' సరియైన దనుట నిస్సంశయము. ౫. నియుత.

## సంగ్రహవ్యాఖ్య

ఇందు దానపతి 'వీరగహపతి' యని పేర్కొనఁబడినాఁడు. 'గహపతి' యనునది గృహమేధికి పర్యాయపదము. కావున నది యాతని గౌరవమును మాత్రమును సూచించునేగాని యాతని నామములోనిభాగము కాజాలదు. 'గహపతి' అనగా, 'కుటుంబి', 'గృహస్థు' అని యెవరికిని పేర్లుండవు. శైలార్వాడీ శాసనమం దొకచోట 'నందగహపతినా' యని గలదు. జున్నార్ శాసనములలో నొకచోట "పముఘస ధంమ నిగమస" యని యొక దానపతి పేర్కొనబడియున్నాడు. ప్రస్తుత దానపతియగు వీరుడును, జున్నారు శాసనదాత యగు వీరసేనుడును, ఒక్కరేనా యని సందియము కలుగుచున్నది. లిపిభేదములు కొంతవఱకీ సందియమును బాపుచున్నవి. కాని యీ భేదములు దేశభేదములచే కలిగియుండవచ్చునని సమాధానము చెప్పుకొనినను ఉభయదానపతులు నొక్కరే యనుటకు వీలుకలుగదు. కావచ్చును, కాకపోవచ్చును. 'గహపతి' వలెనే 'నెగమ' అనుపదముకూడ నామము కాదనుట నిస్సంశయము. ఉచ్చారణభేదముచేత 'నిగమ' శబ్దము 'నెగమ' యనియు, 'నైగమ' యనియు లేఖకునిచే వ్రాయబడియుండవచ్చును. బౌద్ధయుగమునందు, బౌద్ధసంఘమునందు 'గహపతి' వాచకము అన్నికులములవారును సామాన్యముగ నుపయోగించుచుండిరి. కావున గౌరవమును ధనమును గల వైశ్యకుటుంబములవా రుపయోగించుకొనుటలో విశేష మేమిగలదు? ఇందు వీరగహపతి నైగముడని చెప్పబడుటచేత నాతడు వైశ్యకులజుడనియు శ్రేష్ఠుడనియు నూహచేసితిమి.

## ౭

(ఇది ఏడవగుహయొక్క వెనుకగోడపయిన కవాటమున కెడమప్రక్క నున్నది.)

### మూలము: ప్రాకృతము

౧ భయంత-సవసానం అంతేవా-

౨ సీనియ పవయితాయ తాపసి-

3 నియ చ దేయధమ [లెణ]

౪ చాతు దిసస భిఖుసఘస దతం.

### సంస్కృతము (ఛాయ)

౧ భదంత సవసాన అంతేవా

౨ సిన్యాః ప్రవజితాయాః తాప

3 స్యాః చ దేయధర్మః లేణం

౪ చాతుర్దివసస్య భిక్షుసంఘస్య దత్తం.

### ఆంధ్రీకరణము

ఈ గుహ పూజ్యుఁడైన సవసునియొక్క శిష్యురాలును, పరివ్రాజికయు నగు తాపసిచే నాలుగుదినములుండి పోవుచుండు భిక్షుసంఘముయొక్క నివాసముకొఱకు ధర్మముగా సమర్పింపబడినది.

## సంగ్రహవ్యాఖ్య

ఇందు ఆశ్చర్యకరమయిన విషయములు కలవు. ఈ దానపత్త్రి పేరు తాపసి యని మాత్రమె తెలుపబడినది గాని నిజనామము మఱుగుపరుపబడియున్నట్లు తోచుచున్నది. గురువులనామములను దెలుపుట కింత ప్రయాసపడిన యామె తనపేరేల దెలుపుట కిచ్చగింపలేదో గ్రాహ్యము గాకున్నది. ఆచార్యుని నామము 'సవసన' యని యుండు టాశ్చర్యకరము. అట్టిపేరుండు టెఱుగము. అయినను దానిని 'సావస' యని పాఠము చదివినచో 'సావసక' యను పేరును జ్ఞప్తికి దెచ్చును. అప్పుడు సంస్కృతమున నాపేరు 'సాహర్ష' దనుకోవచ్చును.

(సశేషము.)

---

# ప్రణయజీవి

కొల్లూరు ధర్మారాయ కవి గారు, బి. ఏ. (ఆంధ్రగీర్వాణ సాహిత్యపరిషత్తు)

మానసిక భావములకు సన్మానమిచ్చి
యతురస్వరూపము నిడునట్టి దివ్య
కవన వీణావిలాసినీరవ మదేమొ
నేఁడు నిశ్శబ్దకుహరాన నిద్రఁజెందె;

పూర్వగాథావిధాన సంభూతపూత
దివ్యతేజఃపరీత తంత్రీస్వనంబు
నే నెటులు మేళవించినగాని రాదు!
మీటునందున నాపొరపాటో యేమొ
కాని తంత్రులు పులకితగాత్ర లగుచు

'నీవు కేవల ప్రణయైక జీవి'వనుచుఁ
బలుకునే కాని వేరొండు పలుకవేమొ—

పూర్వవీరుల జీవితములనుగూర్చి
పాడి యలసితివో కవివర! మదీయ
మానసావేశ మాత్మీయ గానమందె
మరగిపోయెను, తుదకట్లె కరగిపోయె;
మధురమగు నొక నేత్రయుగ్మంబునుండి
యంబక పరంపరలువచ్చి యస్మదీయ
హృదయమున నాటె, నాగీత మిందుకొఱకె.

---

క్రీ.శ. 2030 లో - ఆకాశ కంటకులు...



# ప్రభుత్వము—ఇనుపదారులు

అత్తిలి లక్ష్మీనరసింహమూర్తి గారు, బి.ఏ., బి.ఇ.డి.

భారతఖండమున నేటికి సుమారు ౪౦,౦౦౦ మైళ్ల అయోమార్గము లేర్పరుపబడిన వను విషయు మెల్లరెరింగినదే. కాని యీ యినుపదారుల, దేశమునవ్యాపింపజేయుటలో యిండియా ప్రభుత్వమువారి అభిప్రాయ మేమి? వీటిపై వెచ్చించిన ధనము, యే షరతులపై యెచ్చటినుంచి వెచ్చింపబడినది? వీనిమూలమున కృషీవలు డెట్టిలాభమును పొందగలుగుచున్నాడు?

ప్రభుత్వపక్షపాతులు, హిందూదేశము ౧౦౦ కి ౩.౫ మొదలు ౫ వరకుగల స్వల్పవడ్డీకి లండను నగరము నుండి ధనమునుగ్రహించి యినుపదారులు నిర్మించుకొనెననియూ, అందులకుగాను భారతదేశము కృతజ్ఞత చూపింపవలసియున్నదనియూ, పలుమారు నుడువుచుందురు. ఇందుగల నిజానిజములు తర్కించుచో దెల్లమగు. ఈ శైలుదారుల నిర్మించుటకు యిండియాదేశపు ప్రభుత్వము ద్రవ్యము వడ్డీకి పుచ్చుకొనలేదనియూ, యీపైనజెప్పిన తెగవారు వడ్డీయని పొరపడునది, హామీగా (Guarantee) కంపెనీలధనముపై నష్టము సంభవించునెడ ఇచ్చుటకు ఒప్పుకొనిన రేటుయనియు, చెప్పవలసియున్నది. అందుచేతనే యీ రైలుదారులు గవర్నమెంటువి గాక, ఇంగ్లండుదేశపు కంపెనీలవై యున్నవి. వెల్లస్లీ ప్రభువు నాటినుండియు, యీకంపెనీలు హిందూదేశమును అభివృద్ధిచేయుటకుగాను రైలుదారు లేర్పరుచునట్లుగను, సదరు కంపెనీలు యీరైలుదారులపై వెచ్చించినధనముపై వచ్చిన లాభ మనుభవించుటకును, నష్టము వచ్చుచో హిందూదేశపుకర్షకు డద్దానిని భరించి, కంపెనీవారి కట్టినష్టము లేకుండజేయుట యనుపద్ధతి యమలులో పెట్టబడినది. ౧౮౭౨ వ సంవత్సరములో పార్లమెంటరీకమిటీయెదుట సాక్ష్యమిచ్చుచూ థారన్టన్ గారు యీపైపద్ధతిని నిరసించుచూ యీక్రిందివిధముగా నుడివిరి, "హామీ పద్ధతి లేకయే యుండియున్నచో హిందూదేశపు అయోమార్గనిర్మాణార్థము హామీలేనిసొమ్ము (Unguaranteed Capital) హిందూదేశమునకు వెళ్లియుండెడిదని నేను రూఢిగా నమ్ముచున్నాను. ఈ దేశములో ధనము వృద్ధిపొందుటచేతను, సదా విశేషధనము యెవ్విధముగాను యింగ్లాండుదేశమున పెట్టుబడిపెట్టుటకు దారిగానకుండుటచే దక్షిణఅమెరికా మున్నగువిదేశములకు పోవుచుండుట చేతను, అట్టిధన మేల యిండియాను తిరస్కరించునో నేనూహింపనేరకున్నాను."*

ఈకంపెనీలు యీ హామీని పురస్కరించుకొని వ్యవహరించినరీతి యొక్కింత విచారింతము. వీరు సహజముగా నష్టముపొందకుండినను, తమయొక్క యసమర్థత, యనవసరవ్యయములవలన కల్గిన, నష్టమును సుకరముగా హిందూదేశపుపన్నునుండి గైకొనుచుండిరి. విశేషించి వీరికంపెనీలకు గావలసిన స్థలములను ప్రభుత్వమువారు ఉచితముగా ఒసంగుచుండిరి. ౧౮౪౯ మొదలు ౧౯౦౦ వరకు జి. ఐ పి. రైలుదారి హామీ పద్ధతిపైనుండియుండెడిది. ౧౯౦౧ లో గవర్నమెంటువారీదారిని కొనినను ఏకారణముననో యీకంపెనీవారినే తమ

* I do believe unguaranteed capital would have gone to India for the construction of Railways, had it not been for the guarantee. Considering how this country is always growing in wealth, and that an immense amount of capital is seeking investment which it cannot find in England and goes to south America and other countries abroad, I cannot conceive that it would persistently have neglected India.

—India in the Victorian Age, P. 354

తరఫున యేజంట్లుగా నుండునట్లేర్పఱచిరి. సదరు హామీ కాలములో యీకంపెనీ ౧౪.౯౧ కోట్ల రూప్యములు నష్టమును గనబఱచినది. ౧౦౦ కి ౪ చొప్పున యీ నష్టముపై వడ్డీ ౧౮౫౨ మొదలు ౧౯౨౪ వఱకు రు.౯౩,౨౦,౩౭,౭౮౧ లు అయినది. ప్రభుత్వమున కేజంట్లుగా ఈకంపెనీవారు ౧౯౦౧ మొదలు ౧౯౨౩ వఱకు పనిజేసినకాలములో నష్టము ౧.౭౩ కోట్లు. ఈనష్టము లన్నియు హిందూదేశము భరించియుండెనుగదా! కంపెనీ నిజముగా యింతనష్టము పొందినదా యను విషయము నీ క్రిందియంశమునుబట్టి పాఠకు లూహింపనగు. ఈనష్టము ను పొందుచున్నకాలములో ౧౮౫౫ లో యీ కంపెనీ యొక్క ౨౦ పౌనుల షేరు ౨౫ మొదలు ౩౦.౬౨% యొక్కఁనకు అమ్మబడినది. నష్టము వచ్చుచుండిన కంపెనీ యొక్క షేరు, ఖరీదులో పడిపోవుటకుమాఱులకో వృద్ధి గాంచినది!

ఈహామీపద్ధతిక్రింద కంపెనీలు యెట్లనవసర వ్యయమొనర్చుచుండెడివో పూర్తిగా చర్చించుచూ సి.పి. తివారీగారు నవంబరు ౨౯, ౧౯౨౫ లో "పీపుల్" పత్రికలో వ్రాసినసంగతినిబట్టి దెలియనగు. ౧౮౮౦ సం.రం వఱకు జి. ఐ. పి. రైల్వేకంపెనీవారు ఒకమైలు రైలుదారి నేర్పరచుటకు రు. ౧,౯౫,౯౪౫ లనువెచ్చించిరట. తోటి నాగపూర్—ఛాటిస్‌గార్, ధాండ్-మన్మాడ్ ప్రభుత్వపు రైలుదారులు (Nagapur- Chhatisgarh and Dhond-Manmad state Railways) మైలునకు వరుసగా రు. ౫౭,౩౧౫ లును, రు. ౭౧,౭౫౬ లున్నూ ఖర్చుపెట్టినవట. ఎంతవ్యత్యాసము!

౧౮౮౩ లో ఎ. కె. కొనెల్‌గారు "The Economic Revolution of India" యను పుస్తకములో వ్రాసినసంగతులెంతయు ఈ సందర్భమున విచారణీయములు. వీరిప్రకారము ౧౮౮౦-౮౧ సం.నకుహామీ రైలుదారుల పెట్టుబడిధనము ౯౬,౭౯౪,౨౨౬ పౌన్లు. ఇందులో ౪౬,౯౧౮,౧౭౭ పౌన్లు యింగ్లండునుండియు ౪౯,౮౭౬,౦౪౯ పౌన్లు యిండియా నుండియు నై యున్నది. కాని వడ్డీ సుమారు ౨౮,౦౦౦,౦౦౦ పౌన్లు యింగ్లాండునకే పంపబడినది.

ఇంతధనము వెచ్చించి తెచ్చుకొన్న అయోమార్గములవలన హిందూదేశస్థులు యీరైళ్లలో నెట్టి సౌకర్యములను పొందగలుగుచున్నారో యందరకునూ దెలిసియే యున్నది. దినమున కొక్కపూటయైనను సరియగు తిండి లేని భారతీయులు ౧, ౨ తరగతులలో ప్రయాణ మొనర్పలేరుగదా! మనము ౩ వ తరగతి రైల్వేప్రయాణీకుల సభ లెన్నిచేసి ప్రజాసౌకర్యార్థ మెన్ని తీర్మానములలో రైల్వేకంపెనీవారిని ప్రార్థించిననూ వారు సరకుగొనకున్నారు గదా! కాని యీ ౩ వ తరగతి ప్రయాణీకుల మూలముననే డి. ఇ. వాచాగారి ప్రకారము రు. ౧౩ కోట్లు సాలునకు రైల్వే కంపెనీలకు చెందుచున్నట్లు దెలియుచున్నది. ఇంచికేప్ కమిటీవారుగూడ ప్రభుత్వము వారి రైల్వేవిధానము తీవ్రముగా ఖండించి యనవసరముగ ఖర్చుపెట్టుచున్నారనియు, రైలుదారులపై నష్టము వచ్చుట కవకాశము లేదనియు, ౫¼ లేక ౬% లాభము తీయ ప్రయత్నము లొనర్పవచ్చుననియు దెలిపియున్నారు.

ఈ రైలుదారుల నిర్మించుటలో ఉద్దేశములు ప్రభుత్వము దెలుపునవి రెండు. మొదటిది: ప్రజల రాకపోకలసౌకర్యార్థమునూ, వర్తకవ్యాపారము లభివృద్ధి గావించుటకునూ, తద్ద్వారా గవర్నమెంటునకు లాభము కల్గుటకును అయియున్నది. రెండవది: దేశములో నెచ్చటనైన క్షామము సంభవించునెడ యచ్చోట గల ప్రజాపీడా నివారణార్థమునై యున్నది. ఇక ఇందునొక్కసూత్రము గలదు. మొదటిదానిపై వెచ్చింపబడుసొమ్మునకు లాభము వచ్చుటకు వీలున్నదిగాన అందులకు వలయు పెట్టుబడి ధనము తగువడ్డీకి తీసికొని అట్టి రైలుదారుల నిర్మించుచుందురు. గాని క్షామనివారణార్థ మేర్పరుపబడిన రైలుదారులవలన యెల్లపుడును నష్టమే సంభవించుట సహజమై యుండుటచే ప్రభుత్వము, పైనజెప్పబడిన మొదటిరకపు రైలుదారుల నిర్మాణార్థము కైకొను అప్పు మరతులకు వలెగాక, యిట్టిరైలుదారుల నిర్మించుటకు దమ సంవత్సరపురాబడినుండి పెట్టుబడి పెట్టుట ముఖ్యావసరమై యున్నది.

ఇక వీని లాభాలాభములగూర్చి యించుకవివరించి విరమించెద.

ఈ యినుపదారులు, దేశాంతర్గత భాగములనుండి వర్తకపుదినుసులను సముద్రతీరములకు గొంపోవుచున్నవి; రేవుపట్టణములనుండి విదేశములనుండి దిగుమతియైన సరకులను దేశమునందలి ప్రతిపట్టణములకునూ చేర్చుచున్నవి. హిందూదేశమున స్వేచ్ఛావాణిజ్యపద్ధతి (Free Trade) ఇండియాగవర్నమెంటువారిచే నమలులో నుంచబడినది. ఈ Free Trade పద్ధతినిగూర్చియు, అయోమార్గవ్యాప్తినిగూర్చియు కౌన్సెల్ గారి యభిప్రాయ మీక్రింది వాక్యములఁ బొందుపఱుపబడినది.

“హిందూదేశము తనకు వలయు బట్టలను తానే సప్లయి జేసికొనుచుండెడిది. ఇప్పుడో, ఇంగ్లాండు పంపుచున్నది. హిందూదేశపు నేతగాండ్ర విశేషము రాబడి, స్వల్పధరలకే విదేశపుబట్ట వచ్చుచుండుటచే అంతమొందినది. విదేశములనుండి దెచ్చుకొనుసరకులకు మాఱుగా భారతదేశ మాహారపదార్థముల నెగుమతిచేయ మొదలిడినది.... ఈపనికి రైలుదారు లావశ్యకమై, విశేష పైకము వెచ్చింపబడినది. ఈదినమున హిందూదేశమునకు విదేశపుబట్ట దిగుమతి, ఆహారపదార్థముల యెగుమతి మానినచో హిందూదేశమునకు లాభమును, గవర్నమెంటు వారికి కలతయును కల్గును................ప్రభుత్వపక్షపాతులు క్షామకాలములలో ఈరైలుదారు లాహారము లేనిస్థలముల కాహారమును గొంపోయి ప్రజాసౌఖ్య మొనగూర్చుటనుగూర్చి యుగ్గడింతురు. మఱియు, బొంబాయి, మద్రాసు, పశ్చిమోత్తరపరగణాలలోని ప్రజలు రైలు లేనిచో గతకఱవుకాలములలో యేమై యుండురని వారందురు. నా జవాబేమన, ఏమైనది? రైలుదారులు తాము మున్నుగొంపోయిన యాహారపదార్థము లాయాస్థలములకు మఱల నాలుగురెట్లువెలతో తెచ్చియిచ్చినమాట నిజము.

........................

రైలుదారులే యాహారపదార్థముల గొంపోకుండినచో దేశాచారప్రకారము పాతర్లువేయబడిన యాహారపదార్థములు క్షామకాలములలో నుపయోగపడుచుండెడివి. రైలుదారు లమలులనకు వచ్చినపిమ్మట కర్షకుడు వెంటనే యెదురుగానచ్చు లాభమునకు భ్రమసిగాని, పన్నుల యొత్తిడివలనగాని, దనపంటను విక్రయించి పూర్వమువలె యాహారమును నిలువజేయుటకు మాఱు ధనమును నిలువజేయుచున్నాడు. కాని నగలుగాని, రూప్యములుగాని భుజింపలేడుగదా. ‘క్షామ-కమీషనర్లు’ యిందుమూలముననే రైతు కఱవుదినములలో నాలుగురెట్లు యిచ్చుచున్నాడనియు, మొదట ఎక్కువవెల కమ్మినను, తుదకు లాభము నొందుట లేదనియు, యభిప్రాయ మిచ్చియున్నారు. భూమిలేని కూలివారు ధర వారి కందుబాటులో లేకుండుటచే మిక్కిలి క్షోభించుచున్నారు. ప్రజాసమూహమునకు సహజశత్రువులగు యుద్ధము, క్షామము రైల్వేలపై పెట్టుబడిపెట్టిన విదేశస్థులకు దేవదూతలు, పరమమిత్రముగా నున్నవి. హిందూదేశమునుండి రైల్వేలపై పెట్టిన పెట్టుబడిసొమ్మునకు వడ్డీక్రింద నిచ్చుటకుగాను, పన్నుమూలముగా ౩౦,౦౦౦,౦౦౦ పౌనులు పిండబడినవి. ఆ సొమ్మే రైతులచేతిలోనుండుచో కఱవుకాలమున సులభముగా నాత్మరక్షణ మొనర్చుకొనుచుండెడివారు. గవర్నమెంటువారిది గుర్తింపక యింకనూ మరలరాబోవు క్షామనివారణార్థమయి రైలుదారు లభివృద్ధిచేయవలసినదిగా చెప్పుచున్నారు. పాపము, ఊరకే యయాచితముగా దయారసపూరితులై బ్రిటీషుధనికులు రైలుదారులు నిర్మించిరనియే కాని, హిందూదేశప్రజలువిశేషముపైకమును పన్నులరూపమున తామిచ్చితిమని దెలియకున్నారు. అదిగాక, క్షామకాలమున ప్రజలు జీవించునిమిత్తము రైల్వేలకై తేనేమి, తదితరములకై తేనేమి హిందూదేశము ౧౫,౦౦౦,౦౦౦ పౌన్లు ఇచ్చి యుండినప్పటికిన్నీ ౫౦,౦౦,౦౦౦ జనము చనిపోయిరి.”

ఈ పైవ్యాసమున విశేషకృషి సల్పిన మహనీయులయొక్క యభిప్రాయములను కొలదిగా పొందుపఱచుచూ, గవర్నమెంటువారియొక్క రైల్వే పద్ధతిని గూర్చి వ్రాసియుంటిని.

---

# హిందూదేశ పారిశ్రామికాభివృద్ధి

చావలి వెంకట హనుమంతరావుగారు, యం. ఏ.; యఫ్. ఆర్. ఇ. యస్. (లండను)

౧

హిందూదేశపరిశ్రమల నభివృద్ధిచేయుటకు ముఖ్యవిధానము సంరక్షణమై యున్నది. మన పరిశ్రమలు పెంపొందుటకు విదేశపరిశ్రమలపోటీ ఎక్కువగ నున్నదనియు, దానినితొలగించినకాని లాభము కలుగదనియు మనము చాలకాలము క్రిందటనే గ్రహించితిమి. మన ప్రభుత్వము జాతీయప్రభుత్వము కాకపోవుట వలనను, ఆప్రభుత్వమువారు లంకాషైరు మొదలగు బ్రిటిష్‌పరిశ్రమల శ్రేయోభివృద్ధినే వాంఛించుచు వారి చేతుల్క్రింద నుండుటవలనను, దేశీయపరిశ్రమలకు తగిన పోషణ లేకపోవుటయు, ఆకారణముగ నవి క్షీణించుటయు జరుగుచున్నది. కొద్దికాలముక్రిందట హైందవవాణిజ్యసంఘమున కధ్యక్షత వహించిన బిర్లాగారు ఈవిషయమై చాల గట్టిగ నుడివియుండిరి. ఇతరవర్తకప్రముఖులును, ఆర్థికశాస్త్ర పండితులునుకూడ చాలమంది ఆవిషయమై ఏకాభిప్రాయులై యున్నారు. హిందూదేశమునకు ప్రస్తుతము కావలసినది జాతీయప్రభుత్వమును, ఆప్రభుత్వమువారిచే అమలులో నుంచబడు సంపూర్ణరక్షణ విధానము నై యున్నది. ప్రభుత్వమువారు తాముచేయు ప్రతికార్యమందును జాతీయజీవనమును పునరుద్ధరించుటకు ఉత్సాహవంతులుగ నుండినకాని మన దేశీయ పరిశ్రమాభివృద్ధి జరుగుటకు కాని, ఆర్థికస్థితి బాగుపడుటకుకాని అవకాశములు లేవు.

* * * *

ఒక్కబట్టలపరిశ్రమ విషయమై ప్రస్తుతమాలోచింతము. ఈపరిశ్రమ మన దేశీయపరిశ్రమలలో ప్రధానస్థాన మాక్రమించుచున్నది. పూర్తిగ మన దేశములోని మూలధనముతోడనే ఇది సాగించబడుచున్నదని చెప్పవచ్చును. మొదటినుండియు లంకాషైరువారి ఒత్తిడి దానికి ఎక్కువగా నుండెడిది. లంకాషైరువర్తకుల విన్నపముపైన ప్రభుత్వమువారు దానికి సహాయము చేయుటకు బదులు హిందూదేశపు మిల్లులలో తయారగుచుండిన సరకుపై ఎగుమతిపన్నును విధించుచువచ్చుచుండిరి. ఆపన్ను ౧౯౨౫ సంవత్సరములో మిల్లుయజమానుల ఆందోళనపై తొలగించబడినది కాని అప్పటినుండియు జపానుమిల్లుపరిశ్రమపోటీ ఎక్కువయై ఎప్పటి నీరసస్థితిని తొలగిపోకుండునట్లు చేసెను. మిల్లుయజమానులు జపానుదేశపు పోటీనుండి రక్షణకావలయుననియు, దానివలన పరిశ్రమకు చాలనష్టము వాటిల్లుచున్నదనియు; తమ పనివాండ్రకు కూలి ఎప్పటికప్పుడు ఈయ లేకపోవుచున్నామనియు అనేకపార్లు కోరి

యుండిరి. దానిపై ప్రభుత్వమువా రొకప్రత్యేక సుంకములవిచారణసంఘమును(Textile Tariff Board) ఏర్పాటుచేసి వారి రిపోర్టుపైన కొంత సౌకర్యమును కలుగజేయుటకు పూనుకొనిరి. కాని వారియుద్దేశము పూర్తిగ త్యాగబుద్ధితో కూడుకొని యుండలేదు. జపాను దేశపు పరిశ్రమ పోటీనుండి హిందూదేశపరిశ్రమను రక్షించుసందర్భములో లంకాషైరు పరిశ్రమకు లాభము కలుగచేయుటకు ప్రభుత్వమువారు వన్నాగము పన్నిరి.* ౧౯౧౯ సంవత్సరములో మాంటెగ్యూసంస్కరణములను విచారించుట కేర్పాటయిన జాయింటుపార్లమెంటరీసంఘము (Joint Parliamentary Committee) వారు హిందూదేశములో పరిశ్రమాభివృద్ధికి కావలసిన విధానము నేర్పాటుచేయుటకును, ఆచరణయందుంచుటకును సాధ్యమైనంతవరకు ఇండియా ప్రభుత్వమువారికే అధికార ముండవలెననియు, ప్రభుత్వమువారును శాసనసభవారును ఏదేని యొకవిధానము విషయమై ఏకాభిప్రాయమునకు వచ్చినప్పుడు ఇండియామంత్రి దానిలో ఏవిధమునను కలుగచేసికొనకూడ దనియు వ్రాసియుండిరి. కాని ప్రభుత్వమువారు బట్టల పరిశ్రమసంరక్షణ సందర్భములో ఈ పరిశ్రమ విధానపు అగ్రిమెంటు—ఫిస్కల్ కన్వెన్షను (Fiscal convention)కు విపరీతార్థము ను కల్పించి తమ అభిప్రాయములకు తగినట్లు దానికి అర్థము చెప్పిరి. దానిపై పండిత మాళవ్యా బిర్లా మొదలగు అసెంబ్లీ సభ్యులు తమ అసమ్మతిని తెల్పుటయు, ప్రభుత్వమువా రాఅసమ్మతిని లెక్కపెట్టకపోవుటచే మాళవ్యాప్రభృతులు అసెంబ్లీసభ్యత్వమునకు రాజీనామా నిచ్చుటయు మొన్నమొన్నటి విషయములే కాన విపులముగ వ్రాయ నక్కరలేదు

* * * *

కాని ఒక్కసంగతిమాత్రము మనము జ్ఞాపక ముంచుకొనవలెను. హిందూదేశమునకు సంపూర్ణమైన ఆర్థికస్వాతంత్ర్య మీయబడినగాని మన పరిశ్రమాభివృద్ధి సక్రమపద్ధతులపై జరుగుట వట్టిమాట. ఆర్థికస్వాతంత్ర్యముండినప్పుడు ఏవిధానమును ప్రభుత్వమువా రవలంబించిన హిందూదేశమునకు ఎక్కువ లాభము కలుగునో ఆలోచించుట కవకాశ మేర్పడును. ఇప్పుడు ఇంగ్లాండునందు కొంతమంది కన్సర్వేటివ్ పక్షీయులు బ్రిటిషుసామ్రాజ్యస్థదేశములకుమధ్య అడ్డంకులులేక వర్తక వ్యాపారము సాగినకాని బ్రిటన్ దేశమునకు నిరుద్యోగసమస్య మొదలగు కష్టములనుండి మోక్షసాధనము లేదనియు, అట్టివర్తకపద్ధతిని ఇంగ్లాండు ప్రభుత్వమువా రవలంబించవలెననియు ఆందోళన సల్పుచున్నారు. కాని వారి ఆందోళన కాదేశమునందే ఎక్కువ ఆమోదము లేకుండ పోవుచున్నది. ఇతరసామ్రాజ్యాంతర భాగములగు ఇండియా, ఆస్ట్రేలియా, దక్షిణ-ఆఫ్రికా దేశము లంతకుముందే అట్టి విధాన

* ఈ విషయమై పూర్తిగ మే నెల 'భారతి'లో నేను వ్రాసిన వ్యాసమునందు చర్చించి యుంటిని.

మునకు వ్యతిరేకములుగ నుండునని వేరుగ చెప్ప వలయునా? కాని ఇతర సామ్రాజ్యాంతర భాగములకు ఆర్థికస్వాతంత్ర్యము పూర్తిగా నుండుటచే వాటినేమియు ఇంగ్లీషు ప్రభుత్వమువారు చేయలేకపోయినప్పటికిని, హిందూదేశమునకట్టి స్వాతంత్ర్యము లేకపోవుటచే మనలను నిర్బంధపెట్టవచ్చును. సైమనుకమీషనువారు తమ నివేదికయందు ఫిస్కల్ కన్వెన్షను (Fiscal Convention) నుగురించి వ్రాయుచు ఏయే విషయములలో ఇండియా మంత్రి కలుగజేసికొనవచ్చునో ఏయేవిషయములలో కలుగజేసికొనగూడదో అది ఆతనిబుద్ధికే వదలివేయవలెననియు, దానినిగురించి ఏవిధమైన కట్టుబాట్లుగాని నియమములుగాని ఉండకూడదనియు వ్రాసియున్నారు. దానినిబట్టి వారియుద్దేశము ఇండియా మంత్రియొక్క అధికారమును ఎప్పటిమాదిరిగనే నిలువబెట్టవలెనని స్పష్టమగుచున్నది. సైమను కమీషనువారి సూచనలు ఇతరవిషయములలో భారతదేశాభిప్రాయమునకు ఎంతవిపరీతముగ నున్నవో అందరకును తెలిసినవిషయమే. కాని ఈసందర్భములో వారు పైనచెప్పిన సూచన చేసిరనుటలో ఆశ్చర్యమేమియు లేదు.

* * * *

ఈరక్షణపద్ధతి ననుసరించుటలో వేరొక సంగతి మనము జ్ఞాపక ముంచుకొనవలసియున్నది. మారకపు రేటు ప్రభుత్వమువారి ఇష్టమువచ్చినట్లు హెచ్చించుటకు తగ్గించుటకు అవకాశము లుండుటవలన మనదేశపు ఆర్థికస్థితి నీరసించుటకు ఒకరాజమార్గ మేర్పాటయినదని చెప్పవచ్చును. రూపాయ మారకమును మనదేశపు వర్తకప్రముఖులందరును ఎదిరించుచుండగా మూడుసంవత్సరముల క్రిందట షిల్లింగు నాల్గు పెన్సులనుండి షిల్లింగు ఆరు పెన్సులకు హెచ్చుచేయుటచే ఈదేశమునుండి ఎగుమతియగు ధాన్యము, ప్రత్తి, జనుము మొదలగు వస్తువుల ఖరీదులో రూపాయకు రెండు అణాలు చొప్పున వర్తకులకు నష్టమువచ్చుచున్నది. ఒక విధమైన ఎగుమతిసరకుకు ఇదివరలో మనదేశస్థులకు ౧౫ రూపాయలు వచ్చుచుండగా ఇప్పుడు హెచ్చుమారకము మూలముగ సుమారు రు. ౧౩-౧౨-౦ లు మాత్రము వచ్చుచున్నవనిన ఈమారకములో మార్పువలన ఎంతనష్టము గలుగుచున్నదో స్పష్టమగును. ప్రస్తుతము మనదేశపు విదేశవర్తకము దీనస్థితిలో నున్నదనిన దానికొక ముఖ్యకారణము ప్రభుత్వమువారి మారకపురేటువిధానమే. వర్తకులు సరకును ఎగుమతిచేయుట కిష్టపడకయున్నారు. సరకంతయు బజారులో బేరములేక పడియున్నది. ఇప్పటికైనను ప్రభుత్వమువారు తమ పట్టుదలను వదలి మారకపురేటు తగ్గించెదరేమోయనుటకు సూచనలేవియు కానవచ్చుటలేదు.

* * * *

హిందూదేశ పరిశ్రమాభివృద్ధి సక్రమముగ జరుగవలెనన్న దానికి కావలసిన ముఖ్య

పరికరములలో ధనసాహాయ్య మొక్కటై యున్నది. మన దేశపరిశ్రమలలో ఎక్కువమొత్తము విదేశధనసాహాయ్యమువలన పోషింపబడుచున్నవి.— విదేశస్థులు ముఖ్యముగ ఇంగ్లీషువారు—మన దేశమందు స్థావర మేర్పాటుచేసుకొని వారి దేశమునుండి మూలధనమును గొని వచ్చి ఇచ్చట ఫ్యాక్టోరీలు, మిల్లులు స్థాపించి పరిశ్రమల నభివృద్ధిచేసి వాటివలన వచ్చులాభమునంతను తమతమ దేశములకు తీసికొనిపోవుచున్నారు. ఇట్లు మన దేశములో పరిశ్రమాభివృద్ధికై పెట్టిన పెట్టుబడిలో విదేశమూలధనము సుమారు ౧౨౦౦ కోట్లు రూపాయిలుండునని మనము అంచనా వేయవచ్చును. ఈధనముపై వచ్చురాబడి పైదేశములకు పోవుటయేకాక దానికి వడ్డిక్రింద ప్రతిసంవత్సరమును సుమారు ౭౦ కోట్ల రూపాయలు మనము విదేశస్థులకు చెల్లించవలసి వచ్చుచున్నది. ఈ సందర్భములో మన మాలోచింపవలసినది మన దేశములో పరిశ్రమాభివృద్ధికి కావలసిన ధనము లేదా యనువిషయమై యున్నది. హిందూదేశమునందు మూలధనము లేదనువాదము వట్టి నిర్హేతుకమైనట్టియు, నిస్సారమైనట్టియు వాదనమై యున్నది. కాని దేశమందు కలధనమును సరియగువిధమున బయటకు తీసికొనివచ్చి పరిశ్రమాభివృద్ధికై దానిని వ్యయపర్చుటకు తగిన సాధనములు సదుపాయములుమాత్రము కావలసినన్ని లేవని మన మొప్పుకొనవలసి యున్నది. అట్టిసాధనములు కల్పించి సదుపాయములు చేయుటయే ప్రస్తుతము కర్తవ్యాంశమని వేరుగ చెప్పవలయునా?

ఇదివరలో మన దేశమందున్న బ్యాంకులు అనగా ఇంపీరియల్ బ్యాంకు, ఎక్స్చేంజి బ్యాంకులు, జాయింటుస్టాకు బ్యాంకులు—ఈ పరిశ్రమలకు పెట్టుబడిధనమును ఏర్పాటు చేయుటలో కొంతపనిచేయుచున్నవి. కాని అవి పూర్తిగ ఈపనికిమాత్రమే ఏర్పాటై యుండక పోవుటవలనను, వాటిముఖ్యకార్యప్రణాళికలు వేరుగ నుండుటంబట్టియు పరిశ్రమలకు పెట్టుబడిపెట్టి వాటి నభివృద్ధిచేయుపనియందవి ఎక్కువ శ్రద్ధవహించుటకు వీలులేకున్నది. కాన మన దేశపారిశ్రామికాభివృద్ధికి ప్రధానముగ కావలసినది దేశీయుల ధనముతో ఏర్పాటుచేయబడి ఆపనికొరకే ఏర్పాటు కాబడిన పారిశ్రామిక బ్యాంకులై యున్నవి. అట్టిసంస్థలు ప్రస్తుతము మన దేశములో లేవనియే చెప్పవచ్చును. కొన్నాళ్లక్రిందట ఇప్పుడు గొప్ప ఉక్కు పరిశ్రమనుపెట్టి దిగ్విజయముగ నడుపుచున్న టాటాకంపెనీవారు ఒక బ్యాంకు నట్టిదానిని టాటా ఇండస్ట్రియల్ బ్యాంకు(Tata Industrial Bank) అనుపేరుతో ఏర్పాటుచేసి యుండిరి; కాని ఆసంస్థ కొలదికాలముమాత్రమే పనిచేసి నష్టముపొంది సెంట్రలుబ్యాంకుక్రింద మారిపోయినది. సర్ బాసిల్ బ్లాకెట్ గారు ఇండియా ప్రభుత్వపు ఆర్థికమంత్రిగ నుండగ ఆయన అధ్యక్షతక్రిందపనిచేసిన ‘విదేశపెట్టుబడిధనపుకమిటీ’ (Fxternal Capital Committee) వారి ఎదుట

వచ్చినసాక్ష్యములో హిందూదేశమున కంతకును పరిశ్రమలకు పెట్టుబడిపెట్టు బ్యాంకొకటి యుండవలెనను సూచన చాలమందిచే చేయబడెను. వారు దానినిగురించి పరిపూర్ణాభిప్రాయము నేమియు నీయకపోయినప్పటికిని అట్టి సంస్థయొకటి ముఖ్యావసరమని ఎల్లరును అంగీకరించినదే. దేశము మొత్తమున కంతకును ఒక ఇండస్ట్రియల్ బ్యాంకు నేర్పాటుచేసి దాని ఆదరణక్రింద పనిచేయుటకు ప్రతిరాష్ట్రము నందును రాష్ట్రీయ ఇండస్ట్రియల్ బ్యాంకులను జిల్లా బ్యాంకులను స్థాపించి పనిచేసినచో 'పారిశ్రామిక పెట్టుబడి' ధనసమస్య చాలవరకు పరిష్కారమగును. వ్యవసాయదారులకు పెట్టుబడిధనము సమకూర్చుటకును, వారిని వారి దుర్భర ఆర్థికస్థితినుండి తొలగించుటకును భూమి తనఖా బ్యాంకులు ఎంత అవసరమో పరిశ్రమాభివృద్ధి సక్రమముగ సాగుటకును, పరిశ్రమల నేర్పాటుచేయువారికి కావలసిన మూలధనమును సమకూర్చుటకును పైన చెప్పబడిన ఇండస్ట్రియల్ బ్యాంకు లంతఅవసరము.

*       *       *       *

మన దేశమందు చిన్న చిన్న పరిశ్రమలనేకములు చిరకాలమునుండి యుండినప్పటికిని ప్రస్తుతకాలములో కొంతవరకు వాటికి తగినపోషణ లేకపోవుటవలనను, కొంతవరకు విదేశపుసరకులయొక్కయు, ఇతరమిల్లుసరకులయొక్కయు పోటీవలనను అవి దినదినముక్షీణించుచు వచ్చుచున్నవి. వాటిని పునరుద్ధరించుటవలన దేశమునకు మహోపకారమని వేరుగ చెప్పవలయునా? ఆపనికి పైనసూచించిన బ్యాంకులు సహాయకారులుగానున్నట్లుఇంకేసంస్థలు నుండవను విషయముకూడ నిర్వివాదాంశము. అవి కొద్ది వడ్డీపై చాలకాలమునకు తీర్చుటకు వీలైన అప్పులను తగినంతహామీపైన ఈపరిశ్రమలకు ఇచ్చుచుండిన చాలలాభముగనుండును. ఈబ్యాంకులలో ప్రజాసామాన్యమునకు నమ్మకము కలుగునట్లుగా ప్రభుత్వమువారు కొంత ధనమును డిబెంచెర్ల(Debentures) మూలముగ వాటియందుంచి ఎప్పటికప్పుడు అవి సరిగ పని చేయుచున్నవో లేవో చూచుచుండుట కూడ అవసరము. ఏతైన పరిశ్రమలు స్థాపించినవారు వాటియందు అప్పు తీసుకొనునప్పుడు ఆపరిశ్రమలస్థితిగతులను పూర్తిగ విచారించి వాటికి సహాయముచేయుట అవసరమో కాదో తెల్పుటకు సలహాసంఘములను అచ్చటచ్చట ఏర్పాటు చేయుట ముఖ్యము. తగినంత జాగ్రత్తతోను శ్రద్ధతోను ఈపనియంతయు నిర్వర్తించినచో దేశపరిశ్రమలకు ఎక్కువ ప్రోత్సాహము కలుగుననుటలో సందేహము లేదు.

*       *       *       *

పరిశ్రమాభివృద్ధికి కావలసిన ముఖ్య పరికరములలో పరిశ్రమలలో పనిచేయువారొకరైయున్నారు. ఫ్యాక్టోరీలలోను మిల్లులలోను పనిచేయు కూలివారిని పరిశ్రమ యజమానులు సరిగ చూడకపోవుటచేతను, వారికి తగిన వేతనముల నీయకపోవుటవలనను పరిశ్రమాభివృద్ధికి

చాల ఆటంకము కలుగునని వేరుగ చెప్పనక్కర లేదు. పరిశ్రమాభివృద్ధి సరియైనపద్ధతులపై జరుగకపోవుటచే ఒకేపనికి సంబంధించిన కూలివారి బృందము బయలుదేరుటకుకూడ వీలులేకుండ నున్నది. ఫ్యాక్టోరీలలో పనిచేయువారు పూర్తిగ ఆపనియందే యుండక సాధారణముగ వ్యవసాయపరిశ్రమలమధ్య నూగులాడుచుండుట సామాన్యముగ మనదేశములో జరుగుచున్న విషయము. పరిశ్రమాభివృద్ధి సంపూర్ణముగ జరిగిన, వ్యవసాయము నవీనపద్ధతులపై సాగుచుండిన ఏపనిలో పనిచేయువా రాపనిలో కేటాయింపుగ నుండుట తటస్థించును. అప్పుడే వ్యవసాయముకాని, పరిశ్రమలుకాని ఆటంకములేక వృద్ధిపొందుటకు వీలుండును. పనిచేయువారు అదియు ఇదియుకాని సందిగ్ధావస్థలో నున్నంత కాలము పరిశ్రమ లభివృద్ధి పొందజాలవు; దానివలన పనిచేయువారలకుకూడ అనేకనష్టములు కల్గును. పనిచేయువారి సమస్యలన్నియు చర్చించుట కిది తావుకాదు. పరిశ్రమాభివృద్ధికి సంబంధించినంతరకు మాత్రమే వారి సంగతి చర్చించుట అవసరము. ఏపనికైన ధనమెంత ముఖ్యమో మానవసహాయము కూడ అంత ముఖ్యమైనదే. మనదేశ పరిశ్రమాధికారులు ఈసంగతిని గమనించి ప్రవర్తించిన దేశక్షేమమునకు చాలసహాయము చేసినవారగుదురు.

---

## విరహావతి

వేంకట కాళిదాస కవులు (ఆంధ్రగీర్వాణసాహిత్యపరిషత్తు)

చిక్కువడి మాసిపోయి నీ చికురజాల
మకట, సంస్కారశూన్యమై యమరు నేల?
తేనియలు ద్రావ బూవుపొత్తిళ్ల జేరి
ధూళి నొదిగిన షట్పదపాళి రీతి.

సహజరూపలావణ్యతేజములతోడ
శోభితమ్మగు నీవయఃప్రాభవమ్ము
దాగియున్నది నీవిషాదపు గలంత
లల్లుకొనియున్న భావోదయముల తెరల.

కానబడనివస్తువునకు గాంక్షలూర
వెట్టియన్వేషణమ్ము గావించునట్లు
విరహవైవర్ణ్యవైముఖ్య పరిచితమ్ము
లైన కన్నుల ద్రిప్పుచు నరసెదేల?

గళితవలయమ్ములైన నీకరము లిప్పు
డనుగుణములగు సంజ్ఞల నభినయించి
తావకహృదంతర రహస్యభావనముల
నొక్కటొక్కటె యెరిగించుచున్న వబల!

ఏమనోజ్ఞగళమ్మున కింతి, నీదు
కేలుదోయి మ్లానత లేని పూలమాల
యై వెలుంగునో? యపుడు నవ్యప్రమోద
చిహ్నములు నీముఖమున వసించునేమొ?

ఆగవాక్షమ్మునొద్ద నిత్యము వసించి
వీథి గన్గొందు వేటికి విసువులేక,
మార్పులేని నయనయుగ్మమ్ముతోడ,
సఫలమేకాని వాంఛాప్రసక్తితోడ?

సాంధ్యవేళల నెన్నియొసారు లేను
నిన్ను గనుగొంటిగాని తన్వీలలామ,
నీవ్రతమ్మున కర్థమ్ము నీవిచిత్ర
జీవితమ్మున కర్థమ్ము చెప్పలేను.

---

# శిల్పి

జి. జాషువ కవిగారు



చేత మిగురొత్త నొక నల్లరాతిలోన-మలఁచినాఁడవు భయద సింహముల తలలు
వసుధ గన్పట్టు సర్వపర్వతములందు-చిత్రముల నెన్నిగతుల జూచెదవో నీవు.

సున్నితంబైన నీచేతి సుత్తెనుండి-బయలువడె నెన్నియెన్ని దేవస్థలములు
సార్థకముగాని యెన్నిపాషాణములకుఁ-గలిఁగె నీనాఁడు పసుపుఁగుంకములపూజ.

కవి కలంబునఁ గల యలంకారరచన-కలదు కలదోయి; శిల్పి! నీ యులిముఖమున
కాకపోయిన నీ రాతికంబములకు-కుసుమవల్లిక లేరీతి గ్రుచ్చినావు?

ప్రతిమలు రచించి యొక మహారాజుచరిత-వల్లెవేయింపఁగలవు చూపరులచేత
కవనమునఁ జిత్రములు గ్రుద్దు కవికి నీకు-తారతమ్యంబు లేదబద్ధంబుగాదు.

రాల నిద్రించు బొమ్మల మేలుకొలిపి-యులిని సోకించి బయటికి బిలిచినావు
వెలికి రానేర్చి నీపేరు నిలుపకున్న-శాశ్వతుఁడవోయి నీవు నిశ్చయము గాను.

తల యెత్తెన్‌గద నీదు చాతురి యజంతాగహ్వరశ్రేణిఁ గే
వల పాషాణములందు, జీవకళ నిల్పంజాలు నీసుత్తెలో
మొలుచు న్మానవవిగ్రహంబులు మహాపుణ్యుండవోయీ! హరి
త్తులు నీ బొమ్మలచెంత ముగ్ధగతినందున్ శిల్పికంఠీరవా!

ననుపుల్ దీర్చి మదంబు జిందిపడ నేన్గుం గున్నలం జెక్కి వై
చిన చాతుర్యము నీ శిరోగ్రమున నిల్చెన్ సత్కిరీటాకృతిన్
తెనుఁగుందేశము నిన్నువంటి పనివానిన్ జూచి యుప్పొంగుచుఁ
డును, నీలేమిఁ దలంచి కంటఁ దడిబెట్టున్, శిల్పవిద్యానిధీ!

తెలిరాతన్ జెలువార నచ్చరపడంతిన్ దిద్ది యాసోగక
న్నులపజ్జన్ నిను నీవు దీర్చుకొని సంతోషించుచున్నాఁడవా!
భళిరే! శిల్పి! జగంబులోనఁ జిరజీవత్వంబు సృష్టించుకో
గల నీకెవ్వఁడు సాటివచ్చును? నమస్కారంబు నీమూర్తికిన్.

---



# శృంగార నైషధము

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

శ్లో. పాణయే బలరిపో రథ భైమీశీతకోమల కరగ్రహమగ్ర్యమ్;
భేషజం చిరచితాశనివాసవ్యాపదా ముపది దేశ రతీశః.

ఇంద్రునిచేతికి మన్మథుఁడు చిరకాలాశనివాసమునఁ గలిగిన వివాహములఁ బోవుటకై దమయంతీకోమల పాణిగ్రహణము నుపదేశించె ననునది యీ శ్రీహర్ష శ్లోకములోని సముచితకల్పన. దీనిని శృంగారనైషధకర్త యిట్లు మార్చెను.

మ. పవిసంగంబునఁ దాపమొందిన శచీ
    ప్రాణేశు కెంగేలికిన్
  శివురుం గై దువుజోడు వైద్య ముప
    దేశించెన్ రహస్యంబుగా
  నవనీహార పయోమిళన్మలయజ
    స్నానార్ద్రపర్యంతమై
  యివతాళించు విదర్భరాజతనయా
    హృద్య స్తనద్వంద్వమున్.

౫ ఆ. ౭౨ పద్య.

పాణిగ్రహణము మందుకాదనియెంచి యివతాళించు స్తనద్వంద్వము మందని మురిసికొను కవి నైషధమును శృంగారనైషధ మనుకొనినాఁడనుట యెంతయుఁ బొసగి యున్నది.

  భీమజా చ హృది మే పరమాస్తే
    జీవితాదపి ధనాదపి గుర్వీ;
  న స్వమేవ మమ సా ఽర్హతి యస్యా
    షోడశీమపి కలాం కిల నోర్వీ.

ఇంద్రాగ్నియమవరుణులు తన్నర్థించునపుడు నలుఁ డనుకొనుమాట యిది:

"జీవితముకన్నను ధనముకన్నను మిన్నయైన దమయంతి నా హృదయమునఁ గలదు. భూమి యామె పదియాఱవభాగమునకైనఁ దగదు. కాని యామె యింతవఱకు నాసొత్తు కాలేదు."

ఈ యంశము శృంగారనైషధమున నిట్లు మార్చఁబడె.

క. ప్రాణంబుకంటె భీమ
  క్షోణీపతనూజమీఁదఁ గూర్మిగలదు గీ
  ర్వాణాధీశ్వరుఁ డయ్యలి
  వేణిన్ మదిఁగోరెనేని వేగమ యిత్తున్.

తనసొత్తింకను గాలేదనుమాటను నలుఁడే మఱచెనో, కవి నలునిలోఁజేరి తానే మఱచెనో కాని యున్నాదవ్యభిచారిచే శృంగారస్థాయి మిగులఁ బోషితము. దీనను శృంగారనైషధము కాఁదగు.

౬ సర్గ. ౩ శ్లో.

  భైమ్యా సమం నాఽజగణ ద్వియోగం
    స దూతధర్మే స్థిరధీ రధీశః,
  పయోధిపానే ముని రంతరాయం
    దుర్వారమ ప్యౌర్వ మివోర్వశేయః.

"దూతధర్మనిర్వహణదీక్ష నలునిలో స్థిరపడినది. వియోగమును లెక్కసేయలేదు." అని యిందలి ప్రకృతార్థము. "అగస్త్యుఁడు సముద్రపానసమయమున బడబాగ్నిని విఘ్నముగఁ బరిగణింపలేదు" అని యుపమ. ఉపమానమును బట్టిచూచినను ప్రస్తుతవర్ణనను బట్టి యాలోచించినను నలునియందు శృంగారస్థాయికిఁ బ్రాముఖ్యము

నౌసంగక ధర్మవీరరసస్థాయికే పట్టాభిషేకము సేయవలె
నని శ్రీహర్షుఁడు పూనినట్లు తోఁచెడి.

దీనిని శృంగారనైషధ మెట్లు మార్చిచూపుచున్న
దో చూడుఁడు.

విరహభారంబుతోన యుర్వీధవుండు
ప్రబలమగు దేవకార్యభారము ధరించె
నౌర్వశిఖితోన జలరాశి యంబుపూర
మౌర్వశేయుండు ధరియింపఁడయ్యె నెట్లు.

ఇందు శృంగారస్థాయికిని ధర్మవీరస్థాయికిని సరి
యైన తావు నలునం దొసంగఁబడినట్లు ప్రకృతవర్ణనలోఁ
బూర్వార్థమునఁ దోఁచెడి. ఉపమాధ్వని నాలోచించిన
రతికే ప్రాముఖ్యము గన్పట్టు. బడబానలముతోఁ బోల్పఁ
బడినది రతి. అంబుపూరముతోఁ బోల్పఁబడినది దూతధర్మ
దీక్ష. బడబానలము నీటిని బీల్చివేయుచుఁ బొంగకుండఁ
జేయుచున్నట్లు రతి ధర్మదీక్షను బీల్చివేయుచున్నది.
ఇట్టిధ్వనికిముందు వర్ణనములు కవలంబము నిచ్చుచున్నవి.
చూడుఁడు :

దమయంతీసుకుమారపాదకమల
ద్వంద్వార్పణాధన్యకు
ట్టిమహర్మ్యంబగు పట్టణంబపుడు
గంటిఁగా మంటి నం చెంతయుఁగా
ప్రమదం బందె దిగీశకార్యఘటనా
భారంబు చింతించి దీ
క్షము నున్నంబును గానొనర్చె
ధరణీకాంతుండు నిశ్వాసమున్.

ఇందు రసికవతంసమగు నలునియందు శృంగార
స్థాయి రాజ్యముసేయుచున్నట్లును, దూతకృత్య నిర్వహ
ణోత్సాహమును బాధింపఁబోవుచున్నట్లును గన్పట్టు
చున్నది కదా.

ఇంతమాత్రమున నలుని ధర్మవీరత లోపించి య
నౌచిత్యమును గల్గించు ననుకోఁగూడదు. ప్రబలమైయున్న
దమయంత్యనురాగముచే దూతకృత్యము లోపముఁ జేసి
స్వార్థపరుఁడైనచో నలునకనౌచితి వాటిల్లును. అట్లు
సేయలేదు. నైసర్గికమై చిరస్థాయియగు ప్రియానురాగ
మెంతయుం ప్రబలమైయుండినను ఆగంతుకమైన దూత
కృత్యదీక్షను స్వకార్యవిఘాతుకమైనదాని నెంతయు
ధర్మవీరుఁడు కనకనే నిర్వహింపఁగలిగెనని యౌచిత్యమే
సిద్ధించును. నలునికథలో నైషధకావ్యమున శృంగారమే
ప్రధానము. దానిని బలపఱుచుటకే ఆగంతుకమైన ధర్మ
వీరరసమును ప్రస్తుత శృంగారమునకుఁ బ్రతిబంధముగాఁ
గూర్చి ప్రతిబంధకవీరరసమును బాధింపఁగలిగి శృంగార
మే ప్రముఖమయ్యెనని చూపించినాఁడు.

ధ్వన్యాలోకమున నానందవర్ధనుఁ డిట్లు వ్రాసె—

వివక్షితే రసే లబ్ధప్రతిష్ఠేతు విరోధినామ్;
బాధ్యానా మంగభావంవా ప్రాప్తానా ముక్తిరచ్ఛలా.

ఒకరసము ముఖ్యముగనుండ నితరరసము లను
కూలములైన నంగములుగ నుండవచ్చు. ప్రతికూలము
లైన బాధ్యములుగా నుండవచ్చు.

శృంగారనైషధకర్త శృంగారప్రియుఁ డనుట
కింకొక పద్యముం జూడుఁడు:

చ. ప్రిదిలిన నీవిఁ గేల సవ
రించు తలోదరినోర్తుఁ గాంచి లోఁ
గదిరిన పాపభీతిఁబడి
గన్నులుమోడ్చ నొకళ్లొకళ్లకై
యెదురుగవచ్చివచ్చి యొక
యిద్దఱు మద్దియిలొత్తి రవ్విభున్
మదగజరాజకుంభముల
మచ్చరికించు కుచద్వయంబులన్.

దీనికి శ్రీహర్ష శ్లోకముఁ జూడుడు:—

అంతఃపురాంత స్సవిలోక్యబాలాం
కాంచిత్సమాలబ్ధు మసంవృతోరుమ్,
నిమీలితాక్షః పరయా భ్రమంత్యా
సంఘట్ట మాసాద్య చమత్చకార.

'సమాలబ్ధు మసంవృతోరుం' అనుమాటం దీసివేసి
ప్రిదిలిననీవి కేల సవరించుననుట శృంగారపోషక ముగు
మార్పు. కన్నులుమోడ్పఁగ అని నలునియందు ధర్మ

విరుద్ధమైన యనురాగోదయమును దీసివేసినను నాయిక యందు శృంగారానుభావము భాసిల్లుచున్నది. పిమ్మట నొక నాయిక యదృశ్యుఁ డగు నలుఁడు కనుమూసికొని తొలగమిచేఁ గొట్టుకొనెనని స్వభావోక్తిగా శ్రీహర్షుఁ డనెను. మనశృంగారకవి శ్రీహర్షుని యొక నాయిక నిద్దఱిఁగాఁజేసి యూరక కొట్టుకొనుటనుగూర్చి కుచద్వయ ములతో ముందొకరును వెనుక నొకరును నలుని గొట్టు కొనినట్లు వర్ణించుచు శృంగారోద్దీపనవిభావసామగ్రి యగు నా కుచద్వంద్వమును 'మదగజరాజకుంభములు మచ్చరికించు' అను విశేషణముతో జోడించినాఁడు.

ఇట్లు పరికించిన శ్రీనాథనైషధమునఁ జాలచోట్ల శృంగారము ప్రముఖమై శృంగారనైషధ మనుపేరును శ్రీనాథకవి కావలెనని పెట్టెనేమో! అనిపించెడి. నిండు జవ్వనంబున సంతరించిన కబ్బముకదా.

---

## తొలకరి

పెమ్మరాజు లక్ష్మీపతిగారు

ఎక్కటికాలమూర్తి, జగదేకధనుర్ధరు డెక్కుపెట్టి నా
డక్కజమైన యింద్రధను వల్లదె; యాత డమోఘశాసనుం
డొక్కట నిత్యనవ్యవిజయోత్సుకుడై జను, రాచకార్యపుం
జక్కదనంబులోని పరుసందన మేర్పడ సంఘటింపుచుం!

సౌందర్యాస్త్రముచే వియద్వలయ మాశాంతంబుగా గెల్చి; య
స్పందానందరమాసముజ్జ్వలమహీసామ్రాజ్యముం నిల్పి; పౌ
రందర్యాఖ్య ధనుర్లలామము, నిసర్గప్రాభవోపేతమై
యందించుం గనుమీ వసుంధరకు దివ్యాపూర్వసందేశముల్.

వికసనమందుచున్న యరవిందమొ నాజను ధాత్రిపై, జగ
త్ప్రకృతి, నిగూఢభావ భరభంగిమముల్ వెలయించు చిత్రనా
ట్యకలన చూపుచున్నది, విహాయసముం భువియుం వెలుంగగా,
నొకతొలి సంజ తా బొడమెనో! కనుమోయి కృషీవలాగ్రణీ!

పరమధ్యానసమాధినిష్ఠ వెలయం, బంచాగ్ని మధ్యంబునన్,
దిరమై నిల్చి జపించె, నీజనని పృథ్వీదేవి, యుద్దండభా
స్కర దేవుం నడిమెండకాలమున, నీ చైతన్య నవ్యోదయ
స్థిరసౌభాగ్యము నీకు గూర్ప, నది సిద్ధింగాంచె నీనాటికిం!

మూరును సర్వమున్, ప్రకృతిమాన్పులరాసి, యటౌట దానితో
మూరనివార లెందుకును మూర రనుతుణ భిన్నభిన్న శో
భారమణీయముల్ ప్రకృతిభావము, లందలి యర్థమెంచు సం
స్కారులు, కాలచిత్రఫలకంబున గాంతు రనంతసత్యమున్!

రంగులసీమ యీప్రకృతిరాజ్యము సర్వము, దీని గన్నులా
రం గని హాయినొందుచు కరంగుము, నీ కిది దైవదత్త, మే
రంగును లేని నిర్గుణ నిరంజన తత్త్వములో కృషీవలా!
నింగియు లేని సీమ లటు నిచ్చెన లెవ్వడు నిల్పజాలునో!

ఏతరినైన సందియ మెుకించుకయుఁ గనఁబోక, త్వన్మాతలీ
మాతృపదారవిందము లమాయికభక్తి భజించి, భూజన
ప్రీతియొనర్చు శీలమున చేర్చుచు ధన్యతగాంచుచున్న యో
పూతకృషీవలా! హృదయపూర్వకవందనముల్ గ్రహింపుమా!

నీవొక కర్మయోగివి గణింప; త్వదాశ్రమజీవకోటులౌ
గోవృషభాది జంతువులఁ గూర్చి, కృషిం బచరించి, సర్వలో
కావన కర్మయోగరతి గ్రాలెదు; నీ మహనీయతల్ మదిన్
నీ వెరుగంగజాల వవనీరమణీప్రియపుత్రరత్నమా!

నాగలి నీవు చేగొననినాడు సమస్తము నాటకట్టు భూ
భాగమునందు పౌరుషము, పల్కులు వేయును నేల చెప్ప, నీ
త్యాగగుణంబె సర్వవసుధాప్రజ కారయ పట్టుకొమ్మ నీ
నాగలిచాలు వెంబడి సనాతనధర్మము జాడ తోఁచెడిన్!

జనకుడ వీవు, నీ హలముచాలున నుద్భవమందు సీత భూ
జనములపాలి లక్ష్మి, మనుజాశననాశన హేతుభూత దే
వుని సహధర్మచారిణియు, భుక్తియు ముక్తియు నిచ్చుతల్లి; వం
చిన తలయెత్తవింతకుఁ గృషీవల! యెంత యమాయకుండవో!

అదిగో చూడుము రాతిలోపలి యహల్యాదేవి శ్రీరాము స
త్పదరాజీవపరాగమింత తనకుం బ్రాపించునంతన్ నవా

భ్యుదయస్ఫూర్తివహించి మించినగతిఁ పుణ్యాత్మ! నీపాదముల్
కదియఁగ వచ్చిన భూమి నూతనకళాలాలిత్య ముప్పొంగెడిఁ!

కాలము మారిపోయినది కర్షక! యెప్పటియట్ల యింక నీ
కేల భయంబునంద? తలయెత్తుము; చూడుము, నేత్రపర్వమై
నాలుగు దిక్కులన్ మొలచు నవ్యవికాసము, కేలుమోడ్చి యీ
నేలయె, నాయనుంగు జననీమణి యంచు నమస్కరింపుమా!

ఆసతి పుణ్యాద్దీవనల సందిన ధన్యుడనన్న, యాత్మవి
శ్వాసము నీకు గల్గునెడ, స్వర్గము నీయది, భూమి నీది, నీ
దే సుమి సర్వవైభవము, దేవుడవీవ నినున్ జయింప దే
వాసురు లేకమైన వశమౌనె? తలంపుము కర్షకాగ్రణీ!

వ్యవసాయంబున కల్గు కష్ట మదియే హాలాహలం బిట్టి భీ
ష్మ విషం బల్లన దా భుజించి పృథు సస్యశ్రేణి బండించి, యీ
యవనిన్ స్వర్ణముగాగ మార్చియు నిరాహారుండు, నిర్వస్త్రుడ
ర్థవిహీనుం డగు నాకృషీవలుని స్వార్థత్యాగ మేమందునో!

తగినసుతుండు తాను తన తల్లికి భూమికి నింతభారమౌ
జగము భరించు శక్తికి నిజంబుగ, బాధల దా భరించియున్
వగవడు కీడుగోరడిక పండినపంట నరుల్ గ్రహింపగా
మిగిలినదాన ప్రాణములు మేన నెటో భరియించు నిచ్చలున్.

---

# మా వ్యాసకర్తలకు

వ్యాసములు చిన్నసైజు కాగితములపై ఒకవైపున మాత్రమే విడిఅక్షరములతో బంతులు దూరదూరముగా, దిద్దుబాట్లు లేకుండ, తిన్నగా వ్రాసి వర్ణక్రమమునను తప్పులు లేకుండ చూచుకొని పంప వేడికోలు. లేకున్న ముద్రణకార్యములయందు మిగుల కష్టము కలుగుటయే కాక తప్పులుకూడ నిలిచిపోవునని మనవి.

సంపాదకుడు, 'భారతి'

---



# పునర్విమర్శనము



## మనుచరిత్ర రచనాకాలము

చరిత్రాధ్యాపకులు, చరిత్రపరిశోధకులు నగు శ్రీ వెంకటరమణయ్యగారి పునర్విమర్శనకుఁ బ్రత్యుత్తరమీయవలసిన నిర్భరభారము నాపైఁ బడినది. ప్రమోదూత సంవత్సరాదిసంచికయందు వ్రాసిన వ్యాసమునందే, మనుచరిత్రరచనాకాలనిర్ణయము, పారిజాతాపహరణరచనాకాలనిర్ణయమంత సులభము కాదని మనవి చేసుకొంటిని.

శ్రీ వెంకటరమణయ్యగారు తలపెట్టిన వాదములు రెండు; అందొకటి నేను రాయలు గుల్బర్గాపై వెడలిన దండయాత్రనుగూర్చి నేను తలపెట్టలేదని. రెండవది 'ఆంధ్ర కవితాపితామహ' యన్న బిరుదు గ్రంథరచనాకాలమున కంతగా సాయపడదని కొంత సాయపడునని వీరి యభిప్రాయమేమో!

రెండవవిషయమైన బిరుదమునుగూర్చి యాయనకు సమాధానము చెప్పి, మొదటివిషయమైన గుల్బర్గా దండయాత్రగూర్చి వ్రాసెదను.

### పెద్దన 'ఆంధ్రకవితాపితామహుఁ' డెట్లయ్యె?

మనుచరిత్ర గద్యచొప్పున పెద్దన కాంధ్రపితామహ యన్న బిరుదుకూడ లభించియుండెను. ఆయన కా బిరుదు మనుచరిత్ర రచించిన తరువాతనే వచ్చియుండును కాని తత్పూర్వము వచ్చియుండనేర దని నేను వ్రాసిన దానిని నిరాధారమైన వ్రాత యని వారు సెలవిచ్చిరి. ఈ అధిక్షేపమునకు వారు పాఠకమహాశయులకు రెండుకారణములఁ జెప్పిరి. మొదటిది—'పెద్దనగారు సంస్కృతములోను, తెలుగులోను పెక్కుగ్రంథములు వ్రాసినట్లు తెలియుచున్నది అని. వీరి కీ నూతనచరిత్రాంశము నెవరు చెప్పిరి? ఆంధ్రలోక మింక నాగ్రంథముల పట్టిక నెఱుంగియుండలేదు. పెద్దన రచించినదనెడు హరికథాసార మనెడు గ్రంథములోని కొన్ని పద్యములు మాత్ర మాంధ్రలక్షణగ్రంథముల కెక్కినవి. ప్రతి గ్రంథకర్తయు గ్రంథారంభమునందే తా నప్పటికి రచించిన గ్రంథములు పేర్కొనుట, ఆంధ్రసారస్వతపరిచితిగలవారెల్ల నెఱింగినవిషయము. పెద్దన మనుచరిత్రలోఁ దానంతకు ఆంధ్రకవితాపితామహుఁడై విరచించిన గ్రంథముల నొక్కదానినైనను జెప్పుకొనకుండుటకుఁ గల కారణము లేమో? శ్రీ వేంకటరమణయ్యగా రాంధ్రలోకమున కా యుత్తమగ్రంథములఁ దెలిపి, సారస్వత సేవ సలిపెదరుగాక. శ్రీ వేంకటరమణయ్యగారు జూపిన రెండవ కారణము: పెద్దన్న తద్గ్రంథరచనమునకు సంతసించి రాయలు తన కాంధ్రపితామహ యన్న బిరు దిచ్చినట్లు చెప్పుకొనలేదు అని. ఇందులకు వారి సాక్ష్యము రాధామాధవ బిరుదాంకితుఁడైన యల్లయకవి. పెద్దన చెప్పినసేమి? చెప్పకుండినసేమి? అల్లాడభూపతి శ్రీనాథునిగూర్చి కాశీఖండమునం దిట్లు సంబోధించెను.

'అధ్యక్షుండవు గవిసార్వభౌమ భవదీ
య ప్రౌఢ సాహిత్యముల్'

శ్రీనాథుఁడు తా నీగ్రంథమునందు తన కీ బిరుద మెచ్చట యెవ్వ రెందుల కిచ్చిరో, యేల వాకొనలేదు? శ్రీ వెంకటరమణయ్యగారికి, ఆంధ్రకవితాపితామహ బిరుదునుగూర్చి కలిగిన రెండు ధర్మసందేహములకు బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు వేఱొకచోట నిప్పటికి

రెండేండ్లకుఁబూర్వమే యిట్టి సందేహములకుఁ దగిన సమాధాన మిచ్చిరి.

"ఈ కవిశిరోమణికి నాంధ్రకవితాపితామహుఁ డను బిరుదము మనుచరిత్ర రచించినతరువాతనే యియ్యఁబడినది. ఐనను గ్రంథాదియందే కవి ...........

కం. హితుఁడవు, చతురవచోనిధి
వతులపురాణాగమేతిహాసకథార్థ
స్మృతియుతుఁడ వాంధ్రకవితా
పితామహుఁ డెవ్వ రీడు పేర్కొన నీకున్.

అని చెప్పుకొనుట పొసఁగునా, యనవచ్చును. కృతికర్త తొలుదొలుత గ్రంథమును రచించి పిదపఁ దొలిపద్యములు వ్రాయుట యాచారము. ప్రథమమున దేవతాప్రార్థనమ మాత్రము పద్యరూపముననో, ధ్యానరూపముననో రచించి గ్రంథము నారంభించుట కవుల యాచారము. అట్లే పెద్దనయు గ్రంథమును రచించి, వినిపించియుండును. దాని ప్రౌఢిమకు మెచ్చుకొని రసికజనచూడామణి యగు ప్రభుశేఖరుఁ డాంధ్రకవితాపితామహ బిరుదము నిచ్చియుండును. దానిని దన తొలిపద్యములలోఁ గలఁ జేర్చియుండును. అంతియకాని, యీ గ్రంథముకంటె ముందు కొన్ని గ్రంథములవ్రాసి, యా బిరుదము రాఁగాఁ బిదప నీ కావ్యమును రచింపఁబూనె ననుట కుయుక్తిగాని వేఱుగాదు. ఇట్లైయైనచో నీగ్రంథమున నింతకుముందు కొన్నిగ్రంథములు రచించితినని పేర్కొనియేయుండును. ఇట్లనుటచే నింతకుముం దొక్కపద్యమైన నాకవినోటినుండి యూడిపడలేదని భావింపరాదు. ఈయన కవిత్వశక్తి ప్రభుచంద్రునకు బోధపడియుండకపోదు. కాని యాంధ్రకవితాపితామహ బిరుద మిట్టి యుత్కృష్టగ్రంథరత్నమును గైకొని ప్రతిఫలముగా నిచ్చియుండుననుటయే సరసము.[1]"

శ్రీ శేషాద్రిశర్మగారు మా మిత్రుల సంశయముల కెంటికి సమాధానము నొసంగిరని నా మనవి. ఇపు డెవరివ్రాత నిరాధారమైనవ్రాత?

## గుల్బర్గాపై దాడి

శ్రీ వెంకటరమణయ్యగారు సంతతచరిత్రాధ్యాపనపారీణులు. నిరంతరచారిత్రపరిశోధకనిపుణులు. ఈ విషయములో వారితో వివాదమునకు సంసిద్ధుఁడనౌట సమంజసముకాదని తెలిసియు నల్పజ్ఞుఁ డగు నేను, నా నేర్చినంతవఱకు చర్చ నొనర్చెదను.

తీఁగను గదపిన డొంక కదలును. మనుచరిత్ర రచనాకాలమునాఁటికి, కళింగదిగ్విజయము పూర్తి కావింపఁబడెనని నేను వ్రాసితిని. అందులకు వా రొప్పుకొందురు. ఇఁక తద్దిగ్విజయమేగాక, ఇతరవిజయములు సైతము వర్ణింపఁబడినవని వారి నిర్వచనము. కళింగదిగ్విజయము పూర్తి గావింపఁబడిన దని వ్రాసితినే కాని, యితర విజయప్రశంస యందు లేదని నే ననలేదే! తత్కృతిసంగతి కల యాంధ్రు డెవ్వ డట్లనఁడు. అందు వర్ణింపఁబడిన యితరవిజయములు నే నొనర్చిన కాలనిర్ణయమునకుఁ బ్రతిబంధకములా, యనువిషయమే విచారణీయము. శ్రీ వెంకటరమణయ్యగారి యభిప్రాయము ప్రకారము ప్రతిబంధకమని—నేను కాదని—

## ఎట్లు? రాయలు గుల్బర్గాను జయించిన దెప్పుడు?

శ్రీ వెంకటరమణయ్యగారి కీవిషయమై న్యూనిజ్ (Nuniz) వ్రాసిన వాక్యములు ప్రమాణములు — రాయలు గుల్బర్గా (Gulburga) పై దండువెడలిన విషయము న్యూనిజ్ రాయచూరుయుద్ధానంతరము పేర్కొనియుండెను. ఆ యుద్ధము తేదీ స్యూయల్ (Sewell) నిర్ణయించినప్రకారము **16-5-1520.** కావున గుల్బర్గాపై దాడి ఆతేదీ తరువాతనే నడిచియుండవలెను—అని శ్రీ వెంకటరమణయ్యగారి వాదము.

కీర్తిశేషులైన శ్రీ లక్ష్మణరావుగారు 'కృష్ణరాయల కొన్ని దిగ్విజయయాత్రలు' అను వ్యాసమునందు గుల్బర్గాదాడివిషయమై యిట్లు వ్రాసిరి.[2] "గుల్బర్గా

1. శుక్లసంవత్సరాదిసంచిక పుటలు౧౧౦-౧౧౧ 'అల్లసానిపెద్దన' యనువ్యాసము.
2. లక్ష్మణరాయవ్యాసావళి పుట **41-44.**

పట్టణమును యూసఫ్ ఆదిల్ ఖానుఁడు 1504 వ సంవత్సరమునఁ బట్టుకొనెను. అది 1514 వఱకు ఆదిల్ శాహ స్వాధీనమం దుండెను. ఆసంవత్సరమున అమీర్ బరీదు దానిని సాధించెను. అని యిదివఱకున్న చరిత్రములు చెప్పుచున్నవి. కావున నీపట్టణము 1509_1510 లో యూసఫ్ ఆదిల్ ఖానుని స్వాధీనమందే యుండెననుటకు సందేహము లేదు. ఆకాలముననే రాయలు గుల్బర్గా మీదికిఁ బోయెనని తలఁపవలసియుండును. కాని రాయలవారు తిరుపతికివెళ్లినప్పు డచ్చటినుండి గుల్బర్గాకుఁ బోయి వచ్చెనని రాయవాచకమునందుఁ జెప్పఁబడియున్నది... ......ఇదియే నిజ మనుకొనినయెడల రాయలు గుల్బర్గాను సాధించినయేఁడు 1514 అగును. రాయలు తిరుపతికివెళ్లినయేఁడు శా. శ 1436 అనఁగా క్రీ. శ. 1514. ఈసంవత్సరముననే అమీర్ బరీద్ అన్నవాఁడు గుల్బర్గాను విజాపురమువారియొద్దనుండి తీసికొనినట్లు చరిత్రకారులు వ్రాసియున్నారు. అందువలన బరీదు కృష్ణరాయలసాయము కోరినందుననో, లేక స్వయముగనో యనాథుఁడైన బహమనీరాజునకు సాయముగ రాయలు 1514 లో వెళ్లి విజాపురమువారిని ఓడించియుండును. అని మన మూహింపవచ్చును. మహమ్మదీయచరిత్రకారులు కృష్ణరాయని పేరుచెప్పక గుల్బర్గాను బరీదే గెల్చినట్లు వ్రాసియుందురు.

ఇంకొక వికల్పము. స్యూయలుచే భాషాంతరీకరింపఁబడిన పోర్చుగీసు చరిత్రకారులచరిత్రలో, కృష్ణరాయలు రాయచూరుయుద్ధము (1520) జరిగినతర్వాత విజాపురమునకు వెళ్లెననియు, నచ్చట ఖైదీలుగానున్న ముగ్గురు బహమనీరాజపుత్త్రులను బట్టుకొనెననియు, నం దొకనిని బహమనిరాజుగఁ జేసెననియు వ్రాసిరి. 1521 సంవత్సరములోఁ జచ్చిపోయిన రెండవ అహమ్మదుషాహ అను బహమని సుల్తానునకు ముగ్గురు కుమాళ్లున్నమాట నిజము కాని, వీరు ఆదిల్ షాహ స్వాధీనమందు లేరు. అమీర్ బరీదు స్వాధీనమం దుండిరి. బీదరులో ననగా గుల్బర్గారాజ్యమం దుండిరి. కావున వీరిని కృష్ణరాయలు బరీదు చెఱనుండి విడిపించియుండును. ముగ్గు రన్నదమ్ములలోఁ బెద్దవాఁడగు అల్లాఉద్దీన్ అనువాఁడు 1521 లో బరీదుచే రాజ్యార్హుఁడుగఁ జేయఁబడిన ట్లున్నది. కావున పోర్చుగీజువారి వ్రాఁతలే నమ్మినయెడల గుల్బర్గా దండయాత్ర 1521 లో జరిగెనని తెలియును.

ఇట్లీదండయాత్ర యెప్పుడు జరిగె నన్నవిషయమున మూఁడు వికల్పములు కలవు. క్రీ. శ. 1510, 1514, 1521. వీనిలో 1514 అనునదియే యధికగ్రాహ్యమని నా తాత్పర్యము.”

కావున శ్రీ లక్ష్మణరావుగారి యభిప్రాయము ప్రకారము గుల్బర్గాపై దాడి క్రీ. శ. 1514 లో నని. వీరి కీయూహ కాధారము రాయవాచకము. రాయవాచకము, కృష్ణరాయవిజయములందు రాయలు గజపతిని జయించి, విజయస్తంభమును బ్రతిష్ఠించిన మీదటనే గుల్బర్గాపై దాడివెడలి, తరువాత దక్షిణదేశమున నున్న తీర్థయాత్రలను సేవించెనని యున్నది. శ్రీ లక్ష్మణరావుగారు తెల్పిన తిరుపతిశాసనము (శా. శ. 1436) ప్రకారము రాయల ప్రథమ కళింగ దిగ్విజయయాత్ర, యనఁగా ఉదయగిరిదుర్గమును సాధించుటమాత్రమె యయ్యెను1 ఈశాసనముప్రకారము రాయలు ఉదయగిరిని జయించి, విజయనగరమునకు విచ్చేయుచు తిరుమలలో శ్రీ వెంకటేశ్వరుని సేవించెను. కావున శ్రీ లక్ష్మణరావుగారి యభిప్రాయముప్రకారము గుల్బర్గాపై దాడి క్రీ. శ. 1514 లో నడిచియుండెననుట పొసఁగదేమొ? రాయవాచకము, కృష్ణరాయవిజయగ్రంథములప్రకారము రాయలు కళింగదిగ్విజయానంతరము, అనఁగా పొట్టునూరి విజయస్తంభప్రతిష్ఠాది కార్యములు జరిగిన మీదటనే గుల్బర్గాను జయించి దక్షిణదేశమునందున్న కాళహస్తి, తిరువణ్ణామల, చిదంబరము, కంచి మొదలగు తీర్థయాత్రలు సేవించెనని యున్నది. తరువాత విజయనగరమునకు విచ్చేసె నని తెలియుచున్నది. శాసనాధారము కూడ రాయలు క్రీ. శ. 1516_1518 లమధ్య దక్షిణదేశ

1. No. 53 of 1889. లేక No. 282 of South Indian Inscriptions Vol. IV. భావ సం॥ ఆషాఢ శుద్ధ పౌర్ణమి.

ములందున్న శైవ విష్ణ్వాలయముల దర్శించి, మహాదానము లొనరించి, గోపురాది ప్రతిష్ఠలను గావించి తిరిగి విజయ నగరమునకు విచ్చేసెను. మొదటి సింహాచలశాసనము ధాత్రి సం॥ చైత్ర బహుళ ద్వాదశి[1] తరువాత బెజవాడ మీదుగా దక్షిణదేశమునకు రాయలు వేంచేసెను. కాళహస్తి, తిరువన్నామలై, చోళసముద్రము, సెండమంగళము, చిదంబరము, కంజీవరము శాసనముల ప్రకారము రాయలు ధాత్రి సంవత్సరాంతమునను, ఈశ్వరసంవత్సరము (శా. శ. 1439, ప్రారంభమునను ఈ పుణ్యతీర్థ ప్రాంతములనుండెను.[2] సెండమంగళము, చోళసముద్ర శాసనములలో శా. శ. 1439 అనఁగా ఈశ్వరసంవత్సరమునాటికే రాయలు కళింగదిగ్విజయము గావించి, పొట్టునూరులో విజయస్తంభమును నెలకొల్పెనని స్పష్టముగా నున్నది.[3]

కావున ఆసంవత్సరముననే రాయలుకూడ రాయవాచకము, కృష్ణరాయవిజయము ప్రకారము గుల్బర్గాపై దాడి వెడలియుండును.

గుల్బర్గా దాడివిషయమై న్యూనిజ్ (Nuniz) వాక్యములు ప్రమాణార్హములు కావని యింకొక చరిత్రకారుని వాక్యము లుదాహరించెదను.

"While at Tirupathi, he is said to have made a successful raid on Gulburga, according to the Rayavachakam. This is what obviously is referred to in his own poem Amuktamalyada. There seems then some evidence to support the statement of Ferishta and '*ipso facto*' to discredit that of Nuniz in this particular. It seems very unlikely that King Krishna would have laid himself out for an elaborate scheme of temple-building and other works of public utility if he did not feel that he had done enough by way of war to ensure permanent peace.........The actual fault of Krishna's policy towards these princes (Bahamani princes) does come in when he is said to have made the attempt to set a Bahamani prince on the throne and put the other two princes on pension from the treasury of Vijayanagar. This, however, as Mr. Sewell, has pointed out is historically inaccurate. The eldest of the three princes, who sometime earlier were under the honourable surveilance in Gulburga, was nominally the Bahmani Sultan and actually was on the throne. The two others followed in the precarious but exalted position during the next few years after the battle. Here again, is a confusion in post dating a privious incident. Krishna might as well have attempted this. when he made the raid against Gulburga from Tirupathi after the wars against Gazapathi. If such an attempt had actually been made successfully, as Nuniz would have us believe, inscriptions of later date would give indications in giving a title such as the Dakshina Sura-trana or Kalvarga Surath-ranasthapanacharya సురత్రాణస్థాపనాచార్య or some equivalent of it.[4]

శ్రీకృష్ణస్వామిఅయ్యంగారి యభిప్రాయముప్రకారము,

---

1 No. 694 of South Indian Inscriptions, Vol. VI.

2 నెం. 196 of 1903 కాళహస్తి. శా. శ. 1438.
నెం. 574 of 1902 తిరువన్నామలై డిటో.
నెం. 474 of 1919 } కంజీవరము డిటో.
నెం. 533 of 1919 }
నెం. 87 of 1912 చోళసముద్రము శా. శ. 1439
నెం. 74 of 1903 సెండమంగళము డిటో.

3 Epigraphical Report, 1912, Page 73.

4 Pages 22 and 29. The yet remembered Rulers of a long forgotten Empire—By Mr. Krishnaswami Iyyangar.

రాయలగుల్బర్గాదండయాత్ర రాయచూరు యుద్ధానంతరముగాక, తత్పూర్వమే నడిచియుండవలెనని.

మనుచరిత్ర, రాయచూరు యుద్ధానంతరమే విరచింపఁబడినయెడల, పెద్దన, తద్దిగ్విజయ మేల వర్ణింపకుండును? రాయచూరు యుద్ధమునుగూర్చి తబ్బిబ్బయి కండ్లారగాంచినట్లు వర్ణించెనుగదా న్యూనిజ్! అట్టి మహాసంగ్రామము తర్వాతనే మనుచరిత్ర రచించిన పెద్దన్న తనగ్రంథమునం దేల దానిని పేర్కొనకుండును?

ఇంకొకమనవి. ఆముక్తమాల్యద ప్రథమాశ్వాసాంతమున ఉదయగిరి ముట్టడియు, ద్వితీయాశ్వాసాంతమున కొండవీటి యుద్ధమును, తృతీయాశ్వాసాంతమున కొండపల్లివిజయమును, చతుర్థాశ్వాసాంతమున సింహాచల పొట్నూరి విజయ స్తంభప్రతిష్ఠయు, పంచమాశ్వాసాంతమున కంభావియుద్ధమును వర్ణించెను. రాయలు తన విజయముల వరుసగా వర్ణించెను. పెద్దన్న సింహాచల పొట్నూరు విజయములవఱకు మాత్రమే వర్ణించెను కంభావి ప్రస్తావనలేదు. నా మనవి రాయలకంభావి విజయవర్ణనము రాయచూరు యుద్ధమును స్ఫురింపఁజేయుచున్నదని శ్రీకృష్ణస్వామి అయ్యంగారి యభిప్రాయమే తమ 'విజయనగరచరిత్రమున కాధారములు' అను గ్రంథమునం దొసంగియున్నారు.*

కావున మనుచరిత్ర రాయచూరు యుద్ధమునకు బూర్వమే రచింపఁబడినదని నా మనవి.

ఇంతవఱకు అల్లసాని పెద్దన్నగూర్చి వెలువడిన శాసనములు నాలుగు. కోవటశాసనములు రెండు.1 అన్నూరుశాసన మొకటి.2 మేలపాడిశాసన మొకటి.3 ఈ శాసనములలో అన్నూరుశాసనమునందును, మేలపాడి శాసనమునందును ఆంధ్రకవితాపితామహ యన్న బిరుదులు కలవు.

మేల్పాడి శాసనకాలమునకే, పెద్దన ఆంధ్రకవితా పితామహుఁడైనట్లు స్ఫురించును. అప్పటికి రాయలు తీర్థయాత్రలు సేవించి విజయనగరమునకు విచ్చేసియుండును. పెద్దన్నకూడ మనుచరిత్రమును రచించి రాయలకుఁ గృతి నిచ్చియుండవలెను. ప్రమోదూత సంవత్సరాది సంచికలో శ్రీకాకుళశాసనకాలమునకు తర్వాతనే వ్రాసియుండవలెనని వ్రాసియుంటిని. అంతకుఁ బూర్వమే మనుచరిత్రను పెద్దన వ్రాసియుండవచ్చును. కాని శ్రీ వేంకటరమణయ్యగారు సెలవిచ్చినట్లు రాయచూరు యుద్ధానంతరముమాత్రము కాదు.

ఒక విషయముచెప్పి యీప్రత్యుత్తరము విరమించెదను. ఆముక్తమాల్యదలో, రాయలు మనుచరిత్ర పీఠికలోని దిగ్విజయపద్యముల ప్రథమపురుష క్రియలను మధ్యమపురుష క్రియలుగా మార్చి వ్రాసుకొనెనుగదా. ఒక్క కంభావియుద్ధవర్ణనతప్ప, మనుచరిత్రవర్ణనలకును, ఆముక్తమాల్యదవర్ణనలకును భేదమేమియును లేదు. మనుచరిత్రరచనమునకు దర్వాతనే, ఆముక్తమాల్యద రచింపఁబడెను మనుచరిత్రలో కంభావి దిగ్విజయవర్ణన లేకపోవుటయు, ఆముక్తమాల్యదలో రాయలు ప్రత్యేకముగా, కళింగదిగ్విజయానంతరము, పంచమాశ్వాసాంతమునఁ బేర్కొనుటయుఁ గాంచినచో, మనుచరిత్ర రచనాకాలము నాటి కాయుద్ధము జరిగియుండలేదనుట స్పష్టము. కంభావియుద్ధము రాయచూరుయుద్ధమును స్ఫురించుచున్నదని యిదివఱకు చెప్పియుంటిని. కావున మనుచరిత్రము రాయచూరుయుద్ధమునకుఁ బూర్వమే, పెద్దన్న రచించియుండును.

కుందూరి ఈశ్వరదత్తు.

## అప్పకవిపైన క్రమధాటి

మనదేశమున నాంధ్రకవితాప్రచారకు లేమి, తదితరు లేమి పెక్కుమంది అప్పకవీయమును జదువనివారుండరనియే నా నమ్మకము. అప్పకవిగారు విశేషించి పాండిత్యము సంపాదించి బహుగ్రంథపరిశోధనఁ జేసి

* Sources of Vijayanagar History—Introduction.

1 Nos. 715 and 716 of 1926 (15-10-1518).

2 No. 623 Page 143 Epi-Report 1916 [6-11-1519].

3 No. 105 of 1921 (17-4-1518).

ఛందోగ్రంథమును వ్రాసెననుట నిస్సంశయము. అదేమి పాపమో యిటీవలివారలలోఁ గొందఱు అప్పకవిగారి నీసడించుటకు మొదలిడిరి. ఇందుఁ బ్రథములు కీ. శే. శ్రీ రా. బ. కందుకూరి వీరేశలింగము పంతులుగారు. వీ రట్లుచేయుటకుఁ గారణములు. 1. రేఫఱకారమైత్రికి సమ్మతింపకుండుట, 2. ఈ మైత్రిచేసినందువలన భాగవతమును బూర్వలాక్షణికులు లక్షణగ్రంథములం దుదహరింప మానిరని చెప్పుట, అది యిట్లు వ్రాసెను:

"ఉ. బమ్మెరపోతరాజకృత
భాగవతంబు సలక్షణంబుగా
కిమ్మహి నేమిటంగొదువ
యెంతయు నారసిచూడగాను రే
ఫమ్మఱలు తాలునుంగలసి
ప్రాసములైనకతంబునంగదా
ఇమ్మగ నాదిలాక్షణికు
లెల్లను మాని రుదాహరింపఁగన్."
—అప్పకవీయము, ౧ ఆ. ౧౩౮ పద్యము.

3. మైత్రికలిపినవారి గ్రంథములనుండి లక్షణములఁ గొనుట, 4. భాగవతమునుండి కైకొనకుండుట. ఇక స్వప్నములు భగవంతుఁడు ప్రత్యక్షమగుట లోనగు విషయముల పరిహాస మటుండనిండు.

ఇది యిట్లుండ బ్ర. శ్రీ. శతావధానులు శ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులు పాణిగృహీత పీఠికయందు

ఉ. తానొనరించు కట్టునకుఁ
దప్పినపాత్రము లెన్నియెన్నియో
మానుగ లక్ష్యసంగతుల
మన్ననజేసి యదేమిపాపమో
మానెను పోతరాజకవి
మండను వాగమృతంబు గ్రోలలే
కైనను దోసముల్ గలవె
యయ్యెడఁ జక్కఁగఁ జూచువారికిన్.

ఉ. తాకును రేఫఱల్ జెలిమి
రాదని పెద్దవివాదపెంచి దా
నేకళనుండి వ్రాసెనొ క
వీంద్రుడు నన్నయ కల్పమానినా
లేకవు లొక్కరే సుభయ
రేఫలె యవ్వి నణల్ శసల్ లడల్
గాక యభేద మీయొకటి
కా తగకుండుట మేలుమేల్ భళీ.

ఉ. ఇంతకుఁ బోతరాజకవి
నీతఁడు దా బహివెట్టె దానిచే
నింత లిఖింపగావలసె
నిందుకుఁ దిమ్మకవీంద్రు డేమి సు
స్వాంతులు తక్కు లాక్షణిక
లందఱు నేమిరయెదిర్చి యక్కవిన్
గాంతికిఁ దెచ్చి రప్పకవి
కావనమాత్రములోనఁ బోయెనే.

ఇక వీరి యభిప్రాయ మీ దిగువరీతిని గన్పట్టెడి.

ఎ. తానుచేసిన కట్టునకుఁ దప్పిన గ్రంథములనుండి అప్పకవి లక్ష్యముల గ్రహించుట.

బి. పోతరాజకవి వాగమృతము గ్రోలకమానుట.

సి. రేఫఱకారమైత్రి కూడదని నన్నయ యేకళనుండి వ్రాసెను? అని ప్రశ్న.

డి. పోతరాజకవిని అప్పకవి. బహివెట్టెననుట, పెట్టినందున పోతనకు గాంతిపోవుట. తిమ్మకవి ప్రభృతి సుస్వాంతు లెదిర్చి కాంతికిఁ దెచ్చుట.

విద్వత్కవులై వ్రాయఁదగినంత సామర్థ్యము గలవారు వీరే వ్రాయగ మనమేల యూరకుండవలయునని యిటీవలివారు కొందఱు రేఫఱకారమైత్రినిగూర్చి కొంత ప్రశంస దెచ్చుటయు దానిని విమర్శించి నిర్ధారణ చేయలేకపోయినను అప్పకవినిమాత్రము తలక్రిందుచేయుటయుఁ గల్గుచున్నది. ఇది "గతానుగతికోలోకః" అను వాక్యమునకుఁ దార్కాణముగ నున్నది.

ఇటీవల నొకరు "అప్పకవిసాహస మ"ను వ్యాసమొకటి భారతిసంచికయందువ్రాసి తమకోపమును దీర్చికొనిరి. తిరిగి భారతి ఈ సం. ఆషాఢమాస సంచిక

యందు "రేఫఱకారములు" అను వ్యాసము వ్రాసి యందు అప్పకవి భాగవతమునం దనూయ కలవాఁడని సిద్ధాంత వాక్యము నుడివిరి.

ఎదటివారు లేకున్నపు డెన్నెన్ని యన్న నేమి భయము?

ఉభయరేఫలమైత్రి కూడదని నన్నయమతము ననుసరించి అప్పకవి వ్రాసెను కాని తాను స్వయముగ వ్రాయ లేదుకదా? అప్పకవి నేల యీసడింపవలె? నన్నయ కూడదని యేకళనుండి వ్రాసెనో యెవరు చెప్పగలరు? తిక్కన వ్యాకరణము నంతయు నేకళనుండి వ్రాసెనో దీనిని ఆకళనుండియే వ్రాసియుండును. పూర్వలాక్షణికు లెవరును భాగవతమునుండి లక్ష్యముల నుదాహరింపకుండుటచే నప్పకవికూడ మానియుండునుకాని పోతరాజుగారి నేమి, భాగవతము నేమి బహిష్కరించవలెననిగాని, వానియం దనూయ కలిగికాని, యందలివాగమృతము గ్రోలలేక కాని మానియుండలేదు. లక్షణగ్రంథమునం దుదాహరింపక పోయినంతమాత్రమున అప్పకవిపై దోసము లొనర్చినట్లే నా? భాగవతమును పురాణకాలక్షేపముచేసి మాధుర్యమును గ్రోలియుండకూడదా?

పూర్వకాలపువారికి భారత భాగవత రామాయణాదులం దెక్కుడుభక్తి కలదు. అప్పకవి పీఠికయందు వ్రాసినప్రకారము తాను కృష్ణాష్టమినాటిరేయి పురాణగోష్ఠి జరిపినది భాగవతకాలక్షేపమే అయియుండును. వాగమృతము గ్రోలుటకుఁ జక్కనిమార్గము లక్షణగ్రంథమునం దేదో సందర్భమున పద్యముల నుదాహరించుట కావని నా తలంపు. అప్పకవికిఁ బోతరాజుగారియెడల మిగుల నాదరభావము కలదు. కవిస్తుతియందు "సహజపాండిత్యుని సంస్మరించి" అని పోతనకవినిఁ బేర్కొనెను. పూర్వకవులు భాగవతమునుండి లక్ష్యముల నుదాహరింపకుండుట తప్పుకాదు, కాని మానిరని చెప్పుట తప్పా? రేఫఱకారమైత్రి కలిసిన గ్రంథములనుండి పూర్వలాక్షణికు లుదాహరించి యుండలేదా? అట్లే యాతఁడును గ్రహించియుండును. ఇంతకును రేఫఱకారమైత్రి కలిసినందున భాగవతమునుండి పూర్వులు లక్ష్యముల గ్రహింపలేదని చెప్పుట అప్పకవియెడఁ దప్పు తేలినది: ఆ చెప్పుటలోఁగూడ నీమైత్రికలిసిన విషయము తప్ప తక్కిన యన్ని విషయములలోను భాగవతము శ్రేష్ఠగ్రంథ మనియే చెప్పెను కాని తృణీకరింపలేదు.

అప్పకవి వ్రాసిన పద్యమునుబట్టి పోతనకుఁ గాంతి తఱిగినట్లును, పిదపఁ దిమ్మకవిప్రభృతులు కాంతికిఁ దెచ్చినట్లునా? పోతన యెప్పటికిఁ గాంతియుక్తుఁడే. బంగారమున కెక్కపుడు కొఱతకలదా? ఈ మైత్రికలిమి పోతనగారి కవనమునందని కాని, తదితరుల కవనమునందని కాని నిరూపించలేదు. భాగవతమున నెవరికవనమున నేమి మైత్రి కలిసినమాట సత్యమేకదా, ఈమైత్రి భాగవతమున గలిసినంత యెక్కువగఁ దక్కినగ్రంథముల లేదని కొంద ఱనుచున్నారు. అప్పకవి గ్రహించిన యితర గ్రంథకర్తలీమైత్రి నంగీకరించిరో, లేక పొరపాటున గాని మఱే యేకారణమునఁగాని మైత్రిని గలిపిరో యెవరు చెప్పగలరు? మైత్రి నంగీకరించినచోఁ బెక్కుచోట్ల మైత్రికలిపియుండెడివారు.

వ్యాసకర్తలుగాని తదితరులుగాని, యీ మైత్రి విషయము నిర్ణయించుట చాలకష్టమనియు, పండితు లిందునుగూర్చి కృషిచేసి నిరూపించుట కర్తవ్య మనియు నభిప్రాయపడుచున్నారు. ఈ నిరూపణలో నేపండితుఁడైన నిలిచి చర్చించి మైత్రికూడునని చెప్పినచో నెగ్గ గలదుకాని కూడదని చెప్పినచో మనఅప్పకవిగారి కమరినట్లేకదా వారికిని యమరునది.

ఇంతయేల? ఇప్పటివారు స్వతంత్రులు, పూర్వుల నిరసించుటయన్నఁ దృణప్రాయము.

మహాశయులారా! ఈ మైత్రిని గూర్చిన చర యిప్పటిది కాదు. పూర్వమునుండి వచ్చుచున్నది. ఈ నిరూపణ మిగుల కష్టమైనపని. ఇంతకును అప్పకవియే కొంతవఱకైనఁ బాటుపడి వ్రాసియుండెను. ఇది పండితులు తేల్చవలసిన విషయముకాని, ప్రతివారును దిగవలసినపని కాదు. కానఁ దటాలునఁ బూర్వకవిని నిరసింపుచు వ్యాసముల వ్రాయుట శోచనీయమని నా తలంపు.

నేను విశేషజ్ఞుఁడను కాకున్నను పెద్దల నిరసించుట కిచ్ఛగించువాడను కాకుండుటచే నిట్లు వ్రాసితిని.

ఈతఁ డిట్లు వ్రాయుననంతటివాఁడా యని మాత్ర మనక నిజము నాలోచించి నన్ను క్షమింపఁ బ్రార్థింపుచున్నాఁడను.

శ్రీ భారతి శ్రావణమాసపంచికయందు "ప్రాచీన భాష-రేఫము" అను వ్యాస మొకటి ప్రకటింపఁబడినది. అందుల కీయవలసిన సమాధానము లందే కలవు కాని యించుక వ్రాయవలసి వచ్చినది. భాషాచర్చకు గ్రంథములు, చాటుపద్యములు ప్రమాణములు కాని చరిత్రాంశములకును లిపిరూపములకుమాత్ర ముపకరించు శాసనములు ప్రమాణములు కావు. భారతము మొదలగు సద్గ్రంథములలో రేఫఅకారమైత్రిగల పద్యములలోని పదములందుఁ గల రేఫఱకారసాధ్వసాధుత్వమును నిర్ణయించుట దుస్తరము. ఏలయన నీవిషయమును నిరూపించుటకుఁ బ్రయోగములు తప్ప వేరొండు తెరువు లేకుంటయే కారణము. ఆకవు లావిషయమున నెట్లభిప్రాయపడిరో తెలియరాదు. భారతకవు లీమైత్రి నంగీకరించిన చో ౧౮ పర్వముల భారతములో సముద్రములోఁ గాకి రెట్టవేసినట్లుగా నేదో యొకటి రెండుచోట్లనే ప్రయోగించుట యేల సమకూరును? విస్తృలవిడిగాఁ బ్రయోగించరా? అప్పకవి తనపద్యములో నీమైత్రి కుకవి కూర్చునని వ్రాసినందున, భారతకవులను పోతరాజుగారు మొదలగువారిని కుకవితండములోనే చేర్చినాడని యొక యర్థము కల్పించుకొని నిందించుటకు వేరొకసారు నేర్పరుచుకొనిరే కాని అప్పకవి కట్టితలం పెప్పటికి నుండదు. అట్టి యభిప్రాయ మున్నచో వారి నెంతో స్తుతించి వారిప్రయోగములఁ గైకొనఁడు. పూర్వలాక్షణికులు అప్పకవి మతమునకు భేదించి వ్రాయవలసిన సంగతులు వచ్చినప్పుడు సైతము తమ యభిప్రాయమును వ్రాసి యెదుటివారి మతమును పూర్వపక్షము నేయుచువచ్చిరే కాని యిట్లు నిందించియుండలేదు. పోతనామాత్యుని వన్నెకు తెచ్చిరని మనవారు వ్రాసిన శ్రీకూచిమంచి తిమ్మకవి సార్వభౌముఁడును అప్పకవిని నిందించలేదు. ఈ యుభయరేఫల నిరూపణము చేయుట యిప్పటివారికిఁ జేతనగునో కాదో దేవు డెఱుంగును కాని పెద్దలను నిందించుటమాత్రము సులభసాధ్యమైనపని గాఁ గను పట్టుచున్నది. అప్పకవి నీసడించినవారు చూడుఁడు:—

1. బ్ర. కం. వీరేశలింగము పంతులుగారు కవుల చరిత్ర రెండవ కూర్పున: "అజ్ఞానమూలమున కాని వేరొండు కాదు."

2. శ్రీనాథునిచరిత్రమున సంధివిషయములోన: "అప్పకవి తానొక లక్షణవేత్తవలెనే"

3. అసూయాగ్రస్తు డనియు నిత్యాదివాక్యముల తో నీసడించిరి. కాని యీ శ్రావణమాస సంచికలోని వ్యాసకర్తవలె బుద్ధిజాడ్యజనితోన్మాదములు, రోగములు మొదలగునవి తెచ్చిపెట్టి నిందించియుండలేదు. దొంగతులైనవారి నెవరేమన్న వారి కేమి కొదువలేదు. కాని అసభ్యవాక్యములచేఁ బూజ్యు లగు పెద్దల నిందించుట విచార్యమని మనవి సేయుచున్నాఁడ: విద్యాధికులకుఁ దెలియనివిషయముకాదు కావున నాయెడ నాగ్రహింపక యించుక శాంతభావమున యోజింపఁ బ్రార్థన:—

మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ.

---

## పల్లెటూరి పాఠశాల

'భారతి' గతసంచికలో ఈప్రహసనముపై నొక విమర్శనము వెలువడినది. "రచనయందలి దోషములు కొన్ని ప్రహసనముయొక్క విలువను చెడగొట్టె"నట్లే విమర్శనమునందలి యసత్యదోషములు కొన్ని విమర్శనముయొక్క విలువను తగ్గించినవి. భేదాభిప్రాయము లెట్లున్నను విమర్శనము రచనాంశములపట్ల సత్యదూరమైనపుడు దానిని ఖండింపక తప్పదు.

"ఇది యెనిమిదిరంగముల ప్రహసనము" ఇది విమర్శనములోని మొదటివాక్యమును మొదటియసత్యమును. రంగములు పదికాని యెనిమిదికాదు. ఇది స్వల్పదోషమే యయ్యును ప్రమాదజనితముగాక యపరిశీలనమువలన కలిగిన దగుటచే శాస్త్రతుల్యముగు విమర్శనమందు వాఙ్మయప్రపంచమున పాఠకులను చక్కని రాజ



చిత్రము ౧౧



చిత్రము ౧౨



చిత్రము ౩౧

మార్గమును జూపవలసిన విమర్శకునిపట్ల నిది గొప్ప దోషము. మరి యిది యపరిశీలనమే యని యూహించుట కవకాశముకూడ నున్నది. గ్రంథముయొక్క చివర రెండురంగములును రెండుపుటలలో నిమిడియుండుటచే, రంగముల సంఖ్యకొరకు నెక్కడో తీసిచూచు స్థూల దృష్టికలవారల కిది యెనిమిదిరంగముల పుస్తకముగనే తోచవచ్చును. పోనిండు. విమర్శనమందలి రెండవ వాక్యము గమనింపుడు.

"పల్లెటూరి పాఠశాలను కేంద్రముగాగొని...... గ్రామజీవనమందలి లోపములను కొంతవరకు పరిహసించినారు" ఇది శుద్ధతప్పు. గ్రంథమంతయు తఱచిచూచిన ఈ యసత్యము వెలువడియుండదు. పాఠశాల కేంద్రమే గాక గ్రంథముయొక్క యితివృత్తమును. పాఠశాల గొడవలు మినహాయించిన పుస్తకమే లేదనిచెప్పిన సత్య దూరము కాదు. గ్రంథమంతయు వెతకిచూడగా ఒకానొక చెదరినవాక్య మిట్లున్నది "ఈ ఊళ్లో వైద్యుడు దొరకక చిక్కుపడుతున్నాం" ఇది గ్రామజీవనమును "కొంతవరకు" పరిహసించుటయా?

"ఆంగ్లవిద్య నభ్యసించి ఉద్యోగములకై తారాడు యీకాలపు యువకులపై కట్టెపుచ్చుకొనినారు" కట్టెపుచ్చుకొనుటకు వారేమి కానిపని చేసిరా? ఉద్యోగములకై తారాడుట పరిహాసపాత్ర మెట్లగును? అట్లు తారాడువారిని లోకువపఱచి ఉద్యోగము లిచ్చుట కేర్పించు అనర్హులగు పాఠశాల విచారణకర్తలపై కట్టెపుచ్చుకొనిరనిన సమంజసముగ నుండెడిది.

"వీరు చిత్రించినది పల్లెటూరిపాఠశాల కాదు. సామాన్యముగా పట్టణములయందే నెలకొనియున్న హైస్కూలు."

పల్లెటూరి పాఠశాల యనిన వీథిబడి యనియు, పల్లెటూళ్లలో ఉన్నతపాఠశాలలు నెలకొల్పుకాల మింకను రాలేదనియు విమర్శకుల యాశయము. ఇది యవిచారమూలకము. ఇదియే నిజమని వీరికి బాగుగతట్టినచో ఇంతవిమర్శన యేల? "పల్లెటూరిపాఠశాల" అంతయు అతథ్యకల్పనమని యేల త్రోసివేయరైరి? తథ్యప్రపంచముపై నిసుమంతయు ఆధారపడని యూహాకల్పనమే వెర్రియగుచుండ దానిని విమర్శింపదొరకొనుట యెట్టిపని? నిజమారయ, పల్లెటూళ్లలో ఉన్నతపాఠశాల లిప్పుడే యున్నవి. పల్లెటూరన, దేవబ్రాహ్మణులులేని నాల్గు కొంపలుగల కుగ్రామమని కాబోలు; ఇప్పు డున్నతపాఠశాలలున్న పెంటపాడు, ఉండి, పాలకొల్లు, మార్టేరు, రాజోలు, కొత్తపేట, పుంగనూరు మొదలగునవి నగరములా? ఇందు కొన్ని బోర్డుపాఠశాల లున్నను మిగతవానిలోని పాఠశాలల విచారణకర్త లందరు ఆంగ్లవిద్యాధికులేనా? ఉన్నతపాఠశాలలోని కడకరగతి యైనను కడతేరని గ్రామస్థులు ఆపాఠశాలలకు విచారణకర్తలుగా నుండుట కర్హులా? ఇట్టివారున్న కమిటీ లెన్ని లేవు?

"మరి బి. ఏ. లు యం. ఏ. లు వీరి కంటికి నీచులు గానేగాక మూర్ఖులుగాకూడ కన్పించుచున్నారు......ప్రహసనకర్తలు కథావస్తువును అతథ్యాపవాదము నుండి కాపాడుకొనదగును" ఈ వాక్యములు దూషణగర్భకావ్యముల (Satire) రచనను గురించినవి. ఈరకపు కావ్యములలో కథావస్తువు తథ్యముగనే యుండవలెను. తథ్యముగ నెలకొనియున్న దుర్గుణముల పరిహసించి సంస్కరించుటకే ఈ సారస్వతరూపము బయలుదేరినది. ఒకానొకసంఘమంతయు దోషభూయిష్ఠమైన దని తూలనాడిన గుణశీలురగు ప్రత్యేకవ్యక్తుల కది బాధాకరముగ నుండవచ్చును. కనుక ప్రహసనము లెన్నడును సంఘము మొత్తము నంతటిని దూషింపజాలవు. కాగా అందలి పరిహాసపాత్రములు సంఘమునందలి ప్రత్యేకపాత్రములే. నిర్ధారణావకాశశూన్యముగ వారిని విమర్శించి, పరిహసించి, సంభావ్యముగ దూషించు ఇతివృత్తమే ప్రహసన కథావస్తువు. కావున ఇందలి పట్టభద్రులను గూర్చిన మాటలకు "కట్టెదెబ్బ" తగిలినవారు విచారపడవలసినదే కాని అన్యులు కారు.

"అయ్యవార్ల నియామకపుపట్టున ప్రపంచజ్ఞానమును గూర్చిన ప్రశ్నపత్ర మొకటి చమత్కృతమై యున్నది...ఆ సమయమునకు గ్రంథకర్తగారే కమిటీలోనికి దిగబడినట్లున్నది."ఇదికూడ గ్రంథమక్కడక్కడ

కోటికిచూచినందువలన గలిగిన భ్రమ. ఆకమిటీకంతకును, గడసరియు, వ్యవహారజ్ఞానియునని ప్రధానోపాధ్యాయున కాతడు గావించిన హితోపదేశమును బట్టియు ఉపాధ్యాయులవలన సంతకముల గ్రహించి వారినోట కరక్కాయ గొట్టుటను బట్టియు గ్రహింపవచ్చును. అప్పుడు విమర్శకుల భ్రమ వీడిపోవును.

భాషనుగూర్చి వీ 'రొకమాట' సెలవిచ్చిరి. "నాటక భాష యన్నంతమాత్రమున మక్కికి మక్కిగా మాట్లాడునట్లే వ్రాయవలెనని గాదు... గావున వీరు ఆంగ్ల పదముల నంతవిరివిగా ప్రయోగించుటకు తగినకారణ మగుపడదు." ఇంగ్లీషు నేర్చిన ఆంధ్రుల పరస్పరసంభాషణములలో ఆంగ్ల పదప్రయోగ బాహుళ్యమును గుర్తించుచునేయున్నాము. ఆంగ్లేతరవిషయము లన్నియు ఆంగ్లమునందే బోధింపబడుటయు, సర్వకాలసర్వావస్థలయందును ఆంగ్లపదవిన్యాసమున గాని ఆంధ్రుల సంభాషణలతకొనలు సాగకుండుటయు భాషకు తీరని కొరతయన, ఇక దానిని మక్కికి మక్కిగానే ప్రతిబింబింపజేసి గ్రంథకర్త పరిహసించుటలో తప్పేమి? కథావస్తువొక్కటియేనా పరిహాసపాత్రము? భాష కాదా? "ఆంగ్ల పదముల నుపయోగించు తావుల నయితము వాటిని తెలుగుననే వ్రాయదగును" అనగా తెలుగులిపిలో ఈ రకము గ్రంథములు జనసామాన్యమునకు గాక సంఘమునందు కొంతమందికే యుద్దేశింపబడినవని విమర్శకులు గ్రహింతురుగాక! ఇంగ్లీషునేర్చినవారే దీనిని చదువ నర్హులు.—అన్యులగువారికి తెలుగులిపిలో వ్రాసినను వ్రాయకపోయినను సమానమే. వారికొరకు అర్థము కూడ వ్రాయుమందురు కాబోలు!

"తొలిపలుకుగా విద్యనుగూర్చి గ్రంథకర్తగారు వ్రాసినవ్యాసము ఆంగ్లమున నుండుటకూడ అసంగతము" దీనికి నాకుదోచు సమాధానము. గ్రంథపఠనమునకుపహాయపడు కేవల ముపోద్ఘాతమువంటిది గాక విద్యయందలి ఆదర్శమునుగూర్చిన ప్రత్యేకస్వతంత్రవ్యాసమిది. గ్రంథపాఠకులగు ఆంధ్రులకిది సుబోధకమగుటయేగాక యేతద్గ్రంథమును తిలకించు విద్యావిధానమున పాల్గొనుచున్న ఆంధ్రేతరులగు ఆంగ్లవిద్యాపరిచయుల కందరికిని నిందలి భావము వెల్లడిపఱుపవలెనని ఆంగ్లము వాడబడినది.

"అందుజాతీయవిద్యనుగూర్చిన వీరి వ్రాతలు నిరాధారములు" వీరు జాతీయవిద్యావిధానమును గూర్చి ఏమియు వ్రాయక, జాతీయవిద్య యిదివరకు తీవ్రరజకీయాందోళనముతో వెంబడించి సన్నగిల్లుచుండె ననియు, ప్రస్తుతమున్న ఆంగ్లపాఠశాలలన్నియు ఒక్కమాటుగా నిర్మూలించుట అసంభవమనియు విద్యావిధానమునందు పాల్గొనుచున్న వ్యక్తులందరును ప్రబలమగు ఆదర్శప్రాయులై యున్నచో ఇప్పటి విద్యాసంస్థలనే ఆధారముగా "జాతీయత"ను నిర్వహింప వచ్చుననియు వ్రాసిరి. ఈ మాటలలో భేదాభిప్రాయ ముండుట కవకాశ మేదియు నాకు కానరాదు.

పునర్విమర్శన మిప్పటికే పొడుగైనది. అయినను గ్రంథము విద్యాసంస్థలలో నెలకొనియున్న కొన్నియసంగతముల నిర్మూలించుటకు సమకట్టియుండుటచేత దానిపై భేదాభిప్రాయములు గాక విపరీతాభిప్రాయము లుండుట పాడిగాదని యింత వ్రాయవలసి వచ్చినందులకు సహృదయులు మన్నింప ప్రార్థితులు.

వై. రామజోగి, బి.ఎ., బి. ఇ. డి.



## ఉల్లుబంతులు—పుష్పములు

కో. నరసింహాచారి గారు

ఉల్లు అనగా ఉన్ని నూలు. అది అనేకవిధము లగు వర్ణములలో అంగళ్లయందు అమ్మబడు చున్నది. దానితో పసిబిడ్డల కుపయోగించు మేజోళ్లను, కుళ్లాయిలును, ఇంకను బంతులు, పుష్పములు మొదలగునవి చేయవచ్చును. మనము 'బ్యాడ్మింటను' ఆటలో నుపయోగించు బంతులు పసుపురంగుగల ఉల్లుతో చేయబడినవి. అంగడియందు ఒక్కొక్క బ్యాడ్మింటన్ బంతి వెల ఒకరూపాయి యుండును. ఈబంతులను మనమే చేయ నేర్చుకొన్నయెడల దానిలో సగము క్రయమునకే ఒక బంతి రాగలదు. అభ్యాసము చక్కగాచేసి మేలైన బంతులను చేయగలిగినయెడల వాటివలన కొంత ధనార్జనకుగూడ నవకాశము కలుగగలదు. ఉల్లుతో బ్యాడ్మింటన్ బంతులే కాక చిన్నచిన్న బంతులను కుచ్చులను చేసి బిడ్డల ఉయ్యాలలకు పైన వినోదార్థమైకట్టు చట్టములకును చాందినీలకును కట్టి యలంకరించవచ్చును.

### బంతులను చేయువిధము

ఒక అట్టముక్కను తీసికొని దానిపై రెండంగుళముల అర్ధవ్యాసము గల యొక వలయమును గీయవలయును. పిమ్మట దానిమధ్య $\frac{3}{4}$ అంగుళము అర్ధవ్యాసముగల మఱియొక వలయమును గీయవలయును. అటుపిమ్మట పెద్ద వలయమును కత్తిరించి దానియందలి చిన్నవలయమునుగూడ కత్తిరించి తీసివేయవలయును. అప్పుడు అట్టవలయము చిత్రము ౧ యందు వలెనుండును. పిమ్మట వారివారి యిష్టము వచ్చిన రంగు గల ఉల్లుదారమును సాధ్యమగునంతవరకు నిడివిగల దానిని సూదియందెక్కించి అట్టయొక్క రంధ్రమునుండి అంచున చుట్టుచు రావలెను (చిత్రము ౨). సూదియందలి నూలు అయిపోయినయెడల మరల మరల క్రొత్తనూలును తీసికొనుచు అట్టయందలి రంధ్రము దట్టముగా నిండువఱకును చుట్టుచు రావలయును. అప్పుడు అట్ట యంతయు




పటము I ఉల్లుబంతి.

వలయమును జాగ్రత్తగా కత్తిరించి తీసివేయవలెను. అప్పుడు ఉల్లంతయు నొక మోటుబంతిగా కనుబడును. ఉల్లుతునుకల మొనలనన్నిటిని ఎచ్చుతగ్గులు లేక కత్తిరించి బంతి చక్కని గోళాకృతిగా వచ్చునట్లు చేయవలెను. తుదకు బంతి చిత్రము ౬ నందు చూపిన రీతి నుండును.

ఉల్లుపుష్పములు

ఉల్లుతో చేయఁబడిన పుష్పములు అందమై స్వాభావికపుష్పములవలెనే యుండును. ప్రతిపుష్పమునను (౧) రక్షకపత్రములు; (౨) ఆకర్షకపత్రములు (౩) కింజల్కములని సాధారణముగా మూఁడుభాగము లుండును. రక్షకపత్రములు ఆకుపచ్చనివర్ణముగలవిగను, ఆకర్షకపత్రములు ఎరుపు, రోజా, ఊదా, పసుపు, నారింజవర్ణములలో నేదైన నొకవర్ణముగలిగినవిగ నుండవచ్చును. కింజల్కములు, గోధుమ వర్ణమును

ఉల్లుచే కప్పబడి చిత్రము 3 నందువలె నుండును. పిమ్మట చిత్రము ౪ నందుచూపిన విధముగా అట్టయొక్కయంచున కెదురుగా కత్తితో కోయవలెను. కత్తి అట్టయొక్కఅంచును చేరువఱకును కోసినయెడల ఉల్లుఅంతయు చిత్రము ౫ నందువలె నేర్పడును. అప్పుడు ఒక గట్టి దారముతో ఉల్లునంతయు నొకటిగచేర్చిమధ్యభాగమున గట్టిగా కట్టవలెను. తర్వాత అట్ట

గాని, పసుపు వర్ణమునుగాని కలిగి యుండవచ్చును. రోజా పుష్పమునకు, ఆకర్షకపత్రములు రోజారంగు ఉల్లునను, కింజల్కములు, పసుపువర్ణమునను ఉండవచ్చును. సూర్యకాంత పుష్పమునందు ఆకర్షకపత్రములు పసుపువర్ణమునను, కింజల్కములు గోధుమవర్ణమునను ఉండవచ్చును. ఇట్లనేతక్కినపుష్పములయందు




ఉల్లుపుష్పమునకు నమూనా.

ఉల్లుబంతికి నమూనా.

వాటి స్వభావమున కనుగుణముగ ఉల్లుయొక్క వర్ణమును నిర్ణయించుకొనవచ్చును.

పుష్పములను చేయువిధము

సుమారు ౧౻ యంగుళము వెడల్పును 3, ౪ అంగుళముల నిడివియుగల అట్టను తీసికొని దాని నిడివి యంచునకు చేర్చి యొకగట్టి నూలును పట్టుకొనవలెను. చిత్రము ౧ (పటము ౨) నూలును పట్టుకొనుట సులభముగా నుండుటకొఱకు అట్టకొనలయందు రెండుకోతలనుచేసి వాటియందు నూలుకొనలను యిరికించవచ్చును. పిమ్మట పుష్పముయొక్క మధ్యభాగమున నుండవలసిన కింజల్కవర్ణ మగు గోధుమవర్ణపు ఉల్లును ఆ అట్టకు చుట్టవలెను (చిత్రము ౧). ఇట్లు కొంతఉల్లును చుట్టినపిదప దానిపై పుష్పపు ఆకర్షకపత్రములకు సరియగు వర్ణముగల ఉల్లును తీసికొని గోధుమవర్ణపు ఉల్లునుపూర్తిగా కప్పునట్లు అట్టకు చుట్టవలెను (చిత్రము ౨.) ఆకర్షకపత్రములకుగాను చుట్టు ఉల్లు ఎంతఎక్కువగానుండిన పుష్పము అంత అందముగా నుండును. దానిపై రక్షకపత్రములకుగాను పచ్చని యుల్లును కొంచెముగా చుట్టి పిదప చిత్రము 3 నందు జూపిన రీతిని కత్తెరతోగాని పేనాకత్తితోగాని కోయవలెను. చిత్రము ౪ నందువలె కుచ్చుగాపట్టుకొనిచిత్రము ౫ నందు చూపినరీతినికట్టవలెను. పిమ్మట మధ్యనుండు గోధుమవర్ణపు ఉల్లునుమాత్రము వేరుగాచేర్చి చిత్రము ౬ నందువలె కురుచగా కత్తిరించవలెను. తక్కిన ఆకర్షకపత్రముల ఉల్లును పొడుగుగా కత్తిరించవలెను. పుష్పము యొక్క ఆకారము వలయముగానుండవలెను. ఇదంతయు ముగిసిన వెనుక పుష్పము చిత్రము




పటము II
ఉల్లి పుష్పము

ఁ నందువలె నుండును. పుష్పమువెనుక నొక యందు ధరింప వలనుపడును.
సూది (Hair-pin) ని గుచ్చినయెడల జడ



———

# సద్విద్యార్థి

క్రొత్తపల్లి సూర్యారావుగారు

ఏమి రామయ్య మామయ్య! యెపుడువచ్చి
నావు కొవ్వూరునుండి? మా నాన్నగారు
కనఁబడిరి?—ఏమిరో! మామ కామరాజు
చేత జీతముపంపితి నాతఁ డిచ్చి
నాఁడ యని యడుగుమని యన్నాఁడు నిన్న
మొన్ననే యిచ్చినాఁడు నే నిన్నఁగట్టి
నాఁడ—వసతిగ నున్నదా? నాలుగేండ్ల
నుండి యీపట్టణంబులో నున్నవాఁడ
వెట్టులున్నది వంట పూఁటింట సౌఖ్య
ముగనె యున్నది సన్నమ్మ ముసలిదైన
స్తోత్రపాఠము లొనరించుచును బళీయ
టనెడువారికి వాత్సల్యముననె వేఁడి
వెచ్చనయుఁజూచు, రాఁబడి వెచ్చములును,
బద్దుపాయలు, నరువులు, బదులు సదులు
లెక్కలన్నియు నామీఁద నిక్కమైన
నమ్మకముగల్గి వ్రాయించు నాకుఁ దెల్పి
దానిచేతనె యిచటఁ గొంత స్వగృహంబు
నందువలె జర్గుచుండు నీవైనఁ జెడ్డ
వడ్డవాఁడవుగావు మీ వంశమెల్ల
మాయమర్మము లెఱుఁగని మంచివారు
ఎట్టులో రెండుమూఁడేండ్లు నెట్టి యెక్క
డైనఁ బదిరాళ్లు గడియించి యతనికష్ట
ములకుఁ దోడయి నీదుతమ్ములకుఁ గూడ
నీవు చెప్పించితివ యొక్క త్రోవఁబడిన
నీవలెనెవారు కాఁగల; రేవి లేక
పోయినను ముప్పవగడవదు, పొలము పాటు
తిండికే చాల దెట్టులు తెచ్చిపెట్టు
చున్నవాఁడోను సుఖముగా నున్నదిగద?

కుఱ్ఱవాండ్రకుఁ దెలియవు కొంపలోనఁ
దల్లిదండ్రులు పడెడుతొందరలు, వారు
పస్తుపడి మీకుఁ బంపినఁ బట్టనముల
నోడలు తెలియక తిరుగుచు నుందరుగద.

పిల్లకాకులుమీరు; మాపిల్లవాఁడు
చదువుచున్నాఁడనుచు మేము సంతసింపఁ
జదువు నొకమూలఁబెట్టి "బైసకలు" లెక్క
తిరుగుచును జిఱుతిండ్లచేఁ దెవులు గొంటు
లగుచు నాటకములకేగి యర్ధరాత్రి
వఱకు నిద్రనుమాని శవంబులట్లు
వచ్చి సుఖపెట్టుటకు మాఱు వ్యాధిఁబొంది
యేడిపించినవా రెందఱేని గలరు.

నాయనా, పనితొందర నాకుఁగలదు
చెప్పెదను నిన్ను నేను జూచినది ఱేపు
మీజనకుతోడఁ జదువుకొమ్మీ సుఖముగఁ
గాలయాపన చేయుమీ, కానిపోని
వారి సావాసములు మాను, వారితోడ
వైరములు పెట్టుకోఁబోకు, బాల్యముడిగి
వయసు వచ్చుచునున్నది—బాల్యసఖుల
మగుట మీయయ్యవలె నేను నని తలంపు
మతఁడు చొరఁబడి నీతోడ నన్నిమాట

లనఁక, సంకోచమున, భద్రమయ్య, మొడలు
పట్టనంబులలో వేషభాషలకును
లోపముండదు, లోకులలోనఁ బలుమ
తంబులున్నవి, యెవ్వరేదారిఁజూపఁ
దానిఁబడిపోకు, మూహించి కాని యేద
గాని చేయకు; మపుడప్డు కలిమిలేమ
లిల్లు సంసారమొక్కింత యిట్టిదనుచుఁ
దలఁచుచుండుము, వయసు పెత్తనము గలది,
బాల్యమున బాలురను దిద్దవలయు, నన్ని
రీతులను; శైశవము చిత్తవృత్తి బడిని
బోయినను నక్షరాభ్యాసపూర్వకముగ
వర్ణముల యొంపుటొంపులుఁ బలుకుబడులు
దిద్దుకొనివచ్చునప్పుడే తీరుగాను
సవరణలుచేయు టది యిప్డు యువకులకును
గుణము కనిపించుటకె, వాని గుంటఁబెట్టి
గంట హాయించితిరయేని గొంపగుల్ల
చేసి మిము పట్టణములలోఁ జేర్చివైచి
వార్ధకంబున నేమి గావలయు వారు.

బాల్యమెటువోయినను బరువంబు రాఁగ
లోకమున మంచిచెడ్డలలో మెలఁగుచు
దనకు దేశంబువారికిఁ బనికివచ్చు
వాఁడు యువకుఁడు; బాలురపాలి గురువు
వృద్ధపితలకుఁ జేయూఁత, పితరులకును
బెంపు, బీదలపాలింటి పెన్నిధాన,
మత్తవారికి నానంద, మూఁడుఁబడుచు
లకును గల్పకమగుచు యువకుఁడు మీఱ
వలయు యౌవనదృఢదేహ పాటవములు
గలిగినప్పుడుగద యువకపటలంబు
శాఁగలదు పయిఁజెప్పిన గతిని నిలువ.

యౌవనము ధర్మమునకును నర్థమునకుఁ
గామమునకును మూలముఁ గడనసేయఁ
గుడువ నొకరికిఁ బెట్టంగఁ; గూర్చినట్టి
విత్తమెల్లను వెచ్చింప వెలితి గాదు
వయసు నిష్ప్రయోజనముగ వ్యయము సేయఁ
జేయునది లేదు, ధనమైనఁ జేరుఁగాని
పోయినది రాదు తారుణ్య మోయిబిడ్డ!

నేఁడు కొఱగానిదనుకొందు వీడు, జేపు
కోటిసేయును, నేఁడు నీకుఁ దిమిరంబు
వలెనుదోఁచును, జేపు వెన్నెలయగునది
నిరుపయోగంబనుచు నీవు నేఁడుతలఁచి
నదియె లోకోపకారక మగును జేపు
గడియ వ్యర్థముగాఁ బోవఁగా మగఁటిమి
సార్థ మెన్నఁటికినిగాదు, చచ్చినట్టి
వాని బ్రదికింత్రు వైద్యులు వయసుపోవఁ
దెచ్చి యీఁజాలర య్యయాతిని వినవొకో
యౌవనమె సంస్కృతికిమూల, మావయస్సె
దేశవృద్ధికిమూలము దృఢవయస్క
తయె చుమీ యెల్లవిద్యలు దాచుపెట్టె
యొక్క యువకుని యాధార మూరికెల్లఁ
గాలిలో మూల్గువలె నుండు; గడుసువారు
పూఁటకూటింటివారు; నీపుణ్యమాయె
భద్రముగ పోయివచ్చెదఁ బనులుగలవు
వేఱుభావంబు నామీఁదఁ బెట్టుకొనకు
పిచ్చివాఁ డేమియోపట్టి ప్రేలెననుచుఁ
దుడిచివేయకు పోయివత్తు, మఱియేమి
చెప్పవలసినదుండెనా చెప్పు నాన్న
తోడఁజెప్పెద మీయమ్మతోడమాట

లాడెదను నిన్నుఁజూచినా ననుచు తేపు
జానకికిఁ బెండ్లికై కొంత సరకుఁగొనఁగ
వచ్చెదను గూడ మీనాన్న వచ్చునేమొ
చైత్రమాసములోఁ బెండ్లి జరుగవలయు
నీకు సెలవులుగద! మఱి నాకుఁ గొంత
యవతలను బనియున్నది, మైన, నిన్నుఁ
జూచి పోబుద్ధిపుట్టదు సుఖముగాను
బోయి చదువుకొనుము నాకుఁ బ్రొద్దులేదు.

ఒకరు చెప్పఁగవలదు నీ వొక్కరికిని
జెప్పవాఁడవు దేహముఁ జెఱచునట్టి
తింటితిప్పలు కసపెట్టి తినుము తిరుగు
మీ వయసులోపలను గడియించుకొన్న
సుఖము కలకాలముండును, సుఖము వలెనె
తోఁచుకష్టము ముదిమిని దుఃఖమిడును
మనము చేసెడు యత్నముల్ మనకు ముందు
వృద్ధదశ సౌఖ్యమునకని యెంచికొనుము,
ధనము గడియింప నిప్పు డెట్లును సుఖింతు
వానకను నీకుఁ గాలు చే యాడనపుడు
డబ్బు లేకున్న సుఖమెట్టు లబ్బు నీవు
కష్టపడి చదువుకొనిను గడకునీకు
ముక్తిమార్గము చూపెడు మోక్షశాస్త్ర
ములను బఠియింప నిచ్చును, ముఖ్యమిత్రు
లను గడించిన నాపదలను సహాయ
మగుదు, రాలును బిడ్డలు నాప్తబంధు
వులను గవచంబు పోల్కి నిన్నలమికొందు
రేది యిప్పుడు నీవు సంపాదనంబు
చేసికొంటివో యది నీ ప్రసిద్ధికొఱకొ
యప్రసిద్ధికొ మున్ముందు దగును హేతు
వోయి నీ కనినంత నీ కొక్కనికిని
గాదు లోకము పాటికిగాని నీవు
పొమ్ము నాబిడ్డ, ననుఁ బోవనిమ్ము; మరలఁ
వచ్చినప్పుడు నీయున్న బసకువచ్చి
ముసలి నన్నమ్మతోడను మురిపముగను
కన్నబిడ్డలఁబోలె నీకడకువచ్చు
వారిఁ బోషించుచుంటి మావాఁడు నీ ప్ర
భావమును జెప్పుచుండుటవలన మేము
బెంగలేకుండనున్నాము- పేరుపొంది
నావు నీ వన్నదానంబునకును ధనము
నిన్నుఁగన్నదో ధనమును నీవు గన్న
దానవో "చాడ సుబ్బమ్మ" దలఁచి నిన్నుఁ
దలఁచుకొందు మటంచును బలుకరింతు.

ప్రొద్దువాలెను నేఁడు రేపు బడిలేదు
నేను వచ్చెద నంగడిలోని కేగి
తీయవచ్చును సరకులు తెల్లవాఱి
రండు మాగదిలోనికి - రాను బాబు
నన్నుఁ బోనిమ్ము నేఁటికి, నాన్న, నేనుఁ
దప్పకుండఁగ వత్తుము- తఱిమిచెప్ప
నాగ్రహము గాదు- వెఱ్ఱికన్నయ్య, యెంత
మాట! నీ వెక్క డున్నను మాగృహంబె
యది- పురంబులవారల కాంతరంగ
భక్తి యుండదు పైపయి పలుకుబడియె
కాని యెక్కడవత్తురోగద యటంచు
భయముఁ జెందుదు రనికొంద్రు- పల్లెటూరి
వారు- నీవట్లు పురవాసివా తలంపఁ
బోయివత్తును, పోరాజ! హాయిగాను
లేనిపోని విచారంబు మానుమయ్య,
యనుచు శామయ్య చనియె ననంతరమునఁ

గొన్ని నాళ్లకు బాలుని నాన్న యాది
వారమున వచ్చినాఁడు సావాసగాండ్రు
తోడరా వచ్చి గదిలోనఁ దోడి రి
వేలు వేలుగఁ జూపించి, వీర వీరు,
వీరు వీరని చెప్పుచు, వీరు నిన్నుఁ
జూడవలెనని యిపుడు నాతోడ వచ్చి
నారు- ననుఁ జూచుటకు నేఁడు వీరలిందు
నీవు రాఁబట్టి వచ్చిరి నేను వారి
యింటి కెప్పుడు రాకుండుటేమొ యిష్ట
మెన్ని సాకలు వచ్చిరి మొన్న మొన్న
తీర్థమున కని వచ్చిరి- తెలియరేమొ
నన్ను తెలియక యేమోయి పిన్నవాఁడ
తొందరగ వచ్చి పోదుము తొందరగను
ఏమి నీతోడ భాషింతు మేది నీకుఁ
బెండ్లమును బిడ్డలున్నను బెద్దయిల్లు
గొప్పయుద్యోగమున్నచోఁ దప్పకుండ
వచ్చి విందులు చేయుదు మిచ్చ వచ్చి
నన్నినాళ్లుందు- మగును నాయందుఁ బ్రేమ
యున్న నన్నియు నున్నవి యొక్కవాఁడ
నైన మీకేమి యేగతియైన నేమి
యిదియె నాయిల్లు మీరు వేయిజనమిచట
విందునకు రండు మీకుఁ గుబేరపుష్ప
కంబు వంటిది, మీది నాక్కడుదిమాట-
యిట్లు ముచ్చటమాటలయిన యనంత
రంబునను వారు- నీవు బల్డంబములను
గొట్టుచున్నావు నీ కిదిగోను సమయ
మిపుడు వచ్చెను. మీనాన్న యింకమీఁదఁ
బెండ్లి చేయఁగనున్నాఁడు, పెండ్లికొడుక
వగుదు నీవేమి దాఁచితి వగపడుచుము-

నాయనా దానికేమి, జానకిని నీకుఁ
బరిణయముచేయునఁట మంత్రవాది రాముఁ
డెంత లేకున్న నూరకే యిచ్చునను ము-
నూఱు నూటయేఁబది లేక తేరతేర
జరుగుపనిగాదు మనకంత జరుగుబాటు
లేదుగద పిల్లిచేయు పెండ్లి వలదనుట
మేలుగా దెట్టులైనను వీలుకొలఁదిఁ
దీర్చుకొనవచ్చు నని యప్పతీయ నెంచి
నాఁడ నిచ్చెదువారు నిన్న ననుగాంచి
యెంతలే దదిగాని నీ సంతకంబు
కూడఁ బత్రంబులో నుండఁగోరినారు.
అప్పచేయుచుఁ బెండ్లి చేయంగనేల
యతఁడు గాకున్న మఱియొకఁ డగును గాలు
చేయి కూడినయంతటఁ జేసికొంద
మను నను నుండంగ వచ్చె రామయ్య మరల
రమ్ము మామయ్య మొన్నను రాత్రి యుందు
మన్న నుండకపోయితి వౌనుగాని
సావకాశము గాలేదు చాలసేపు
నిలువనీ లేదు తొందర, నేఁడు చూడు
మెంతసేపుందునో- అగు నెంతకైనఁ
దగినవారలు మాభావ- లపుడు గోడ
మీఁది పిల్లి విధంబున మీఁదమీఁద
గొణిగిపోయితి నీవు నాకుఁ బరమాప్తుఁ
డవు మఱేమిటి జానకి యందగత్తె
యగునొ కాదొను మీవలె సుందరాంగు
లెక్కడున్నారు, మీకంటె మక్కువగల
బంధువులు నాకు లేరు నాపయిని బ్రేమ
యున్నదియు లేనిదియు నిప్పు డుబుకవలయు,
నాన్న యిక్కడనున్నాఁడు, నాకు మీకుఁ

గావలసినట్టి నలుగురు గలరు గనుక
చెప్ప సందేహ మేటికి, నప్పతీయ
వలసినది లేదు నే నిచ్చువాఁడ మీకు-

అంతవఱకేల యేమియు ననవసరము
తొందరెందుకు ముందు ముందు జరుగంగ
వచ్చుఁ, జదువేమొ యీ పురవాసమేమొ
చేత దమ్మిడిలేకుండఁ జిన్నతనము
గాదె తగుదుమటంచు రాఁగా సమస్త
మును బరాపేక్షగాఁ జేయ మనసురాదు
మీర లెక్కడఁబోదురు మేము నెందఁ
బోవువారము కొన్నాళ్లుపోయినంతఁ
గూడదా- కూడుఁగాని నాకు మఱికొన్ని
చిక్కులున్నవి మునుముందుఁ జేయుటకును.

తీరనిం డన్ని చిక్కులు తీరినంత
మాకుమీకును మంచిరా మనముగూడి
చేసికొందము- నిను నమ్మి స్థిరముచేసి
కొన్నవారము, సెలవుల కన్నిపనులు
చేసికొన్నాము మీనాన్న చెప్పినాఁడు
అందఱకు నిష్టమైనది- యందఱుకును
నిష్టమైనను మీరు నన్నేల యడుగ
నేను నందఱలోవాఁడఁ గానొ చెపుడ-

డబ్బులేదఁట నేనిచ్చుటకును బుచ్చు
కొనుట కిష్టము లేదఁట గొప్పచిక్కు-
దీనిలో నిమిడిన దప్పు తీయఁగూడ
దేమిచేయుద మెట్లగు నిద్ది చెపుమ-
అనిన నవ్వుచు బాలుఁ డయ్యా వినుండు
నెలనెలకు మీరుపంపు రూకలకు లెక్క-

వ్రాసియుంచితిఁ, దిండికిఁ, బాప, మంద
ఱును నొసంగెడు దానిలోనను సగంబు
తీసికొనుచుండె నాయొద్దఁ; దెల్లవారి
పొరుగువారింటిలోనికిఁ బోయియొక్క-
కుఱ్ఱవానిని జదివింతుఁ గొంత వారు
నాకు సాయముచేయుచున్నారు దాన
దీనవచ్చెడు దానితోఁ దీరుచుండె
చాకి మంగలి వెచ్చముల్- సాధ్యమైన
యంత నుప్పితముగ వాడి యందుమీఁద
మిగులునది దాఁచుచుంటి, నామీఁద నెప్డుఁ
బ్రేమయేఁగాని వేఱులే, దేమొ ముసలి
దెప్డు దేకళనుండునో చెప్పజాల
మిమ్ము నింపుగ నన్నచో మిమ్ము మరల
నడుగవలయు నటంచు మీకనుపకుండ
మిగిలినది నాకడనేయుంచి మీకుఁ దెల్ప
కున్నవాఁడను, గాని, నాయొద్దనున్న
లాభమేమని కొంత కాలంబునుండి
దాని "సేవింగ్సుబ్యాంకి"లో దాఁచుచుంటి
నేఁడు మూఁడేండ్లుగావచ్చె నోఁడు నాఁటి
కింతయో యంతయో వడ్డియిచ్చుచుండి
రింక నడుగదు గతమయ్యె వృద్ధురాలు
వలసినప్డుడు తీసి తేఁగలను దాని-
అనిన మాటలు విని యంద అద్భుతంబు
నొంది రౌరౌర యెంతటియుత్తముండు
నెంత పొదుపరి యెంతటి యితవుకాఁడు
చిన్నవారలలో నింత యెన్నికైన
గుణముగలవానిఁ గానము కోరినట్లు
దొరికె రామయ్య కల్లుఁడు దొడ్డవాఁడు-

పూటకూళ్లమ్మ యెంతటి పుణ్యవతియొ
డబ్బునకు గడ్డిఁదిందురు డబ్బుకొఱకుఁ
గులము మర్యాద బలగము గొప్పగౌర
వములుఁ బాటింప కేదేని పట్టణంబు
చేరి కవిదోషములలోనఁ జేరినట్టి
యన్నవిక్రయ మొనరింతు రట్టివార
లితనిఁ గనుగొన్నఁ ప్రేమించు టెంతవింత!
యనుచు నుతియించిరి మనంబు హర్షపూర్ణ
మైన రామయ్య బాష్ప నేత్రాంచలుండు
గాఁగఁ దండ్రియు నొడలెఱుంగని ముదంబు
నొంది రామయ్యఁ జూచె నయ్యంద అపుడు
బాలుఁ దోడ్కొని సన్నమ్మ పజ్జకరిగి
మంచిదానవు మఱినీవు పెంచినట్టి
బాలునకుఁ బెండ్లి, నీవును వానితోడ
సెలవు లిచ్చినపిమ్మట శీఘ్రముగను
రమ్ము; మఱియొక్కసారి వారంబు గడువ
వచ్చెదము నాఁడు నేఁటితర్వాయి మాట
లాడుకొందము రండని యరిగిరంత.

---

# మా చందాదారులకు

---

మా కార్యాలయమునకు వ్రాయు ఉత్తరములు మొదలయినవానియందు తమ 'చందాదారు' సంఖ్య వ్రాయవలెను. లేకున్న ప్రత్యుత్తరములు మొదలయిన పనులను జరుపజాలము. చందాదారుల సంఖ్య భారతి కవరుకాగితముపై తమ విలాసమునకు ముందున్నది. చందాదారులకు భారతి ౧౦-వ తేది లోపల అందకపోయిన యెడల వెంటనే తపాలువారికిని, మా కార్యాలయమునకును తెలుపగోరెదము

మేనేజరు, 'భారతి.'

---








## భాగ్' గుహాలయందలి కళావైఖరి

కవుతా రామమోహనశాస్త్రి గారు

అత్యుత్తమకళాప్రౌఢినెరపు యింకొక గుహా చిత్రశాల గ్వాలియరు సంస్థానమున మాల్వా గుజరాతు త్రోవయందు ఆ మధ్య కనుగొనబడెను. ఈ గుహాలయములు పొడిరాయి (Sand stone) రాతికొండలో మలచినవి. భారతప్రసిద్ధిచెందిన పాండవు లీకొండలలో నివసించి యుండనోపుదురు. ఇప్పటికిని వానికి ఆసరిసరముల 'పంచపాండుగుహాలు' అని ప్రసిద్ధి.



౨ భాగ్ చిత్రము



అజంతాచిత్రము ౧

ఈ **గుహాలు** ౬, ౭వ శతాబ్దమున బౌద్ధ సన్న్యాసులచే తొలచబడి కళాప్రతిష్ఠ చేయించబడియుండవలెను. విశ్వవిఖ్యాతములగు అజంతాగుహాలయములు యిచ్చటికి ౨౫౦ మైళ్లు దక్షిణపువైపు దక్కనుహైద్రాబాదున ఉన్నను, భాగుగుహాచిత్రాలేఖ్యములు వర్ణసంయోగమునను, అందు చిత్రింపబడినవారి ఆచార వ్యవహారములను అజంతాను మిక్కిలి పోలియున్నవి. కాని రూపవిన్యాసమునను, గీతల పొంకమునను అజంతాను మించినదైయున్నది.

సాధారణముగ గుహాలన్నియు ౮౪ అడుగుల నలుచదరము విస్తీర్ణమును, ౧౪౯ అడు



చిత్రము 3, ౪

గుల ఎత్తును కలిగియున్నవి. వీటిలో నాలుగవ గుహాయందు ముఖ్యమగునవి చిత్రించబడి యుండెను. తలలు(చిత్రములు ౩,౪,౫,౬) నాలు గవ గుహాలోనివే.

రాతిగోడల నొక్కులుగ చెక్కినమీదట యిసుక, మంచిసున్నము రేగడవంటి జిగట మట్టి, అతసీతున్దుభాద్యోషధులు కలిపిన లేప మును గోడకుమెత్తి అది ఆరినతర్వాత నీటి తో తడుపుచు ఆరులోపలనే చిత్రించువారు. వర్ణములు కొన్ని ఓషధులు రాళ్లు మొదలగు వాటిచే చేయబడుచుండెడివి: శ్రీ కజిన్సు పండితుడు కొలదికాలముక్రిందట అజంతా పరిసరముల కొండలలో ఒక ఆకుపచ్చరంగు రాతిని గుర్తించి సేకరించిరి. అది నీటితో



చిత్రము ౫

అరగతీసిన చక్కని ఆకుపచ్చరంగు వచ్చును. అది (Emerald green) కంటె కొంచెము ముదురు ఛాయ గలది. రాళ్లు, లేక ఓషధుల నుండియే యీ పురాతనశిల్పులు ఎరుపు, పసుపురంగులు కూడ తయారుచేసికొనెడివారు. గనుకనే అనేకవందల సంవత్సరములు యీ వర్ణములు నిలచియున్నవి. అది అజంతా, భాగ్ కాలపు చిత్రకారుల రహస్యము. కుంచెలు ముఖ్యముగ నారతోను, వెంట్రుకలతోకూడ చేసికొనెడివారు.

అజంతావలె బాటసారుః పోయిలపోగచే చిత్తరువు లన్నియు నల్లబారి, గబ్బిలములకు అడవిమృగములకు నెలవులై క్రమక్రమముగ చిత్తరువులు బెత్తిక లూడిపడిపోగా మిగిలిన వాటినిబట్టి, వర్ణవైచిత్ర్యమువిషయ మేమియు చెప్ప నలవికాకపోయినను సిద్ధహస్తు లగు 'భాగ్' చిత్రబహ్మలు చిత్రించిన రేఖానైపుణి అజంతాను మరపించుచున్నది.

భాగ్ గుహాలయములు మొత్తము యెనిమిది. కాని రెండు మూడు గుహాలయందు మాత్రమే అక్కడక్కడ చిన్నచిన్న ముక్కలు మిగిలియున్నవి. వాటి అన్నిటిలో యూరేగింపు టుత్సవము ముఖ్యమైనది. యేడుగురు స్త్రీలు ఒకపురుషుడు మేళవాద్యములత యూరేగింపు టుత్సవమున వెళ్లుట.

నా అజంతాసందర్శన మప్పటి చూ వ్రాతలలో (Copies) ఒక వృషభరాజము తామరతూండ్లు, పుష్పములచే పరివృత మ నొకకొలనునుండి ఛేదించికొని బయట ప నటుల చిత్రించబడిన చిత్తరు వొక కలదు. 'భాగ్' నందును అట్టిదియే యొక యున్నది. వీటి రెంటికిని మిక్కిలి పోలికయున్ ది. యుదాహరణము (చిత్రములు ౧, ౨) వీటి ర టిని పోల్చిచూచిన సామ్యము తెలియగలద మరియు భాగ్ నందలిది మిక్కిలి నైపుణ్యము చూపుచున్నది.

భావగంభీరములు, సౌందర్యరసపుటవలును అగు హిందూచిత్రరచనలలో భా చిత్తరువులు అత్యున్నతస్థానమును నెరపున టకు సందియము లేదు. యీ పురాతనక భాండారము లగు గుహాలయముల యిప్ప కైనను గ్వాలియరుసంస్థానాధీశులు శ్రద్ధ తీ కొని కాపాడుచుండుటకు వా రెంతయు వం నీయులు. కాని శిథిలావస్థలో యున్నవగు ఎంత జాగ్రత్తపడినను యీ చిన్నముక్క కూడ అనతికాలముననే రాలిపోయిన అస భవము గాదు.

---







ఆదిపూడి వసుంధరాదేవిగారు,
యం. ఏ., బి. యస్. సి., యఫ్. సి. యస్.

శ్రీయుత ఆదిపూడి సోమనాథరావుగారి పుత్రిక యగు నీమె యం. ఏ., బి. యస్. సి. (ఆనర్సు) గారు ఇంగ్లాండునుండి గత శుక్రవారమునాడు ఇండియాకుచేరి సోమవారమునాడు చెన్నపురికి విచ్చేసిరి.

శ్రీమతి వసుంధరాదేవిగారు చెన్నపురియందలి రాజ[illegible] కళాశాలలో చదివి, కెమిస్ట్రీలో యం. ఏ. పట్టమును పొందిరి. 1927 సంవత్సరం జూలై నెలలో ఉన్నత విద్య నభ్యసించు నిమిత్తమై చెన్నరాష్ట్ర ప్రభుత్వమువారీమెను ఇంగ్లాండునకు బంపి, యీ మూడు సంవత్సరములు సం॥ ఒకటింటికి 300 పౌనుల విద్యార్థి వేతనము నొసంగుచుండిరి. శ్రీమతి వసుంధరాదేవిగారు లండన్ విశ్వవిద్యాలయమునకుజేరిన బెడ్‌ఫర్డు స్త్రీలకళాశాలలో జేరి యిటీవలననే బి. యస్. సి. పరీక్షయందు 'ఆనర్సు'తో ఉత్తీర్ణులయిరి.




శ్రీమతి యం. ఏ. జానకికన్యగారు

ఈమె యం.ఏ. శ్రీనివాస అయ్యంగారి కొమారిత. మేరీరాణి కళాశాలలో చదివి బి. ఏ. పట్టమును పొంది యిపుడు న్యాయకళాశాలలో బి. యల్. పరీక్షకు చదువుచున్నది.




శ్రీమతి ఏ. సి. దేవకమ్మ కన్యగారు

ఈమె మేరీరాణికళాశాలయందు చదివి చరిత్ర (ఆనర్సు) పరీక్షయందు సత్తీర్ణులయినవారియం దగ్ర స్థానమును వహించినది.



శ్రీమతి అన్నా చాందిగారు

తిరువాంకూరు హైకోర్టులో న్యాయవాదవృత్తి నవలంబించిన మొట్టి యువతీమణి.



చెన్నపుర విశ్వవిద్యాలయ పట్టభద్రులు



శ్రీమతి మీరాబాయికన్య (మిస్ స్లేడ్)

గాంధిమహాత్ముని శిష్యురాలగు నీమె రాటముపై నూలుతీయుచున్నది.

## రంగుల పింగాణిబిళ్లల చిత్రములు

ఇవి లాహోరుకోటలోనివి. పదునేడవ శతాబ్దము పూర్వార్ధమునకు చెందినవి. వీనిని జహంగీరు చక్రవర్తి తొలుత చిత్రింప మొదలుపెట్టెను. షాజహాను కాలమున అభివృద్ధిలోనికి వచ్చినవి. తరువాతి సుల్తానులు ఇట్టివానిని తలపెట్టినట్లు కానరాదు ఈ కాలముననే భారతదేశమున అలంకారచిత్రకళ (Decorative Art) ప్రసిద్ధికి వచ్చినది. ఇట్టి చిత్రరచన లాహోరుకోటకు విశిష్టలక్షణమయ్యెను. వివిధాలంకారచిత్రములు, మనుష్యచిత్రములు, మృగపక్ష్యాదులచిత్రములు ఈ విధానమున రచించదగును. గోడలపయి వివిధవర్ణములు గల పింగాణిబిళ్లల గాని, గాజుబిళ్లలనుగాని, చిన్న పెంకులను గాని అతికి చిత్రములను రచియింతురు. ఈ చిత్రములు మిగుల సుం రములుగ నుండును. కొన్ని చిత్రముల ప్రతికృతులు ఈ సంచికయందు కలవు.

—ఇండియన్ ఆర్టు అండు ఇండస్ట్రీ జర్నల్ నుండి

---



"డ్రమండు హే" దొరసానిగారు

యాత్రికురాలు. సుప్రసిద్ధ యగు వార్తాపత్రికా లేఖకురాలు. దక్షిణఅమెరికా మొదలయిన దేశముల మె నాలుగు విమానములపైని ప్రయాణించెను.

—టైమ్సు ఆఫ్ ఇండియా, 3-8-1930.



ప్రకృతము లండను నగరమునందలి వెస్టుమినిస్టరు కెతిడ్రలు (ఇది యొక గొప్పభవనము) లో రంగుల పింగా నుముక్కలతో చిత్రము లతుకబడుచున్నవి. అవి మగియుటకు ఇరువదియేండ్లగును. పైనున్న చిత్రము అట్టి వానిలో నొక్కటి. చిత్రకారుడు జోసిగారి చిత్రమున నున్న యాతడే.

—టైమ్సు ఆఫ్ ఇండియా పత్రిక, 14-8-1930

---

## వ్యాయామము (వెనుకటి సంచిక తరువాయి)

### జోసెల్ఫ్‌గారి అభ్యాసము



చిత్రము ౪

చేతులు ప్రక్కలుచాపుకొని వెలికిల పండుకొని మోకాళ్లను జాపిపట్టి, బొటనవ్రేళ్లు నిక్కబొడుచుకొని యుండ కాళ్లను మెల్లగా మీదికి లేవనెత్తి చిత్రమునందున్నరీతిని తలకు ఎగువ నేలపయిన ఆనజేసి మరల మొదటిరీతికి తీసికొనిరావలెను. –



చిత్రము ౫

పై చిత్రమునందువలె చేయుచు కాళ్లను చేతులను ముందుకుచాపియే కూరుచుండవలెను. తరువాత ముందుకువంగి తలను మోకాళ్లపయినుంచి చేతులతో మడమలను పట్టుకొనవలెను. ఇట్లుచేయుటవలన పొత్తి కడుపునందలి నరములు గట్టిపడును. వీపున బిగి సడలి బలము ఎక్కును.



చిత్రము ౬

తొలుత నాలవచిత్రమునందువలె చేసి కాళ్లను మరల మొదటిస్థితికి తెచ్చునపుడు, రెండుచేతులతో నడుమును బట్టుకొని చిత్రమునందువలె ఒడలి బరువంతయు చేతులపయినను, మెడపయినను ఆనునట్లు రెండు కాళ్లను నిలువుగ మీదికి నెత్తవలెను. అంతట కుడిమోకాలిని వంచి ఎడమమోకాలిని జాపియుంచవలెను. తరువాత ఎడమమోకాలినివంచి కుడిమోకాలిని జాచవలెను. ఇట్లు సైకిలుపై ప్రయాణముచేయువానివలె ఒకకాలు తరువాత నింకొకదానినిగా పలుమారు ముడుచుచు జాపుచునుండవలెను. మరల కాళ్లను తల కెదుప నేలపై నానునట్లు చేయవలెను. మరల మొదటివలె జాపివేయవలెను. ఇట్లు చేయుటచే పొత్తికడుపును బలపరుచును. ఒడలికి చురుకు కలిగించి ఎటువలసిన నటుంచుకొన వీలుగలుగజేయును.

---



బౌద్ధ శిల్పము
(౧౮౦౦ ఏండ్లనాటిది)

“గాంధారశిల్పవిధానము ననుసరించి చెక్కిన యీ దంపతీవిగ్రహమున పంచికుడు, అతనిభార్య హారిత గలరు. వీరు ఇలువేల్పులుగ భావింపబడుదురు. పంచికుడు ఒకచేతపట్టిన బల్లెముపై నొరగియున్నాడు. ఇంకొకచేత నొకొకపుడు రొక్కపు ముడుపును పట్టుకొనియుండును. బిడ్డల నిచ్చు వేలుపగు హారిత కుడిచేత నొడిలోనున్న తన చిన్నిపాపను బట్టికొనియున్నది. ఎడమచేతిని భర్త మోకాలిపై నూనియున్నది. పిషావరు, తత్ప్రాంతములనుండియే ఇదివరకు నారుచిత్రము లిట్టివి లభించినవి. వానియందు స్త్రీవిగ్రహము ఎడమవైపున నున్నది. ఇందు కుడివైపున నున్నది. ఈ కారణమునుబట్టియు, ముఖవైఖరినిబట్టియు పనివానితన మంత సుష్ఠుగ లేకున్నను దీని నిర్మాణకాలము క్రీ.త. ఒకటవశతాబ్ది చివరకి తరువాతికి రాజాలదు.” అని ఫ్రెంచి బౌద్ధశిల్పకళాప్రవీణుడు ఫోచరుగారు వ్రాసిరి.

—టైమ్సు ఆఫ్ ఇండియా, **24-8-30.**




ఆంగ్లస్త్రీల ఆతపస్నానము (Sun-bath)

# కర్కశశోభ

— కాళూరి వేంకటనరసింగరావు గారు

నీవు నిత్యసుహాసిని వేలుకొందు
వాసుధాలోకమధురవిహాయసముల
రాజ్ఞివగుచు శాసింతువేలా, విషాద
నిబిడకుంతలచ్ఛాయా వినీలమైన
నాహృదయవార్ధిగర్భశూన్యమ్ము కూడ?
ఈక్షుధా ఘోషణ మ్మెప్పుడేని పొంగి
నీసుధారథగాన ఘూర్ణితవిశాల
పూర్ణిమా శుభ్రవీథుల మ్రోయునా! ని
రంతరావేదనా విధురస్వరమ్ము.

పొంగు నిర్ఘోషపక్షాల పొరలిపొరలి
నీకళాలోకస్వర్గీయ నిలయములకు
కలలవంతెన గడుదునా! లలితకిరణ
డోలికలను కాలాయతి వాలిపడగ.

అచట, చిన్మయజ్యోత్స్నావిహారజీవి
తామృతయుగాల చిరపిపాసావిలమతి
నొక్కక్షణమయికరగుదునో! శశీ! అ
నంతజ్యోతిస్సులక్ష భవదంతికమున.

సరసజీవనాశయులు, ఆశాప్రవాస
పాంథు, లంబుద సుతులు పాపము! నిరాశ
తావకవిలాసతన్మయతావిముగ్ధ
లైకళాశృంఖలముల నల్లాడుదు రదే!

అమృతమోహిని వింత విశ్వాంతరాత్మ
నేలవేచెదు నీకళాజ్వాలికలను
నిర్దయాకర్కశమ్ములు నీయతీత
హాసరాసశోభాప్రణయములు మాకు.




## శంకర మహా మనన

వై. సుబ్బారావుగారు, గ్రంథకర్త. ఇది అధ్యాత్మ గ్రంథావళి యందలి ప్రథమగ్రంథము. అధ్యాత్మవిద్యావిషయములు గల గ్రంథముల నుండియు అనేకాద్వైత భాష్యముల నుండియు సూక్తులను సంగ్రహించి గ్రంథకర్త వేదాంతసారాంశమును కర్ణాటభాషలో సులభశైలిని స్పష్టముగా దెలిపినాడు. ఇందలి విషయప్రణాళికయు బోధావిధానమును శ్లాఘ్యములుగా నున్నవి. ఈ చిన్ని పొత్తముయొక్క ఆకారమును అచ్చును అందముగా నున్నవి. వెల రు. ౦-౨-౬ మాత్రమే. వేదాంతప్రియులందరు నాదరింపదగినది.

విలాసము :— అధ్యాత్మప్రకాశకార్యాలయము, రెండవవీథి, చామరాజుపేట, బెంగుళూరు సిటి.

కూ. న.

---

## భక్తిపథము

చిన్న సైజున రమారమి ౮౦ పుటలు. గ్రంథకర్త: విద్యాభూషణ,కవిరత్న నరసింహశర్మ. వెల రు౦-౮-౦; వలయువారు వాఙ్మయోల్లాసినీ గ్రంథమాలకు మదనపల్లెకు వ్రాయునది.

ఇదియొక వచనగ్రంథము, భక్తి, భక్తిభేదములు, భక్తిసోపానములు, భక్తిపథమున కర్తవ్యాలు, భక్తిసాధనోపాయములు, భక్తియొక్క గమ్యస్థానము అనునవియిందు విమర్శించిన విషయములు.

గ్రంథస్థరచనాప్రణాళికహృదయంగమము కాక చదువరులకు నెంతయు విసువు జనింపఁ జేయుచున్నది. పదములు వ్యాకరణవిరుద్ధములు, వాక్యములు దోషభూయిష్ఠములు. ఉదాహరణార్థమై యాయా గ్రంథములనుండి యుద్ధృతములగు శ్లోకాదులుకూడ దోషజుష్టములయి కాన్పించుచున్నవి. విషయవిభాగముకూడ పౌనరుక్త్యాదిదోషములకు తావిచ్చుచున్నది.

"శంకరుఁడు, శైవమతమును, రామానుజుఁడు వైష్ణవమతమును, మధ్వాచార్యుఁడు మధ్వమతమును, స్థాపించి వారి ద్వైతాద్వైతవిశిష్టాద్వైతసిద్ధాంతములతో ననంతములైన సంశయములు కల్పించి యున్నారు." (౪-వ పుట).

ఈవాక్యములోఁగల మంచిచెడ్డలు పరికింతురు గాక!

"ధర్మసంస్థాపనార్థం సంభవామి యుగేయుగే." (౪ పుట).

"అని శ్రీకృష్ణభగవాను డానతిచ్చినటుల భక్తులెందరేని ప్రతియుగమునందును పుట్టుచుందురు" భగవానుఁడు ధర్మసంస్థాపనార్థమై భక్తులు పుట్టుదురనియా నెలవిచ్చెను?

"భగవత్సాయుజ్యమునకు భక్తివినా పథేతరంబు దుర్లభంబు" ఇందులో రెండు విశేషములు, పదముల సంధింపులోఁగల జాగరూకత, అర్థానుసారమగు పదసంఘటనలోఁ గల మెలకువ." (౭ పుట).

"అట్టి విముక్త్యనాసౌలభ్యమునకు" (౧౦ పుట)

"సాంధ్యరామ సంధ్యారుణకాంతుల నేలఁ గ్రుమ్మరించుట" (౧౫ పుట)

"మాతృదేవోభవ" "దేశమాతయు "దేవోభవ" పైదానికర్థము మృగ్యము. (౩౮ పుట)

ఇంకను వేనవేలు దోషములు గలవు. వాని నన్నింటిని విమర్శింప నొక ప్రత్యేకపుస్తక మగునని చాలించితిమి. ఇట్టిగ్రంథములవలన వాఙ్మయమునకు లోకమునకు కాగలఉపకారముమృగ్యము. పైగ్రంథమాలధనసంపాదనకై పెట్టినచో దీనిమూలమున లోకమునకుఁ దీరని లోటు వాటిల్లును. ధనార్జనోపాయము లసంఖ్యములు గలవు. వాని నవలంబించుట లెస్స. లోకమునకు మేలే యొనరింపనున్నచో నుత్తమపండితులచే సద్గ్రంథములు వ్రాయించి జాగరూకతతోఁ బ్రకటించిన, లోకోపకృతికి భాషాసేవకుఁ బాటుపడినవార లగుదురు. ఎట్లయిన భావిగ్రంథరచనలో నెక్కుడు శ్రద్ధచూపుదురు కాక ప్రథమకుసుమమే ఇట్లుండ తరువాతి కుసుమము లెట్లుండునో యని చదువరు లూహింపక మానరు.

ఉభయభాషాప్రవీణ, బులుసు నరసింహశాస్త్రి.

---

## భస్మప్రకాశిక - ఆంధ్రతాత్పర్యసహితము

గ్రంథకర్త: 'ఆయుర్వేదభూషణ' 'భిషగ్వర' శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి (A. M. A. C.) గారు. ౭౬ పుటలు. వెల రూ. ౧-౦-౦. ద్వితీయముద్రణము. ౧౯౩౦ సం॥

ఇందు సులభముగ భస్మాదులను తయారు చేసికొనుట కనువగునట్లు 'రసరత్నసముచ్చయము,' 'రసరత్నాకరము' మొదలగు రసగ్రంథములందలి కొన్ని శ్లోకముల కాంధ్రమున అర్థము గలదు. మీదు, గ్రంథకర్తల స్వానుభవము, ప్రక్రియావిధానములుగూడ చక్కగ వివరింపబడి యున్నవి. సర్వజనలభ్యములు గాని 'ఇంగిలీకపుకట్లు,' 'పాషాణపుకట్లు' మొదలైన కట్టుమందులను చేయు పద్ధతులను శ్రీ శాస్త్రిగారు సంపాదించి యిందు వెల్లడించినారు. ఇంతేకాక 'పట్టీలను' 'పాలాస్త్రిలను' కూడఁ గొన్నింటి నిందు వివరించిరి. 'సిద్ధభస్మపరీక్షావిధానము,' 'భస్మప్రమాణము,' (మోతాదు), 'భస్మముల కనుపానములు,' 'భస్మసేవనయందు పథ్యాపథ్యములు' మొదలగువానిని గ్రంథాదియందు వేఱొక్కని 'విషయము లను' పేర నుపయుక్తపరిభాషలఁ గొన్నింటిని, భస్మానుకూల ద్రవ్యపరీక్షావిధానములను 'పుట' రీతులనుగూడ సుబోధకములగునట్లు వ్రాసిరి. చక్ర.నిశ్శైలి శ్రీ శాస్త్రిగారు 'ఆయుర్వేదౌషధరత్నాకరము,' 'ఆంధ్రభైషజ్యరత్నావళి' మొదలగు గ్రంథరాజముల నిదివరకే యాంధ్ర వైద్య విద్వన్మహాశయుల హస్తముల నలంకరింపజేసియుండిరి గాన వారి నింకను నాయుర్వేదాభివృద్ధికి దోడ్పడునటుల ప్రోత్సహించుట యాంధ్రవైద్యసోదరుల కర్తవ్యము. గ్రంథముద్రణాదులు సుందరముగ నున్నవి. పై గ్రంథము వలయువారు గ్రంథకర్తగారిపేర బెజవాడకు వ్రాసినచో బడయగలరు.

కా. రా. దత్త.

---

## కవి కల్పలత

దేవేశ్వరమహాకవి విరచితము. శ్రీ కల్లూరి వెంకటసుబ్రహ్మణ్యదీక్షితకృతాంధ్రవివరణసహితము.

డిమ్మిసైజున పుటలు 386. వెల 2-8-0.

ఇది కవితాకన్యను వరింపగోరువారి యుపయోగార్థమై దేవేశ్వరమహాకవిచే గీర్వాణభాషయందు వ్రాయబడిన లక్షణగ్రంథము. లక్షణగ్రంథమే కాని తక్కిన లక్షణగ్రంథములవంటిదిగాదు. వాటికిని దీనికిని లక్షణగ్రంథత్వసామ్యమే. అవి కావ్యములు, నాటకములు, రసము మొదలగు వాటియొక్క లక్షణాదులం దెలుపునవి. ఇదియో కవిత్వము నభ్యసింపగోరువారికి వలయు సామగ్రిని సమకూర్చునది. కవులపాలిటి కల్పలతయని దీని కీ పేరెంతయు తగియున్నది. ఇందలి విషయములే దీని యపూర్వతను సాధించును.

కాని గీర్వాణవాణి యాంధ్రదేశమున విరళప్రచారయగుటచే నింతవర కిద్దాని కందు తావబ్బినది కాదు. ఆంధ్రుల పుణ్యపరిపాకమున శ్రీ దీక్షితులవారి వివరణావలంబమున నిది యాంధ్రదేశమునం దడుగిడినది. ఇట్టి మహోపకార మొనర్చిన దీక్షితులవారి యుద్యమ మెంతయు కొనియాడదగినది.

వివరణము వ్రాయుచో దీక్షితులవారు గ్రాంథికము గాకపోయినను సరళమైనభాషనే యాదరించి తమ యుద్యమమును చక్కగా సాగించిరి. కాని, యందందు అనన్వితములును, క్లిష్టాన్వయజుష్టములు నగు వాక్యము లుండుటచే పాఠకుల కించుక శ్రమ గలిగించినవా రయిరేమో?

అసలు తమ కతిప్రయాసమున లభించిన మాతృకయందే బహుళములగు దోషము లుండినందుచేతను, గ్రంథరచనమున తమ కిదియ ప్రథమప్రయత్న మగుటచేత ననేకదోషములు సంభవించినవని దీక్షితులవారే పీఠికాముఖమున వ్రాసికొని యున్నారు. దోషము లున్నవని యెఱింగియు వాటి నటులనే ప్రచురించుట యెంత భావ్యమో. సామాన్యగ్రంథవిషయమున నైనచో నిట్టి దోషము లుపేక్షణీయము లయిన నగుగాక. అపూర్వములును, లాక్షణికములు నగు నిట్టిగ్రంథముల విషయమునం దిట్టి యుపేక్ష యేమాత్రమును తగదు. వివరణము వ్రాయుటయన్న వ్యాఖ్యానము వ్రాయుటయేకదా! వ్యాఖ్యానము దుష్టమైనచో మూల మెంతమాత్రము పాఠకుల విషయమున సఫలముగాగలదు? తమకు లభించిన మాతృకను లిఖితప్రతులతో సరిపోల్చి చూచి వివరణమును సవరించి వ్రాసియుండినచో వీరి యుద్యమము ప్రశస్తతర మయియుండెడిది.

మరియు మాతృకయందు లక్షణవిరుద్ధములుగ గన్పడిన శ్లోకములను సవరించుట భావ్యము గాదని వాటిని యథావస్థితముగనే ముద్రింపించితిననియు వ్రాసినారు. దోషములని తెలిసినవానిని సవరించుట యెందులకు భావ్యముగాదో? సవరించినంతన రచయితల నవమానించి నటు లగునని యేమో వీరి యభిప్రాయము. లేఖకుల యొక్కయో, ముద్రాపకులయొక్కయో దోషములను సవరించినంతన రచయితలకు వచ్చునది యేమి? మీదు మిక్కిలి దోషములను సవరించనందున రచయితల ప్రతిష్ఠకే భంగము కలుగునేమో?

మాతృకను సవరించనందున గల్గిన దోషములను మచ్చునకు గొన్నింటి నిం దుదాహరించెదను చూడుడు:-

పుట ౭౮. శతపత్రం=పద్మము, నెమలి. అని వివరణము. ఇది యొకవస్తువునకే శ్లేషచే నెఱుపు తెలుపు వర్ణముగల వస్తువులను నిరూపించు సందర్భమున గలదు. ఇందులకు మూలము.—'సితపత్రం.హంసపద్మయోః.' అని.

పుట ౭౭. శ్లేషచే నొకదానికే లోహితనీలముల నిరూపించు సందర్భమున 'కమలం జలపద్మయోః' అని మూలమునందుండ 'కమలం=పద్మము, నీటిమలము' అని వివరణమున గలదు.

ధూసరవస్తునిరూపణము—

ధూసరాశ్వరజోలూతా కరభో గృహమేధికా,
కపోతమూషికా రంగ కాకకంఠఖరాదయః.

ఇందుల టీకయందు 'కాకః=కాకి, కంఠః=కుత్తుక' అని గలదు. కాకకంఠము ధూసరముగాని యిం దెద్దియు గాదు.

పీతవస్తు నిరూపణమున—

'కింజల్కం=పుష్పములయందలి పుప్పొడి' యని వివరణము. కింజల్కములన కేసరములుగాని పుప్పొడి గాదు. 'కింజల్కః కేసరోఽస్త్రియామ్'—అమరము.

వాదితర్జనమున—

పుట ౧౪౭.............

తులయా తోలనం మేరోః కరేణ స్థగనం రవేః.

అని మూలము.

దీనికి టీక.

మేరువును తొలచుటయు లేక తొలకరచేత మేరుపర్వతమును త్రాసుచే దూచుటయు, హస్తముచే సూర్యుని నిలుపుటయునని.

'స్థగనమ్' అనిన నిలుపుటయట.

సమస్యాపూరణోపాయకుసుమము—పుట ౨౭౩.

'కాలీయాహిగ్రహవ్యగ్రే యమునాయాం జగన్నిధౌ,
తత్కాలేఽధోముఖంజాతం విపరీతంజగత్త్రియ'మ్మని
యందలి మూలము.

ఇందలి 'తత్కాలేఽధోముఖం జాతం' అనుటకు 'ఝంపయాఽధోముఖేజాతే' అనుపాఠము లిఖితప్రతి యందు గలదు. ఇదియే సరసముగ గన్పట్టెడిని.

గ్రంథమందలి మూలమునకు టీక.

సకలలోకములను గుక్షియందుదాల్చిన శ్రీకృష్ణుడు యమునానదియందు దలక్రిందగునట్లు గాళీయసర్పము బట్టనుంకింపగా నా సమయమున ముల్లోకములును దల క్రిందాయెను అని.

కాళీయసర్పమును బట్ట తలక్రిందగునట్లుంకింపనేల? అది కాదు. కాళీయసర్పమునుబట్ట యమునాతీరమునందలి వృక్షము నెక్కి యందుండి తలక్రిందగునట్లు నీటనురుకగా కుక్షిస్థములగు ముల్లోకములు తలక్రిందాయెను. అన్నచో సరసముగ నుండును. ఎత్తైనప్రదేశములనుండి నీటదుముకు నపుడు తలక్రిందుగ దుముకుట సహజము.

అదే కుసుమమున—వాత్సల్యాద్యథా—

అతుచ్ఛవత్సవాత్సల్య పిచ్ఛిలీకృతచేతసా,
జనన్యా మన్యతే ఽత్యర్థం వ్యాఘ్రు స్సౌమ్యవపుః క్షు
[మీ. అని మూలము.

టీక: అత్యధికమగు పుత్రప్రేమచే వ్యాప్తమగు చిత్తముగల పులి భయంకరముగాని యాకృతిగలదిగను, ఓరిమిగలదిగను దలంపబడుచున్నది అని.

తలంపబడుట ఎవరిచేతనో? అటు గాదు. వ్యాఘ్రము వాత్సల్యపరిపూర్ణమగు హృదయముగల తనతల్లిచే సౌమ్యముగల శరీరముగలదిగను, ఓరిమిగలదిగను తలంపబడుచున్నది అని యుండవలయును. తనచిన్నబిడ్డ క్రూరమైనదని తల్లి యెన్నటికైన నంగీకరించునా? 'కాకిపిల్ల కాకికి ముద్దు' గదా!

మరియొకటి.

పదభంగేనయథా—

అయంమృగ స్సమాయాతి మృగాత్సింహః పలాయ తే,
ఇతో వేగాత్పలాయస్వ త్వరితై స్త్వరితైః పదైః.

టీక. ఇందు (మృగానత్తీతి) మృగాత్ = మృగములను భక్షించునట్టి, సింహః=సింగము, తే=నీయొక్క, పలాయ=మాంసముకొఱకు, పలాయతే=పరుగెత్తుచున్నది [అని.

పలాయతే అనుపదమునకు 'పలాయ, తే' అని విభాగము గావింపగా మరల 'పలాయతే' అను మరియొక పద మెచటనుండివచ్చినదో వీరికి. సమాయాతి=వచ్చుచున్నది అనిగదా యుండవలయును.

ఇట్టి వెన్నియేని గలవు. ఇక ముద్రణదోషములకా పరిమితి లేదు.

ద్వితీయముద్రణమందైనను ఇట్టి దోషములకు తావొసంగకుందురు దీక్షితులవారని నమ్మెదము.

సరళముగ సమన్వయింపలేని అనుబంధమున జేర్పబడిన శ్లోకములలోగూడ పెక్కులు సరళములైనవే చేర్పబడినవి.

చూడుడు కొన్నిటిని—

'అమత్రీభవత స్తత్ర పీయూషపరివేషణే,
అభూన్నారదవీణాయా అలాబోరంతరే సుధా.'

'అహల్యాకేలికాలేఽభూత్కందర్పాణాంశతద్వయం,
తత్పంచబాణీభిన్నాక్షు స్సహస్రాక్షోఽంగతాంగతః.'

'జలముచి జలపూరం ముంచతి స్పష్టశబ్దం
ప్రతిగజ ఇవ కోపాదూర్ధ్వ వినస్తహస్తాః,
సపది సముపజాతోదన్యయా వ్యాత్తవక్త్రా
స్సలిలకరదండాః కుంభినోఽంభః పిబన్తి.'

సమస్యాపూరణశ్లోకము లివి.

కాని యపూర్వగ్రంథసముద్ధరణోద్యుక్తులగు దీక్షితులవారు మిక్కిలి ప్రశంసనీయులు. వివరణమున నిట్టి దోషములు లేకుండినచో బంగారమునకు పరిమళ మబ్బినట్టుండెడిదని మాత్రము చెప్పకతప్పినదికాదు. ఇట్టివే మఱికొన్ని యపూర్వగ్రంథములను ఆంధ్రలోకమున కందజేసి వారిశ్లాఘకు పాత్రులగుదురుగాత!

గ్రంథము దొరకు వారు:

కల్లూరి వేంకటసుబ్రహ్మణ్యదీక్షితులు, కవికల్పలతానికేతనము, ప్రక్కలంక, తణుకుపోస్టు, గోదావరి జిల్లా అను విలాసమునకు వ్రాయవలయును.

తి. వెం. రం.

---

## కావ్యమీమాంస

ఇది సంస్కృతభాషను వెలసిన యొక యపూర్వ సాహిత్యవిమర్శనగ్రంథమునకు ఆంధ్రవచనానువాదము. అనువాదకులు కావ్యవ్యాకరణతీర్థబిరుదాంచితులు శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిలుగారు. వీరు 'ఆర్య భారతీ గ్రంథమాలిక' యనుపేర నొక గ్రంథమాలను స్థాపించి ఇదివఱకే వాత్స్యాయనకామసూత్రములను, గౌతమ ధర్మసూత్రములను అనువదించియున్నారు. ఈ గ్రంథము లాంధ్రలోకమునకు పరిచితములే. ఈ కావ్యమీమాంస మూడవగ్రంథము. ఇంకను నీ రీతిగ్రంథములనే ప్రకటింపబూనియున్నట్లు 'విజ్ఞప్తి' యందు గలదు. ఆంధ్ర భాషామాత్రజ్ఞానము గలవారికందుబాటున లేని ప్రాచీన సంస్కృతశాస్త్రగ్రంథముల నీరీతిమున బహువ్యయ ప్రయాసముల కోర్చి యనువదించి ప్రకటించి యాంధ్ర లోకమున కొసంగిన శ్రీ శాస్త్రిలుగారి దేశభాషాభిమానముల గుర్తించి వీరిని దగినరీతిని ప్రోత్సహించుట యాంధ్రసహృదయుల కవశ్యకర్తవ్యము. ఇక ప్రకృత గ్రంథవిమర్శనము. తొలుత మూలగ్రంథప్రాశస్త్యమును గూర్చి ఇంచుకంత పేర్కొనదలను.

* మూలగ్రంథము తొమ్మిది పదిశతాబ్దముల సంధి కాలమున నుండిన రాజశేఖర కవిరాజు రచియించెను. ఈతడు బాలరామాయణము, బాలభారతము, విద్ధసాల భంజిక, కర్పూరమంజరి యను నాలుగు నాటకములను రచియించి ప్రఖ్యాతిని గాంచిన మహాకవి. హరవిలాస మను నొక మహాకావ్యమును సైత మీతడు రచియించినట్లు లక్షణగ్రంథస్థోదాహరణములవలన తెలియవచ్చుచున్నది కాని యాగ్రంథము లభించినట్లు కానరాదు. భువనకోశ మను గ్రంథ మొకటి రచనది యున్నట్లు లీతడీ గ్రంథమున జెప్పియున్నాడు. ఇట్లెన్నియో యుత్కృష్ట గ్రంథములు కాలప్రవాహమునబడి కొట్టుకొనిపోయి నామమాత్రావశిష్టము లయినవి. ఈ కావ్య మీమాంసయు ప్రథమాధికరణమాత్రమే ఉపలబ్ధమయి ప్రకటితమయినది. ఇందు పదునెనిమిదధ్యాయము లున్నవి. వానిలో మొదటిదగు శాస్త్రసంగ్రహాధ్యాయమున నీ కావ్యమీమాంస పదునెనిమిది యధికరణముల గ్రంథమని తెలియవచ్చుచున్నది. సంపూర్ణముగ విరచితమయి యుత్పన్న మయ్యెనో లేక యసంపూర్ణముగనే నిలిచిపోయెనో గుర్తింప నాధారములు గాన్పింపవు. ఉపలబ్ధాధికరణమున నీక్రిందివిషయములు గలవు.

మొదటిదగు శాస్త్రసంగ్రహాధ్యాయమున నీ కావ్యమీమాంసాగ్రంథోత్పత్తి వివరింపబడినది. రెండవదగు శాస్త్రనిర్దేశాధ్యాయమున వేదశాస్త్రాది వాఙ్మయవిభాగ నిర్దేశమునుగూర్చి వివరింపబడినది. మూడవదగు కావ్య పురుషోత్పత్త్యధ్యాయమున కావ్యపురుషోత్పత్తి, సాహిత్యవధూత్పత్తి, వారి దేశసంచారాదులు, వారి పాణిగ్రహణాదులు మొదలగు నపూర్వవిషయములు గలవు. నాలవదగు పదవాక్యవివేకాధ్యాయమున (?) అనుశాసింపదగిన శిష్యగుణభేదములు, సమాధి, అభ్యాసము, శక్తి, ప్రతిభాదులు, వానిభేదములు, వానిలక్షణములు, కవుల భేదములు, లక్షణములు, భావకత్వ కవిత్వవిభేదము, భావక భేదములు మొదలగునవి కలవు. అయిదవదగు కావ్య పాక కల్పాధ్యాయమున శాస్త్రకావ్యోభయ కవుల భేదములు, తత్ప్రత్యేకాంతర్భేదములు, తల్లక్షణములు, మృద్వీకాది నవవిధ కావ్యపాకముల లక్షణములు మొదలయినవి కలవు. ఆరవదగు పదవాక్యవివేకాధ్యాయమున సుప్తిఙాదిపదభేదములు, లక్షణములు, అభిధాభేదలక్షణములు, వాక్యములు, ఏకాఖ్యాతాదులు, తద్భేదములు, కావ్యలక్షణాదులు మున్నగునవి కలవు. ఏడవదగు పాఠ ప్రతిష్ఠాధ్యాయమున బ్రాహ్మశైవాది వాక్యభేదములు, తల్లక్షణములు, రీతులు, కాకువు, తద్భేదములు, లక్షణములు, మగధాదిదేశములవారి పాఠప్రతిష్ఠ (ఆయాదేశములవారు చదువుపద్ధతి) మొదలయినవి కలవు. ఎనిమిదవదగు కావ్యార్థయోన్యధ్యాయమున శ్రుతిస్మృతీతిహాసపురాణాదులగు పదునారు కావ్యార్థయోనులు, వానిలక్షణములు వర్ణితములయినవి. తొమ్మిదవదగు అర్థవ్యాప్త్యధ్యాయమున దివ్యమానుషపాతాళీయాది అర్థభేదములు, లక్ష

* ఇది బరోడా గైక్వాడు ఓరియంటల్ సీరీసులో ఒకటవ సంఖ్యగా ప్రకటితమయినది. వెల రు. ౨-౮-౦.

ణములు, నదీ పర్వత సముద్రాదివర్ణనములు, వస్తుస్వరూప విభేదాదులు గలవు. పదవదగు 'కవిచర్యా-రాజచర్యా' ధ్యాయమున కావ్యవిద్యాపరిసంఖ్యానము, కవిలక్షణము, కవికి వలసిన గృహాదిపరికరములు, భాషానిలయము, లేఖక, లేఖనసాధనాదులు, కవి దినచర్య, స్త్రీలకు కవిత్వార్హత, రాజుయొక్క కవిసమాజవర్ణనము, రాజచర్య, రాజసభలయందు కావ్యశాస్త్రపరీక్ష సన్మానాదులు మొదలయినవి వర్ణితములు. పదునొకండవదగు శబ్దహరణాధ్యాయమున పద, పాద, అర్థ, వృత్త, ప్రబంధరూపములయిన శబ్దహరణలక్షణములు, ఉత్పాదక, పరివర్తకాది కవులు, వారి లక్షణములు కలవు. పండ్రెండు, పదుమూడు అధ్యాయములు అర్థహరణమును గూర్చినవి. వీనియందు అర్థభేదములు, హరణములు, వివిధశబ్దార్థహరణములవలన నయిన కవి విభేదములు, అర్థయోనివిశేషాదులు మొదలగు 32 అర్థహరణవిశేషములు వర్ణితములు. పదునాలుగవదగు జాతి ద్రవ్య క్రియాసమయస్థాపనాధ్యాయమున కవిసమయములు, స్వర్గ్య భౌమ పాతాళీయాది తద్భేదములు, వాని నియమములు మొదలగునవి కలవు. పదునైదవదగు గుణసమయస్థాపనాధ్యాయమున, పదునారవదగు స్వర్గ్యపాతాళీయ కవిరహస్యస్థాపనాధ్యాయమున వివిధ కవిసమయవిశేషములు వర్ణితములయినవి. పదునేడవదగు దేశవిభాగాధ్యాయమున జగద్విభాగములు, ద్వీపవర్షాదు పరిగణనము, భారతవర్షము పూర్వదక్షిణాది దేశవిభాగములు, (కవికాలము నాటి యాదేశముల విభాగస్థితి యిందు చక్కగా తెలియగలదు) వానియందలి నదీ సముద్ర పర్వత జనపదాదులు, దిక్కులు, తత్తద్దేశీయుల శరీరరూపవర్ణనము మొదలగునవి వర్ణితములు. పదునెనిమిదవదగు కాలవిభాగాధ్యాయమున సౌరచాంద్రమానములు, ఋతువులు, ప్రత్యేకము వాని వర్ణనము, వాని సంధి, శైశవాద్యవస్థలు మొదలయినవి వర్ణితములు.

ఇట్లు వివిధాపూర్వవిషయసంపన్నమయిన యీ గ్రంథమునందలి లక్షణములు కవికృతములు, అన్యకృతములు నగు సరసలక్ష్యశ్లోకములతో వెలయుచున్నవి. ఇది సాహిత్యస్వరూపజిజ్ఞాసువులు అవశ్యము పఠింపదగిన గ్రంథము. ఇక అనువాదమునుగూర్చి:

ఒకభాషలోనున్న ఏ సామాన్యగ్రంథమునుగాని ఇంకొకభాషలోనికి సరిగా బరివర్తించుట సులభమయిన పని కాదు. ఇక శాస్త్రములమాట చెప్పనక్కరలేదు. అందును సూత్రరూపమున నున్నది యీ కావ్యమీమాంస దీనికి వృత్తిగాని, వ్యాఖ్యానముగాని లభింపలేదు. ఇట్టిగ్రంథమును ఎట్లో అనువాదకులు పరిశ్రమించి యిట్లు అనువదించినారు లక్ష్యములుగ నుదహరించిన శ్లోకములనుజేర్చి వానిలో కొన్నిటికి తాత్పర్యార్థమును వ్రాసినారు. కొన్నిచోట్ల కవిసమయపరిగణనము మొదలయినచోట్ల స్వయము అనువాదకులు ఇతరలక్షణగ్రంథములనుండి ఆయాప్రకరణమునకు పరిపోవుభాగముల నుద్ధరించినారు. గ్రంథకర్తృదేశకాలాదులను, గ్రంథవిశేషాంశములను దెలుపుపీఠికను జతచేసినారు.

ఇది సాహిత్యవిమర్శకగ్రంథము. ఇట్టిగ్రంథములు నిర్దుష్టములుగ నుండవలసినవి. అట్లుగాక ఇందు స్ఖాలిత్యములు దొరలినవి. చూడుడు మచ్చునకు గొన్ని:

"మూ: "గుణాదానపరః కశ్చిద్దోషాదానపరోఽపరః;
గుణదోషాహృతిత్యాగపరః కశ్చన భావకః."

అను: (ఉత్తరార్థమునకు) "గుణదోషపరిత్యాగరీతులను విమర్శించి నెగ్గ దేర్చుచుందురు." పు 23.

ఇది "ఒకానొక భావకుడు గుణములను స్వీకరించి దోషములను పరిత్యజించును" అని యుండదగును.

మూ: "సా చ షోఢా, ద్వంద్వాది భేదేన;
తత్ర షట్సమాసీ సమూక్తమ్."

అను: "ఇట్టిసమాసవృత్తి ద్వంద్వాదిభేదముచేత పదునారువిధములుగా నున్నది. (అనగా సమాసము పదునారు విధములని యర్థము.)" షోఢా అనగా ఆఱువిధములు అని అర్థము, కాని "పదునాఱువిధములు గలిగినది" కాదు.

మూ: "పితుర్గురోర్నరేంద్రస్య సుతశిష్యపదాతయః;
అవివిచ్యైవ కావ్యాని స్తువన్తి చ పఠన్తి చ."

అను: "తండ్రి, గురువు, ప్రభువు, కొడుకు, శిష్యుడు, పదాతి, అనువీరు చేసినకావ్యరచనలను గుణాగుణవివేచన చేయకయే లోకులెల్లరు నాదరమున స్తుతించుటయును, పఠించుటయును కూడ ప్రపంచమునకు స్వాభావికమై యున్నది"                ప్రు. ౧౫౫.

ఇది "తండ్రికావ్యములను పుత్రుడు, గురువుకావ్యములను శిష్యుడు, రాజుకావ్యములను పదాతులు వివేచన చేయకయే స్తోత్రము చేయుదురు; చదువుదురు" అని యుండదగును.

మూ: "అన్తరాన్తరా చ కావ్యగోష్ఠీం శాస్త్రవాదా నను జానీయాత్. మధ్వపి నానవదంశం స్వదతే."

అను: "ఇట్టులు అప్పటప్పటికిని కావ్యగోష్ఠిని శాస్త్రవాదములను జరుపవలయును. నిజమైన తేనెతొట్టయే యైనను పిండకయే స్రవించునా ?"

ఇది "కావ్యగోష్ఠుల నడుమనడుమ శాస్త్రవాదములను కావింపవలెను. తేనెయైనను నంజుకొనుటకు లేక రుచింపదు." అని యుండదగును.

మూ: "కోపా న్మానిని కిం స్ఫురత్యతితరాం శోభాధరస్తే౽ధరః, కింవా చుంబనకారణాద్ధయిత నో వాయో ర్వికారా దయమ్;.................................సమాలింగితః."

అను: "ఓ మానినీ, నీయధరము కోపమునంజేసి ఒకవిధమగు శోభను (అనగా నెఱ్ఱదనమును) ధరించినది యైనను, మీదుమిక్కిలి శోభిల్లుచున్నది.........."

ఇట "స్ఫురతి" అను క్రియకు అదరుచున్నది అని అర్థము, కాని "శోభిల్లుచున్నది" అని కాదు.

మూ: "నేచ్ఛతి పాశాశంకీ కాకో దత్తమపి పథికగృహిణ్యాః; అవనతకరతలోద్గలితవలయమధ్యస్థితం పిండమ్." (ప్రాకృతమూలమునకు ఛాయ.)

అను: "పాంథకుటుంబినిచే తనకుతినుట కొసంగంబడినదైనను వంచినచేతినుండి ఎత్తినవలయమధ్యమునంగల పిండమును పాశమును నాశంక గలదియై కాకము ముట్టుకొన నిచ్ఛగించుట లేదని భావము."

"పథికగృహిణి(దేశాంతరగతుడయినవాని ప్రియురాలు. విరహిణి యనుట) కాకమునకు పిండమును పెట్టినది. పిండము నుంచునపుడు ఆమె చేతినుండి (విరహిణి యగుటచే మిక్కిలి కృశించియున్నది కావున) గాజు దూసి క్రింద బడినది. పిండము గాజునడుమ నున్నది. ఆ గాజును జూచి యది తన్ను పట్టుకొనుటకై పన్నిన యుచ్చు అని కాకి శంకించి పిండమును సమీపించి తిన నిష్టపడదయ్యెను." అనునర్థము సమంజసమగును.

మూ: "ఆననేందు శశిలక్ష్మకపోలే సాదరం విరచితం తిలకం యత్; తత్ప్రియే విరచితావధిభంగే ధౌత మీక్షణజలైః తరళాక్ష్యాః."

అను: "ముఖచంద్రునికి శశిలక్ష్మప్రాయముగా (లాంఛనముగా) నున్న తిలకము నాదరముతో దిద్దుటజేసి తరళాక్షియొక్క కన్నీళ్లతో మకరికాపత్రములు తుడిచి వేయబడిన ట్లున్నవనియర్థము. అనగా పెరవారి కలంకారముచేసిన మూపోపమిచే దము యలంకారము నూడ్చిన ట్లాగా నిచ్చట ముఖచంద్రునికి చిహ్నముగా తిలకము దిద్దుటచేసి నేత్రములు అనూయుచే మకరికాదిపత్రభంగమును దుడిచి వైచుకొన్నవని భావము."

"ఏతిలకము (అలంకారార్థము కపోలమున నుంచుకొను తిలకము—బుగ్గచుక్క) ముఖచంద్రునకు శశిచిహ్నముగా ఆదరముతో కపోలమున విరచింపబడెనో ఆ తిలకము తనకాంతుడు పెట్టిన గడువునకు రాకపోవుటచే దుఃఖితయైన తరళాక్షియొక్క కన్నీటిచేత కడుగబడినది" అని యుండదగినది.

మూ: "మాద్యచ్చకోరేక్షణతుల్యధామ్నః
ధారాం దధానా మధునః పతంతీమ్;
చంచ్వగ్రదష్టోత్పలనాళహృద్యా
హంసీవ రేజే శశిరత్నపాత్రీ."

అను:"మత్తచకోరనేత్ర దృష్టితో దుల్యమగు (నెఱ్ఱదనముగల) తేనెధారను, పైనుండి జాలువాఱు దానిని ముక్కు దెఱచికొని పట్టుకొనుచున్నదై పక్షి ముక్కుకొనతో గొఱకిపట్టుకొనిన నెత్తికలువకాడ గల హంసాంగనవోలె ప్రకాశించెనని యర్థము."           ప్రు. ౨౫౯,

"మత్తచకోరనేత్రముతో తుల్యమయిన కాంతిగల సువర్ణముయొక్క క్రిందపడుచున్న ధారను ధరించిన చంద్రకాంతపు గిండి (కమ్మచెంబు) మురుక్కొనతో (ఎఱ్ఱ) కలువకాడను పట్టుకొనినహంసాంగనవలె ప్రకాశించెను." అని యుండదగును.

మూ. "హలమగు బల స్యైకో౽నడ్వాక్
హరస్య న లాంగలం;
క్రమపరిమితా భూమి ర్విష్ణో
ర్నగౌ ర్నచ లాంగలమ్......"

అను: "ఉన్నచోటినుండి కదలని (మొద్దు) నాగలి బలరామస్వామికి కలదు......" పు. ౩౩౬.

ఇది: 'అగు హలం'=ఎద్దులేని నాగలి అని అర్థము చెప్పవలెను. అగు (నవిద్యతే గౌః యస్య తత్)= దేనికి ఎద్దులేదో అది 'అగు.'

మూ. సా తత్ర చామీకరరత్నచిత్రైః
ప్రాసాదమాలా వలభీవిటంకైః......"

అను: "వింజామరల యందు చెక్కబడి రత్నముల చేత చిత్రవర్ణములుగలదైన......" ౩౪౯

'చామీకర' అనగా 'బంగారు' కాని వింజామర కాదు. 'చామీకరం జాతరూపం మహారజతకాంచనే' అని అమరనిఘంటువు.

మూ. "అపంకిల తటావటః......"

"అనగా బంకిలములుగాని తటములందలి వటవృక్షములతోను......" పు. ౩౫౧.

"అపంకిల + తట + అవటః= అపంకిలతటావటః. అవటఃఅనగా 'పల్లము' 'వటవృక్షము' కాదు. 'గర్తావటౌ భువి శ్వభ్రే' అని అమరము. (గట్టులనున్నపల్లముల బురద ఎండిపోయెనని భావము).

మూ. "జడచందనచారవ స్తరుణ్యః
సజలార్ద్రా స్సహతారహారమాలాః;
కదలీదళతల్పకల్పనస్థాః
స్మర మాహూయ నివేశయంతి పార్శ్వే."

"జలచందనసుందరు లగు తరుణులును, జలార్ద్రములగు తారహారమాలికలును, అరటియాకుల పాన్పులును, మన్మథుని పిలిచి తమపార్శ్వమునఁ గూర్చుండఁబెట్టుకొనజాలియున్నవి" పు. ౪౦౦.

ఇది గ్రీష్మర్తువర్ణనము:

ఆగని-నీరుగందపు మైపూత (పలుచనిగందము) చేసుందరులయినవారును, చల్లదనముకొఱకు నిరంతరము నీటిని చల్లుకొనుచుండుటచే తడిసిన (శరీరములుగల) వారును, ముత్తెముల పేరులను ధరించినవారును, అగు యువతులు అరటియాకులచే కల్పింపబడిన తల్పములపై కూర్చున్నవారయి మన్మథుని పిలిచి (తమ) ప్రక్కను కూరుచుండబెట్టుకొనుచున్నా" రని యుండదగినది.

మూ. "చ్యుతసుమనసః కుందాః
పుష్పోద్గమే ష్వలసా ద్రుమాః,
మనసిచ గిరం గృహ్ణంతీ మే
కిరంతి న కోకిలాః;
అథచ సవితు శ్శీతోల్లాసం
లునంతి మరీచయో,
నచ జరఠతా మాలంబంతే
క్లమోదయదాయినీమ్."

అను: "......కోకిలములు మనస్సులోని మాటను స్వీకరించుటలేదు. అనగా వినుట లేదని భావము. మరీచలతలు అనగా మిరియంపుతీగలు, సూర్యునియొక్క శీతోల్లాసమును లూనము చేయుచున్నవియే గాని క్లమదాయిని యగు జరఠతను అవలంబించుటలేదు. అని భావము..." పు. ౪౦౧.

ఇది శిశిరవసంతర్తువుల సంధి కుదాహరణము:

'కోకిలములు వాక్కును మనములందు గ్రహించినవికాని వెలుపలికి పలుకజాలకున్న' (కోకిలములు కూయ ప్రయత్నించుచున్నవి కాని కూయజాలకున్నవి.) వనియు "సూర్యకిరణములు శీతోల్లాసమును పోగొట్టుచున్నవి కాని, శ్రమమును గలిగించు పరిణతిని పొందకున్న" వనియు అనదగినది,

మూ. "ప్రవర్తతే కోకిలనాదహేతుః
పుష్పప్రసూః పంచమజన్మదాయీ;
తేభ్య శ్చతుర్భ్యోఽపి వసంతమిత్ర
ముదఙ్ముఖో దక్షిణమాతరిశ్వా."

అను: "కోకిలనాదములకు కారణుఁడగు వసంతుఁ డచ్చటఁ గలఁడు. మన్మథుఁ డచ్చటఁ గలఁడు. పంచమ స్వరముఁ బలుకు పికము లచ్చట గలవు ఈ కోకిలవసంత మన్మథశుకము లను నల్వురుమిత్రులకును తోడుగ దక్షిణానిలము ఉత్తరాభిముఖమై ప్రయాణోన్ముఖమై యుండును." పు. ౩౬౦.

ఇట మూలమున "తత్ర వింధ్యాదయః ప్రతీతస్వరూపాః, మలయవిశేషాస్తు చత్వారః." అని మలయవిశేషములు నాలుగు పేర్కొనబడినవి. తరువాత పై శ్లోకము గలదు. ఆ నాలుగు విశేషములలో చేరని 'దక్షిణమారుతము' ఈ శ్లోకమున వర్ణితమయినది. కావుననే 'తేభ్య శ్చతుర్భ్యః' అనుట. ఇక శ్లోకమునకు "నాలుగు శ్లోకముల చెప్పిన విశేషములకంటెనుగూడ కోకిలకు కూతకూయ శక్తికలుగుటకు కారణమయినదియు, పూవులు పూవజేయునదియు, పంచమస్వరముయొక్క ఉత్పత్తిని కలిగించునదియు (పరిణతమగు కోకిలధ్వనియే పంచమస్వరము), వసంతమునకు నెచ్చెలియునగు దక్షిణవాయువు ఉత్తరపు మొగము గలదయి (మలయపర్వతమున) ప్రవర్తించుచున్నది" అని అర్థము చెప్పుకొనుట పొసగును. పై శ్లోకములచే వర్ణితములైన నాల్గు విశేషణములవలన మలయమున నీదక్షిణమారుతము ప్రవర్తించుచున్నదనియు తేలుచున్నది. మలయపవనము మలయపర్వతమున కుత్తరదిక్కుననే వీచునని మతాంతరము .................."

గ్రంథములో నింకను ఇట్టివి ఎడనెడ కాన్పించుచున్నవి.

ఇట్లగుటకు కారణములను అనువాదకులు ఇట్లు చెప్పియున్నారు: "ఈగ్రంథమును ముద్రించుటలోఁ దగినంత స్వాస్థ్యము, తోడ్పాటు, ప్రజ్ఞావిభవము లేనందుచేత ననేకములగు నచ్చుతప్పులును, ఆంధ్రీకరణవ్యత్యయములును దొరలినవనుట నిక్కము." (చూ. పీఠిక పు. ౪౫౫.) ఇందువలన అనువాదకుల బాధ్యత తప్పునేమో కాని అనువాదముయొక్క సంస్కరణావశ్యకత తప్పజాలదు. అనువాదకులు తమ "నియమము ననుసరించి మూలగ్రంథమునుగూడ ముద్రించవలసియున్న"దన్నారు. అట్లుచేయజాలమికి కారణములను చెప్పినారు. కాని, ఎట్లును మూలమున సగమునకు మిగిలియున్న లక్ష్యభాగమును ఇందు చేర్చియే యున్నారు. మిగిలిన అల్పమాత్ర లక్షణభాగమును గూడ ప్రయత్నించి చేర్చియుండిన బాగుండెడిది.

—'భారతి'

---

## శ్రీ త్యాగరాజహృదయము

రచయిత: కె. వి. శ్రీనివాసఅయ్యంగారు. ప్రకాశకులు: యస్. ఆది అండు కంపెని, మద్రాసు.

క్రౌను సైజు ౫౩౫ పుటలు. వెల రు. ౪.

దాక్షిణాత్యసంగీతకళావైభవమునకు గొప్పవికాసము నిడిన త్యాగయ్యగారి కృతులు అజ్ఞులసంపర్కమున సాంకర్యశైథిల్యాదులకుపాల్పడి తమసహజసంపద కోల్పడుచుండ, వానిని నిర్దుష్టముగ నిలువబెట్టుటకుగా శ్రీ కె. వి. శ్రీనివాసయ్యంగారు పూనుకొని దాదాపు ౩౫౦ కృతులను త్యాగయ్యగారి శిష్యప్రశిష్యాదులవలన సేకరించి, ఆంధ్రసాహిత్యమున సహా అవి గొప్పరచనలగుటచే తనుశక్తికొలది భాషాదోషాదులు తొలగించి సంస్కరించి, భక్తాగ్రేసరుడగు ఆయన హృదయవిన్యాసము ఆ కృతులలో నెట్లు ప్రతిఫలించినదియు అర్థములు, విశేషార్థములు మున్నగు వివరణములవలన వెల్లడించుచు 'త్యాగరాజహృదయము'ను ప్రకటించినారు. ఇం దిది తొలిసంపుటము. ఇందు ౭౫ కృతు లున్నవి. సంగీతవిద్యాప్రియుల కిది చాల ఉపయోగకరము. ఏలయన, ఇందు ఆయా రాగముల సవిస్తరలక్షణములును, ప్రాచీనాధునికసంప్రదాయ సంబంధాదికమును, ప్రయోగములందు వాని గతివిశేషములును మున్నగు శాస్త్రవిశేషములు తెలియజెప్పుచు, ప్రతి కృతికి పెక్కు సంగతులతో సహా స్వరములు చూపినారు. మొట్టమొదట త్యాగరాజు తన తారకమంత్రము ౯౬ కోట్లు పునశ్చరణ అయి రామ

లక్ష్మణులు ప్రత్యక్షమై అంతర్హితులు కాగా చెప్పిన తొలికీర్తనగ ప్రసిద్ధి కెక్కిన అఠాణారాగ, ఆదితాళ యుక్తమగు

'ఏల నీదయ రాదు పరాకు చేసెద-
వేల సమయము కాదు-'

అను కృతి, ఇందుమొట్టమొదట వేసినది, తప్ప తుదివఱకును గల కృతులను వాని మేళకర్తలక్రమమున పొందించినారు.

రాగలక్షణవివరణసందర్భమున కాంచిన పక్షాంతర, మతభేద ప్రయోగపరిణామాది శాస్త్రచర్చ పండితులకును, పని చెప్పనదై మెప్పు గనదగి యున్నది. ఆహిరి, తోడి, భైరవి మున్నగు రాగముల విషయము లిందులకు మంచితార్కాణములై, వారిలక్షణాభిజ్ఞత నే కాక లక్ష్యపరిజ్ఞానసౌష్ఠవమును చాటుచున్నవి.

ప్రతి కీర్తనకును తొలుత దాని భావమున, వాగ్గేయకారుని ఆశయమును—తాత్పర్యమును—తెలియజేయు నవతారిక, పిదప రాగ, తాళనామాంకితముగ సాహిత్యము, అందు అధోజ్ఞాపికలలో పాఠాంతరములు, వానివిషయమై తమ అభిప్రాయ నిర్ణయములు, పిదప ప్రతిపదార్థమును, విశేషార్థము, పిదప రాగలక్షణము తదారోహణావరోహణములు, రాగరంజకములగు ప్రయోగవిశేషములు, పిదప కీర్తనస్వరమును కడు పొందికగా కూర్చినారు.

ఈకృతులలో సాధారణముగ వాడుకలో కానబడు 'గ్రామ్య' ప్రయోగములుతముకునచ్చక, వీరు వానిని 'గ్రాంథికము'గ సవరించిరి అంతకునుకొన్ని నిలిచిపోక తప్పవు. త్యాగరాజే సంగీతమునకు, గ్రామ్యతకు అనువగు కొన్ని, 'గ్రామ్య' ప్రయోగములు కావలెనని కావించిన ట్లగపడును. హృదయమునుండి ద్రవించు భక్త్యుద్రేకమును సరసతరముగ ధరింపగల ప్రయోగములు గ్రామ్యమున దొరకుచో ఆయన వెనుదీయలేదేమో.

'ఉపచారము చేసేవా-
రున్నారని మఱువకు రామ'-

అనుచో, 'ఉపచారము చేసెడువారు' అన్నచో చెవికి స్వతః అది అంతఇంపు కూర్పకున్నది: అచ్చట స్వరవిన్యాసమును('రీ;—గారీగా;'- లోనగునది) గమకముగా అంత మేళవింపకున్నది. ఇట్టివాడుకలు ఆభక్తిరసికుని కవితకుదొసగులై లోటుతెచ్చునని కానక్కఱయు లేదు.

పీఠికయందు గ్రంథకర్త త్యాగరాజుజీవిత సంగ్రహమును, అయన 'హృదయము'ను చెప్పినారు. ఇందు ఆయన అద్వైతిఅయియుండి పిదపవిశిష్టాద్వైతిగ మారెనని స్వీకరించిరి. శివస్తోత్రములగు కృతులును త్యాగయ్యగారివి కానబడును. త్యాగయ్యకేవలము రామునిష్టదైవతముగ నర్చించినంతమాత్రమున విశిష్టాద్వైతి యననక్కఱ లేదు. సరి; యిట్టివి యీ గ్రంథము విషయమున ఎగదీయునవి గాని, దిగదీయునవి గాని కావుగదా.

శ్రీ 'ఆది అందు కంపెని'వారు ఇట్టి గ్రంథముల ముద్రించి శుభకార్యోత్సాహమును ప్రశంసాసహముగ సార్థక మొనర్చుకొనుచున్నారు.

కొం. జ.

---

## పంచముల చరిత్రము

గ్రంథకర్త:—శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య జి. యస్. బి. సరస్వతీస్వాములవారు. రాయలు సైజు, ౭౮ పేజీలు, పీచు కాగితములు, కాగితపు బైండు. ౧౯౩౦ సం. వెల ౦-౮-౦.

ఇది పంచములనబడుజాతివారి చరిత్ర-అనగా వేదకాలమునుండి నేటివరకు ఆజాతివారిస్థితిగతు లిందు వ్రాయబడినవి. స్వాములవారు పూర్వాచార పరాయణులవలె తార్కికజ్ఞానము విడిచి మూఢవాదము చేయువారు కారు. వీరు వేదములందును, పురాణములందును ఉన్న విషయములున్న వున్నట్టుగా తీసికొనకూడదనియు, ఏలయన అప్పటిరచయితలు యథార్థములను అట్లే చిత్రింపక వాటిని అతిశయముగ వ్రాసిరనియు, అంతేగాక తర్వాతివారు పలుమారు తమ యిచ్చవచ్చినట్లు తమ కనుకూలముగా నుండునట్లు మాటిమాటికి సవరించుచు వచ్చుచుండి

రనియు, అందుచేత ఇతిహాసపురాణాది గ్రంథములలోని విషయములను మనము విమర్శించకుండా నమ్మకూడ దనియు దృష్టాంతసహితముగా వ్రాసియున్నారు. స్వాములవారు ఇట్టి నూతనపద్ధతి నవలంబించి నిష్పక్షపాతముగా పూర్వగ్రంథములను విమర్శించియున్నారు. "కాలిక్రిందిపురుగుకన్న హీనముగా జూడబడు పంచమ సోదరులస్థితిని" స్వాములవారు గ్రహించి హిందూజాతికి మేలు చేయగోరి పంచములు హిందువులలోనివారే కాని వేరు కారనియు, అస్పృశ్యతను హిందువులు విడిచివేయవలెనని యుపూర్వగ్రంథము లాధారము చేసుకొని వ్రాసియున్నారు. ఈగ్రంథము కేవలముధర్మశాస్త్రములపై నాధారపడెదమని పల్కెడు సనాతనులను, పూర్వగ్రంథస్థవిషయములను పొందుపరచి వారివారి వాదములను ఖండించుటకు గాను వ్రాయబడినది. తక్కినవారందరికి అవతారపురుషుడగు గాంధిమహాత్ముడు అస్పృశ్యతను విడువుడని యుపదేశించినాడు. కావున మనకిక ధర్మశాస్త్రాధారము లవసరము లేదు. ఖండనములయెడ మనము పక్షపాతబుద్ధిమాని యికనైన దేశమభివృద్ధి చేసికొందుముగాక!

శైలి—గ్రాంథికము, సరళముగా నున్నది. స్వాములవారు పురాణగాథలకిచ్చిన పరిశిష్ట(Intepretation) లెంతయో సమంజసముగా నున్నవి: వీరు ఇట్టి గ్రంథములింకా పెక్కువ్రాసి దేశసేవచేసెదరని నమ్ముచున్నాను.

గ్రంథము దొరకుచోటు: గ్రంథకర్త, గోలకొండ పత్రికాకార్యాలయము, త్రూపుబజారు, దక్షిణహైద్రాబాదు.

ఏ. కా.

## జడగంటలు

గ్రంథకర్త—చెలికాని సత్యనారాయణ గారు. పద్మనాయక గ్రంథమాల, ద్వితీయ కుసుమము, క్రౌన్ సైజు, ౭౬ పేజీలు, మెరుగు కాగితములు, కాగితపు బైండు. సం. ౧౯౩౦. వెల ౦-౮-౦.

ఇదియొక కథలసంపుటి. ఇందుమూడేకథలుండుట చేతను, జడగంటలు మూడేకనుకను గ్రంథకర్త యీగ్రంథమునకు జడగంటలని పేరు పెట్టెను. ఇందలి కథలన్నియు ఆధునికములు. ఇప్పటికాలపు విషయములనుండి యితివృత్తము గ్రహించి వ్రాయబడినవి. వీటియొక్క యుద్దేశము సంఘసంస్కరణము. కవియొక్క యుద్దేశమెంతయు మెచ్చదగియున్నది. కాని కథలయల్లిక మాత్రము కొంత విపరీతముగా నున్నది. ఘటనలయందు యథార్థము కానరాక కృత్రిమత కానవచ్చుచున్నది. ఇది మిగుల రసభంగకరము.

ఉదా:—'రాధానందము'లో రంగనాథునిని విపరీతముగా తుదముట్టించి రాధను ఆనందరావునకిచ్చి పెండ్లి చేసెను. ఈవిపరీతమరణము కథాకల్పనకెంతయు లోటు తెచ్చుచున్నది. అసహజముగనున్నది. 'పత్నీదాన'మందు పాత్రల మనఃప్రవృత్తుల నెంతమాత్రము లెక్కచేయక లలిత శర్మచేత అతనిభార్యను అతని మరణమునకు వెనువెంటనే మురళీధరరావున కిచ్చి పెండ్లిచేయించెను. ఇది కూడ కల్పనాప్రౌఢిమకు లోటే. 'పుత్రస్వీకారము,' చక్కగా నున్నది.

శైలి—కవి పాత్రలకొకభాష, తనకొక భాష యేర్పరచుకొనెను. పాత్రలకు వ్యావహారికభాష, కవికి గ్రాంథికభాష. పఠితలకు వ్యావహారికమును చదివినపిమ్మట కృత్రిమమగు గ్రాంథికము చదువుట కసహ్యముగనున్నది. యథార్థవిషయములనుండి మరల భావనాప్రపంచమునకు పోవుచున్నానునిపించును. ఈ మేళన మెంతమాత్రమును రసవంతముగ లేదు. ఇట్టికథలకు వ్యావహారికభాషయే యుచితమయినది. దాననే వ్రాసిన రసవంతమగనుండును. గ్రంథకర్త ఈగ్రంథముయొక్క పునర్ముద్రణమున నీలోటును తీర్చి వ్యావహారికముననే ముద్రింతురని తలచుచున్నాను. యథార్థత్వ (Reality) ప్రాకృతీకరణముల (Naturalization) కాలముగదా! సంఘసంస్కరణము నభిలషించు గ్రంథకర్త ఇట్టి భాషాసంస్కరణమునకును వెనుదీయబోరు.

వలయువారు:— మేనేజరు, పద్మనాయక గ్రంథమాల, పెంటనాగులవలస, రాజాం, విశాఖపట్నం జిల్లా అని వ్రాయవలెను.

ఏ. కా.

## బాలనీతికథావళి

గ్రంథకర్త్రి:—శ్రీమతి కనపర్తి వరలక్ష్మమ్మగారు.

క్రౌను సైజు, ౧౫౦ పేజీలు, మంచి కాగితములు. కాగితపుబైండు, సం. 1930. వెల ౧-౬-౦.

ఈ పుస్తకము 'బాలవినోద' అను హిందీగ్రంథము ననుసరించి వ్రాయబడినది. ఈ గ్రంథోద్దేశము బాలురకు నీతిబోధచేయుటయే. గ్రంథకర్త్రిగారు ఇట్లు వ్రాయుచున్నారు: "అద్భుతకల్పనలతో నిండిన పౌరాణిక గాథలనేకమిప్పుడు మనబాలురకు పాఠ్యపుస్తకములుగా నిర్ణయింపబడుచున్నవి. అవి యెంత నీతిగర్భితములైయున్నను యమానుషీతము లగు మహిమలతో నిండియుండుటచే పురాణపురుషులు వేరు, మనము వేరు, వారుచేసిన పనులను మనముచేయజాలము, అను భావము బాలురకు కల్గు నవకాశము గలదు." ఈ వాక్యము లెంతయు నిజము. పురాణగాథలు పూర్తిగా చారిత్రకములు, యథార్థములు కావు. అప్పటికవులు ఉన్న విషయము లున్నట్లుగా చిత్రింపక అతిశయమును కల్పించివ్రాసిరి. అంతేగాక తరువాతివారు పలుమారు తమయిచ్ఛ వచ్చినట్లు తమ కనుకూలముగ నుండునట్లు, మాటిమాటికి సవరించుచు వచ్చిరి. కావున, పురాణవిషయములను మనము విమర్శింపక తీసుకొనరాదు. వాటికి కొంతపరిశీలన నిచ్చి యథార్థమును తెలిసికొనవలెను. ఇట్టి సందర్భములో పురాణకథలను పిల్లలచేత పఠింపచేయుట వ్యర్థము. వాటియొక్క సత్యమునుగూర్చి మనము సందేహించుచున్నప్పుడు వాటిని చదివి మనము హర్షింపలేము. అట్లుగాక చరిత్రవిషయములను వ్రాసి నీతులు చేర్చుట మేలు. గ్రంథకర్త్రి ఈమార్గమునే తలపెట్టి యీగ్రంథమును వ్రాసెను.

ఇందలి కథలు మానవులయొక్క యున్నతాదర్శములు, ఉన్నతగుణములు, వాటిసాధనము, పర్యవసానమును బోధించి మనలను పులకితగాత్రులనుజేసి అశ్రుపూరితలోచనులుగా జేయును. సత్యము, కరుణ, ప్రేమ, అనునవి యీశ్వరునకు ప్రీతిపొందు గుణము లని మనకు గట్టిగా బోధపడును. ఇట్టికథలు బాలురకు నీతిని తప్పక బోధించును. చిన్న వేగాక పెద్దలుకూడ ఈ గ్రంథమును చదువవలసినదే.

శైలి:—గ్రాంథికము, సరళము. భావములకు తగినది. బంగారమునకు పరిమళ మబ్బినట్లున్నది. భావమునకు శైలియు, శైలికి భావమును వన్నె తెచ్చుచున్నవి.

గ్రంథకర్త్రి యిట్టి గ్రంథములను మరికొన్నిటిని రచించి ఆంధ్రవాఙ్మయమున కుపకారము చేయునని తలచుచున్నాము.

వలయువారు:—పాలపర్తి భావనారాయణగారు టీచరు, బాపట్ల, గుంటూరుజిల్లా అని వ్రాయవలెను.

టి. కా.

---

## శ్రీవివేకానందస్వామి జీవితము-ప్రథమభాగము

గ్రంథకర్త— బులుసు వెంకటేశ్వర్లు గారు. డిమ్మీసైజు, ౨౫౦ పేజీలు, తెల్ల కాగితములు, కాగితపుబైండు, సం. ౧౯౩౦, వెల ౧-౮-౦.

ఈ గ్రంథము ఆంగ్లమందు అయిదు సంపుటములుగా వ్రాయబడిన 'శ్రీ వివేకానందస్వామి జీవితము' యొక్క సంక్షిప్తానువాదము.

గ్రంథమందు వివేకానందుని జీవితమే గాక శ్రీ రామకృష్ణ పరమహంసజీవితము కూడ పూర్ణముగానే వ్రాయబడినది. ఏలయన శ్రీరామకృష్ణుని జీవితము తెలియకయే వివేకానందునిజీవితము పూర్తిగా గ్రహింపలేము. ఆజీవితములు రెంటికిని అట్టి పరస్పర సంబంధము కలదు.

వివేకానందుడు దైవాంశసంభూతుడని శ్రీరామకృష్ణుడు చెప్పియున్నాడు. ఇతని బాల్యమును రామకృష్ణునిజీవితము వలెనే భగవద్భక్తియుతమై యున్నది. నాస్తికులుకూడ శ్రీరామకృష్ణుని జీవితము చదివినచో ఆస్తికత్వము నపేక్షకలవారగుదురు. అట్టి అవతారపురుషునకు ప్రియశిష్యుడైన వివేకానందుని జీవితము కూడ మనకు ప్రియతమమే. శ్రీరామకృష్ణుడు లోకోపకారార్థము వివేకానందుని కొంతమాయచే గప్పి కేవలము నిర్వి

కల్పసమాధిలో బడిపోకుండ జేసెను. శిష్యుడు కూడ గురువు యొక్క అభీష్టము నెరవేరునట్లు లోకకల్యాణము నే ఆశించి లోకసేవయందే తన జీవితమును ధారపోసెను.

గ్రంథకర్త కేవలము పూర్వాచారాభిలాషి యగుటచే మతసంఘసంస్కరణముల నక్కడక్కడ తూలనాడి యున్నాడు.

శైలి—గ్రాంథికము, సంస్కృతపదములు, సమాసములు అధికము. విద్యాధికులకేగాని పామరులకు, స్త్రీలకు అందుబాటులో లేదు. గ్రంథవిషయమందరు జనులు గ్రహించి ఆనందింపదగినదైయును కఠినశైలివల్ల అల్పప్రయోజనమైనది. సరళశైలిలో నున్న మెప్పుదగి యుండెడిది. ఈ గ్రంథము రెండవముద్రణమందు సరళశైలిలో వ్రాయబడి ప్రకటించబడుట యుచితము. కావున ముద్రింపబడబోవు రెండవభాగము తేలికైన సులభశైలి నుండినచో మెరుగు.

వలయువారు—బాలుసు వెంకటశ్రీరామమూర్తి, కాకినాడ, అని వ్రాయవలెను.

ఏ. కా.

---

# గ్రంథస్వీకారము

## అంటరానివా రెవరు?

క్రౌను సైజున ౨౧ పుటలు. వెల రెండణాలు.

గ్రంథకర్త: బాలా రంగస్వామి గారు. వలయువారు గ్రంథకర్తగారికి పేరిట రాజమండ్రికి వ్రాయవలెను.

---

## శ్రీరామలింగేశ్వర శతకము

క్రౌను సైజున సుమారు 30 పుటలు. వెల రెండణాలు.

రచయితలు: గుంటూరు సీతారామదీక్షితులు మొదలగువారు.

ప్రకాశకులు:— వేం. వే. జగ్గు, ఆంధ్రావళీ గ్రంథమాలిక, గ్రొత్తపేట, ఎలమంచిలి, విశాఖపట్టణము జిల్లా.

---

## ఉత్తరరాఘవము (నాటకము)

డెమ్మీసైజు, పుటలు ౧౧౬, వెల రు. ౧-౪-౦

గ్రంథకర్త—బలిజేపల్లి లక్ష్మీకాంతకవి గారు.

వలయువారికి చిరునామా—బలిజేపల్లి లక్ష్మీకాంత కవి, గుంటూరు.

---

## మిత్రభాషితము (ప్రథమభాగము)

డెమ్మీసైజు, పుటలు ౧౬౪. వెల రు. ౧.

రచయిత—దేవులపల్లి నరసింహశాస్త్రి గారు, మండపేట, గోదావరిజిల్లా.

---

## పశు పరీక్ష

(ప్రవేశికా సహితము)

క్రౌను సైజున ౪౨ పుటలు. వెల తెలియదు.

ప్రవేశికాకర్త: జగన్నాథశర్మగారు.

చిరునామా:— గంధర్వమహల్, విజయనగరము.

---

## శారదాబిల్లు

క్రౌను సైజు, పుటలు ౧౫, వెల రెండణాలు. పులికొండ పరబ్రహ్మంగారిచే రచితము.

వలయువారిట్లు వ్రాయుడు — పులికొండ పరబ్రహ్మముగారు, చినపారుపూడి, ఉయ్యూరు పోస్టు, కృష్ణాజిల్లా.

---

## ఆంధ్రబర్మీయుల యుద్ధము

డిమ్మీసైజు, పుటలు ౨౦. వెల ౦-౮-౦

గ్రంథకర్త—పిళ్లా కన్నయ్యనాయుడుగారు.

వలయువారీక్రింది చిరునామాకు వ్రాయవలెను: పిళ్లా కన్నయ్యనాయడు, నెం. ౭౫-౧౦౫, మొగలువీథి, రంగూను.

---

## అకాలీలసత్యాగ్రహము (ఆత్మబలి)

డిమ్మీసైజు, పుటలు ౧౦౮. వెల తెలియదు.

గ్రంథకర్త—శనివారపు సుబ్బారావు గారు.

ప్రకాశకులు—సరస్వతీగ్రంథమాల, కాకరపర్రు, పడమటి గోదావరిజిల్లా.

---

## భారతకథలు

క్రౌనుసైజున ౬౧ పుటలు. వెల రు ౧.

గ్రంథకర్త: వెల్లాల మైసూరయ్యగారు. వలయువారీక్రిందివిలాసమునకు వ్రాయవలెను: వెల్లాల మైసూరయ్య గారు, క్లార్కు, డిస్ట్రిక్టు మున్సిఫ్‌కోర్టు, ప్రొద్దుటూరు, కడపజిల్లా.

---

## SIX PROBLEMS AND THE INDIAN YOUTH (ఆంగ్లము)

డి. యస్. రామచంద్రరావుగారిచే రచితము. వలయువారు గ్రంథకర్తగారి పేరిట బెంగుళూరుకు వ్రాయవలయును.

---

### కీ. శే. పెనుమర్తి వేంకటరత్నము గారు

భారతీ వ్యాసరచయితలలో నొకరగు శ్రీయుత వేంకటరత్నముగారియొక్క అకాల *మరణవార్తను వ్రాయ విచారాతిరేకముచే కలము వడకుచున్నది. శ్రీ వేంకటరత్నము గారు భావకులగు యువకులు. వీరిది తెనాలి. వీరి సరసరచనము లాంధ్రవాఙ్మయ వధూటికి నూత్నాలంకారలేశములు. భారతి, అవతరించిన నాటినుండియు, ఎడనెడ, నవ్యవ్యాసనావాసితములగు నీసహృదయుని ఖండకావ్య ప్రసూనములను జడనుముడుచుకొనుచుండెను. నేటితో నది యంతరించినది. దినదినాభివృద్ధిని గాంచియిట్టి నూత్నకావ్య ప్రసూనముల నెన్నిటినో ప్రసవించవలసిన ఈకవితాలత కీకవికుమారుడు మూలకందము. అది నేడు విధివిపాకమున కృళ్లిపోయినది. "పుట్టినవారికి గిట్టకతప్పదు." కావున నీతని దేహమాత్ర వినాశమునకు దుఃఖింపబనిలేదు. కాని యాదేహము నాశ్రయించిన కవితాత్మ వినాశమునకు సహృదయులు దుఃఖింతురు. దుస్సహము, నిరవధికము నగు నీ వియోగము నీతని ప్రియకుటుంబ మెట్లు సహింపగల్గునో! ఐహికానందానుభూతి నుజ్జగించినయీకవికుమారుని యాత్మ అపారపారలౌకికానందానుభూతిని గాంచునుగాక!

—సంపాదకుడు, భారతి.

---

* ఈ వార్త ౨-౯-౧౯౩౦ ఆంధ్రపత్రికయందు ప్రకటితమయినది.

Printed and Published by G, Subbaramayya, at the Andhra Patrika Press, No.7, ThambuChetty St., Madras